శ్రీ

# ఆంధ్ర గద్య వాఙ్మయ చరిత్ర

A History of Telugu Prose Literature.

## Vol I.

ప్రథమసంపుటము

ఇత్యాది

చెన్నపురి ఆంధ్ర సభవారిపోటీపరీక్షలో

రా॥బ॥ కలవల కణ్ణుస్వామి శ్రేష్ఠిగారి

రత్నఖచిత స్వర్ణపతక బహుమానము బడసిన

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు బి. ఏ. గారిచే

రచింపబడినది.



యలమంచిలి.

శ్రీ పార్వతీశ్వర ముద్రాలయమున

బలిరి సత్యనారాయణగారిచే ముద్రితము.

గ్రంథకర్తచే ప్రకటితము.

1923





వెల రు 1-8-0.



కీర్తిశేషులగు

కలవల కణ్ణను శ్రేష్ఠి గారు

Andhra Patrika Press:—Madras.



కీర్తిశేషులగు

కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు గారు

# అంకితము.



ఆంధ్ర విద్వత్పుంగవ పరిత్యాజ్యమై, తదాదరణ రస విహీనతం గృశీభూత యగుచుండిన యాంధ్రగద్యవాఙ్మయము నుద్ధరింప తమ సర్వస్వమును ధారవోసి శాఖోపశాఖలుగా నద్దాని విజృంభింప జేసి యీచరిత్ర యందొక నూతన శక మేర్పరచిన విద్వచ్ఛిఖామణికి, స్వీయ పవిత్రజీవితమును యోగ్య వర్తనమును దేశీయుల కెల్లరకు ననుకరణీయములు నాదర్శప్రాయములుగా జేసి ప్రాతస్మరణీయు డగు మహాత్మునకు, శ్రీకొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులు గారికి యాంధ్ర గద్య వాఙ్మయ చరిత్రమును సభక్తికముగ సప్రణామముగ నంకితము చేయుచున్నాను.

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు.

# పీఠిక.

ఆంధ్ర గద్యవాఙ్మయ చరిత్రమును రచింపనుద్యోగించి యందులకు 'సాదికవి' యనఁదగిన నన్నపార్యుని గద్యరచనలంగూర్చిన యీనిబంధన గ్రంథమును రచించిన మా మిత్రులును శిష్యులును నగు మ॥రా॥రా॥ శ్రీ గొబ్బూరు వేంకటానంద రాఘవరావుగారాంధ్ర భాషాప్రియులకు చిరపరిచితులు. మహారాష్ట్ర సామ్రాజ్య విషయకమగు 'సగుణ' యను నవలను 'వేగుచుక్క' గ్రంథమాలయందు వీరు ప్రకటించి చరిత్రాత్మకమగు నాంధ్రనవలకు సరళమును సరసమునునగు మార్గాంతరమును కల్పించిరి. వీరికాంధ్రగద్యవాఙ్మయము నందలి ప్రీతిమాకళాశాలయందు విద్యార్థిగ నుండినప్పటి నుండియు మెండైయుండెను. అట్టి ప్రీతిదినదినాభివృద్ధి చెందినేటికి సుమన మనోజ్ఞముగ నీగ్రంథరూపమును ఫలించినది.

గద్య వాఙ్మయమును గురించిగాని పద్యవాఙ్మయమును గురించిగాని విపులముగా సహేతుకముగా సప్రమాణముగా ప్రతిజ్ఞా ప్రక్రియాసమన్వయములతో, సభక్తికముగు నిరంతర గ్రంథ పరిశీలనతో గుణవిశేషప్రకాశనమాదర్శముగ రచింపబడిన గ్రంథములాంధ్రమున నతియరుదుగ నున్నవి. ఇట్టి గ్రంథముల లేమియే యాధునికాంధ్రులకు తమ గ్రంథములందు గల యుపేక్షకు నొక కారణమై యున్నది. ఇట్టి తరి నాంధ్రుల పూర్వ వాఙ్మయము నందు ప్రీతియు గౌరవమును సహేతుకముగ పెంపొందించుట జాతీయతా విజృంభణమునకు సాధనమగును గాన నిట్టి యుత్తమ సాధనమును కల్పించిన యీ కృతి కర్త యాంధ్రులకు వందనీయులు.

ఆంధ్రమున గల నిబంధన గ్రంథములు చాలా మట్టుకు ఛందోవిశేషములను విస్తరించి యుదాహరించుచున్నవి. కావ్యలక్షణములను బోధించునవి కొన్ని యున్నను అందాంధ్రకావ్యములనుండి యేర్పరింపబడిన లక్ష్యములు కానరావు. ఆలక్షణములైనను సంస్కృత మర్యాదలననుసరించి యున్నవి. ఇట్టి ప్రాచీన సాంప్రదాయములకును పాశ్చాత్యకావ్య నిబంధనములకును కేవలము పొసగదను భ్రమనేటి విద్యాధికులలో వ్యాపకముగ గలదు. ఇందుచేతనే గాబోలు పాశ్చాత్యకావ్య నిబంధనములతో నాంధ్ర గ్రంథములను గొలిచి నవవిద్యాధికులు కొందరు ప్రాచీనాంధ్ర కావ్యములను నిరసించి యున్నారు. ముఖ్యముగా నిట్టి వారికిని తాము నేర్చిన లక్షణముల కాంధ్ర

కావ్యములనుండి లక్ష్యము లేర్పరించు కొనవలెనని లక్షణపరులకును నీకృతి కావ్యాంజన మగుచున్నది.

ఇందనుసరింపబడిన విమర్శన మార్గము సమన్వయ విశిష్టము. కావ్యగుణము లను, కావ్యోత్పత్తి కారణములను, కావ్య విశేషములకును నవిపుట్టిన కాలములకును గల సంబంధమును, విశాలదృష్టితో, సమన్వయ బుద్ధితో స్థిరపరచి వీటిని ఆంధ్రభారతి మండలి గద్యలనుండి యుదాహరించి యీకృతికర్త ధన్యుడయ్యెను. విమర్శన విధానము పవిత్రమయ్యెను. గద్యరచనల నింతనిపుణముగా నింతటి పాండిత్య విశేషముతో నింత సూక్ష్మదృష్టిని పరిశీలించిన నిబంధన గ్రంథము పూర్వలాక్షణికుల యాంధ్రరచనల యందును అరుదని లక్షణ పరులకును విదితము. దీని కొరకు కృతికర్త చేసిన సాహితీపరిశ్రమ సాహిత్యాగమ విజితశ్రములగు పండితోత్తములు మన్నించక పోరు.

ఏతద్గ్రంథ రచనా విధానమును గూర్చి కృతికర్త 33-35-36-37-41-42పుటల లో విన్నవించుకొని యున్నాడు. "తేజోమయమై ధవళమై ప్రకాశించు సూర్య కాంతి యందు నీలారుణ హరితాదినానా వర్ణ సమామ్నాయ మణిగియున్నట్లు భారత సంహితయందు ధర్మనీతివేదాంతవ్యాకరణ లక్ష్యాదు లంతర్భాగములై యుంటటను వ్యాపించి యున్నవి. నేత్రముల యెదుటనే వర్ణముగల సులోచనములతో చూచినలోకమంతయును వర్ణ మయముగా గాన్పించుట సహజమేగదా? నీలంపుటద్దముతో చూచిన లోకమంతయు నీలముగా గాన్పించు. ఎరుపుటద్దముతో చూచిన లోకమంతయునరుణిమవహించునట్లే సారస్వతప్రియులు భారతమునే దృష్టితో పరిశీలించినవారి కట్టి విశేషములతోనే నిండియున్నట్లు గాన్పించి వింతగొలుపు. ఆంధ్రగద్య రచనా పరిణామ దృష్టితో నన్నపార్య విరచిత భారత ప్రపంచమును మనమిపుడు దర్శించిచూడ వలసి యున్నది. (41-42) "17-18 శతాబ్దములలో వెలసిన కేవ గద్యవాఙ్మయమునకు పూర్వపు గద్య వాఙ్మయము విమర్శన సందర్భమున తత్పూర్వపు చంపూకావ్యములలో గానవచ్చెడి వచన రచనలనే పరిశీలించి చర్చించుట మనకవశ్యకర్తవ్యము. ఈ విమర్శన మనందు మనము చర్చింప వలసిన విషయములు ముఖ్యముగా మూడు గలవు.

(1). కావ్యమునందు గల ఘటనా గ్రంథ పరిధిని కొంతవఱకు నిరూపించుట.

(2). కావ్యమునందే యేసందర్భములందు కవి దృష్టి వచనముల రచింప ప్రక్రమించుచుండెనో నిరూపించుట మనము చర్చింప దలచిన రెండవయంశము......

(3) ఈరెంటికంటె ముఖ్యమును ప్రయాసకరమునైన మనమూడవకర్తవ్యము కావ్యము నందుగల వచన రచనల శైలి దృష్టిని చర్చించుట......

నిబంధనల గ్రంథముల శైలి సాధారణముగా సరళముగ నుండుట కష్టము. కాని నవలా రచయితలగు శ్రీ రాఘవరావు గారు తమ యీనిబంధన గ్రంథములో గూడ వస్తు సరళమై యుదారమగు శైలి నవలంబించి గ్రంథమందలి పాండిత్య విశేషములు హృదయమున నిలచునట్లు చేసి యున్నారు. ప్రకృతి శాస్త్ర విధానజ్ఞాన మీకృతి కర్తయందు సాహితీపరిచర్యలకనుకూలమై కళలకును శాస్త్రములకును గలయభేద్యమగు సహజమైత్రినుద్దీపించుచున్నది.

ఇందు విమర్శనీయమైన భారత కావ్యమందలి ప్రీతిచేత నైనను, రచనా విశేషములను శాస్త్రానుకూలముగ తేటపరచుటచే నుద్దీపింప జేసిన నన్నపార్యుని కీర్తి ప్రభావముచేత నైనను, ఈగ్రంథ రూపమగు సాహితీ సపర్యలాంధ్రలోకమున ప్రమోదావహములై యనవరతము వరలుగావుతమని మా గురుశిష్యుల యాశయము. ఇట్లు జీవితమును, నేర్చిన విద్యను ధన్యముగా నించుకొనిన మా శిష్యునికి మనఃపూర్వ కాశీర్వచనములు. పరమేశ్వరుడీ యాంధ్ర గద్య వాఙ్మయచరిత్రము నందలి మిగిలిన సంపుటములను విపులముగ రచించి ప్రకటింపగల భాగ్యము కృతికర్త కనుగ్రహించును గాక.

విజయనగరము
23 జూన్ 1928.

ఇట్లు బుధవిధేయుడు
శివలీరు డాక్టర బుఱ్ఱా శేషగిరిరావు.
ఎమ్. ఏ. పి ఎచ్. డి. M. A. Ph. D.
సాహిత్యోపాధ్యాయుడు.

# విజ్ఞాపనము.

శ్రీవిజయనగరమహారాజ పోషితకళాశాలలో 1912 సంవత్సరమున నేను మధ్యకళా పరీక్షకు (Intermediate Examination) చదువుచుండు దినములలో నాంధ్రభాషయందు నవలలను విషయమును గూర్చి యొక వ్యాసమును వ్రాసి, ప్రకటన నిమిత్తమాంధ్ర పత్రిక సంవత్సరాది సంచికకు పంపక పూర్వము, మా కళాశాలలో నాంగ్లసాహిత్యోపన్యాసకులును, మద్గురువరులు నగు మ॥రా॥రా॥ శ్రీయుక్తా శేషగిరి రావు పంతులు. M. A. గారికి చూపితిని. వారది సాంతముగా చదివి, ముదితులై సంపూర్ణమైన యాంధ్రగద్య వాఙ్మయచరిత్రమును వ్రాయుట కేల పూనుకొనవు అని ప్రశ్నించిరి. నాయట్టి బాలకుడు కించిజ్ఞుడట్టి కార్యమునకు బూనుట తగదని విన్నవించితిని. గాని యాంధ్రమున గద్య వాఙ్మయచరిత్ర రచించుటకు తగిన పండితులును విమర్శకులును ప్రయత్నింపని పక్షమున నారోపిన కోలదినట్టి గద్యవాఙ్మయచరిత్ర వ్రాయ నలయుదును తలంపు శ్రీ శేషగిరిరావుగారు సూచించి నప్పటి నుండియు నాకు గలిగెను.

మరి నాలుగు సంవత్సరముల వరకు కొన్ని సాంతచిక్కుల చేతను మరికొన్ని కారణములచేతను నేనీవిషయమై కృషిసల్పలేదు. తరువాత పట్టపరీక్షనంది 1917సంవత్సరమున నేను అనకాపల్లి మ్యునిసిపల్ హైస్కూలులో రసాయన శాస్త్రోపాధ్యాయుడనై పనిచేయుచుంటిని. ఆసంవత్సరపు సెప్టెంబరు 18వ తేదీని వెలువడిన యాంధ్రదిన పత్రికలోనిట్లు ప్రకటింపబడినది,

“చెన్నపురాంధ్రసభ. విద్యాశాఖ. 14. బ్రాడ్వే మదరాసు.
విజయదశమి బహుమాన పరీక్షలు. 1917.

1రావుసాహెబుకలువలకణ్ణను శ్రేష్ఠిగారి బంగారు పతకము. 100 రూపాయలు వెల గలది. విషయము ఆంధ్రవచనరచనావికాసపరిణామము (Development of Telugu Prose)ను గూర్చిన సవిమర్శమగు వ్యాసము. పరిమాణము ఇంచుమించుగ 100 ఫూల్సుక్యాపుపుటలు.

* * * * * * * * * *

గ్రంథములు వచ్చెడి అక్టోబరు నెల 10వ తేదిలోపుగ రిజస్టర్డు పోస్టుద్వారా విద్యా శాఖాకార్య దర్శిగారి కందునట్లు పంపబడ వలెను. గ్రంథకర్తలు గ్రంథముల మీద తమ నామధేయములను వ్రాయగూడదు. ఏదో యొకమారు పేరు వ్రాసిపంపవలెను. వేరొకయుత్తరము నందు తాముపెట్టుకొనిన మారుపేర్లను, తమనిజమైన పేర్లను సంపూర్ణమైన విలాసములను వ్రాసి సీలు చేసి పంపవలెను''.

ఈప్రకటన నేను 1917సం॥ సెప్టెంబరు 20 వ తేదీని చూచితిని. ఆంధ్ర గద్యవాఙ్మయచరిత్ర వ్రాయ వలయునను నాపూర్వాభిలాషకీ ప్రకటనము మరింతహెచ్చరిక గలిగించినది. బహుమానము వచ్చినను రాకున్నను నాకా విషయమును గూర్చి గలయభిప్రాయములను గ్రంథస్థము చేసి పంపునను నాసక్తి గలిగెను. నామిత్రులును, మాస్కూలులో తెలుగు పండితులునగు బ్రహ్మశ్రీ బులుసుపాపయ్యశాస్త్రిగారు నాయుద్యమమునకు కొంతసాయము జేసి ప్రోత్సాహమొసంగిరి. ఐదవ ఫారములో చదువు నాశిష్యులు కొందరు నాకుచాల తోడ్పడి నేనొసంగిన కొన్ని గ్రంథములలో మొత్తపు పంక్తులను, వచన పంక్తులను లెక్కించి శతాంశగణిత రీతిని వచన గ్రంథ పరిమితి నిరూపించిరి. ఇరువది దినములలో పగలు స్కూలుపని చూచుకొనుచు అవశ్యమైనంత మాత్రమునిద్రగొనుచు, రాత్రింబవళ్లుకృషిచేసి గడువులోపల నెట్లో పూర్తి చేసి వ్యాసమును పంపితిని.

తరువాత నొక సంవత్సరము గడచి పోయెను. నేను కార్యాంతరముపై విజయనగరములో నుండగా 5.9 1918 తేదిని వెలువడిన యాంధ్రదిన పత్రికలో నిట్లు ప్రకటింపబడినది.

“చెన్నపురి ఆంధ్రసభ. విద్యాశాఖ: పింగళ సంవత్సరపు విజయదశమీ బహుమాన పరీక్షలలో ఆంధ్రవచనరచనా దశాపరిణామపరీక్షకు నలువురు పోటీచేసిరి. అనకాపల్లి మ్యునిసిపల్ హైస్కూలు సైన్సు అసిస్టెంటు గొబ్బూరు వెంకటానందరాఘవరావు.B.A. గారు వారిలో మొదటి వారుగా కృతార్థులై రావుబహద్దరు కలువల కణ్ణను శ్రేష్ఠిగారి రత్న ఖచిత స్వర్ణపతక బహుమానమునకు పాత్రులైరి. బందరు నోబిలుకళాశాల యుపాధ్యాయులు. ముత్తరాజు వేంకటసుబ్బారావు పంతులు. M.A

గారు రెండవవారుగా కృతార్థులై శిరంరామచంద్రరావుగారి స్వర్ణ పతకమునకు పాత్రులైరి. పర్లాకిమిడి రాజాగారి కళాశాలలో నుపకారవేతనము గాంచిన సంస్కృతోపాధ్యాయులు పొన్నంగిరామ శాస్త్రిగారు మూడవ వారుగా కృతార్థులై కంచెర్ల పెరుమాళ్ల సెట్టి గారిరజితపతకమునకు పాత్రులైరి.''

ఆంధ్ర సభ వారిరత్నఖచిత స్వర్ణ పతకమును కాళయుక్త సంవత్సర విజయదశమినాడుసభలో నాకొసంగిరి. నేనప్పటికి చెన్నపురిన్యాయ కళాశాలలోన్యాయవాది పరీక్షకు చదువు చుంటిని.

ఆదినములలో నావ్యాసమును చూడదటస్థించిన మామిత్రులు బ్రహ్మశ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు చెన్నపురిగ్రంథభాండాగారములలో నముద్రితములైన పెక్కు తెలుగు వచన కావ్యములు గలవనియు వానింబఠించి గ్రంథమును విస్తరింపజేయవలయుననియు దయతో తెలిపిరి. పచ్చయ్యప్ప కళాశాలలో నాంగ్లసాహిత్యోపన్యాసకులుగా నున్న మ॥రా॥శ్రీ॥పి. సుబ్రహ్మణ్యయ్యగారును, పోటీకి పంపబడిన వ్యాసమునందు నూరుపుటలలో నిముడ్చ తగినంత సంక్షేపముగా నాంధ్రగద్య వాఙ్మయ చరిత్ర నేను తెలిపి యున్నను గ్రంథము చాల విస్తరింప జేసి, ఆంగ్లగద్య వాఙ్మయమును గూర్చి మింటో దొరగారు వ్రాసినట్లు (Minto's Manual of English Prose Literature).ఆంధ్రగద్యవాఙ్మయ చరిత్ర వ్రాయుమని సెల విచ్చిరి. ఆంధ్రసభ విద్యాశాఖకార్యదర్శి మ॥ కాళ్లకూరి గోపాలరావు పంతులుగారు గ్రంథమును విస్తరింప జేయు విషయమున సభ వారి కెట్టి యభ్యంతరము లేదని సెల విచ్చిరి. గ్రంథమును విస్తరించి వ్రాయవలయునను నభిలాషనాకు గూడగలిగియున్నను, న్యాయశాస్త్ర పరీక్షలైన తరువాత గాని వాఙ్మయ వ్యాసంగమేమియు చేయుటకువలను పడనందున, 1913 సంవత్సరము మేనెల మొదటి వారమువరకు నాప్రయత్నము నాపియుంచితిని.

ఆవల నాంధ్రమాతా పుత్రరత్నములగు శ్రీకొమర్రాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారితో నీవిషయమై విన్నవించివారి సాయమపేక్షించితిని. వారు అమిత సద్భావముతోడను అత్యంత వాత్సల్యము తోడను నాకు సమస్తసదుపాయముల మర్చి పెట్టిరి. చెన్నపురి. ఎగ్మూరులో నాలుగు భాండాగారములకు మిగులసమీపమున నున్నట్టియు, సమస్త సౌకర్యములతో నలరారునట్టియు తమ కాపుర గృహా

మైన వేద విలాసభవనమున నివసించుటకు నాకు తావిచ్చుటయేగాక, శ్రీ మునగాలరాజావారి వలనను, ఆంధ్రపత్రికాధిపతులవలనను నేనచట నుండు కాలమున నాకగు వ్యయములకు తగు పైకమిప్పించి కృతార్థుని జేసిరి. ఇట్లు వాఙ్మయ పరిశోధనమునకు గావలసిన సౌకర్యములన్నియు వారియమూల్య సాహాయ్యము వలన లభించుటచేసియీ విషయమై నిరభ్యంతరముగని శ్చింతగ కృషిసల్పుటకు నాకవకాశము లేర్పడెను. శ్రీ మునగాల రాజావారి యొక్కయు శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి యొక్కయు, ఔదార్యమును స్మరించుచు, వారికిని, శ్రీ లక్ష్మణరావు పంతులుగారికిని కృతజ్ఞుడనై భక్తి విశ్వాసములతో నమస్కరించుచున్నాను.

ఆదినములలోనే రావుబహద్దురు కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ ఆంధ్రకవుల చరిత్ర ద్వితీయభాగమును పెంచి వ్రాయవలెనని చెన్నపురి వచ్చి యీ వేద విలాసభవనమునందే నివసించిరి. వారితో గూడ వాఙ్మయ విషయములు గొన్ని యప్పుడప్పుడు చర్చించుచుంటిని. ఇంతలో వారికి ఇన్ఫ్లూయన్జాజ్వరము తగిలి మేనెల 27 వ తేది ఉదయము 4-20-నిమిషములవారు స్వర్గస్థులయిరి.

ప్రభుత్వమువారి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము నందును (Government Oriental Manuscript Library) ఆంధ్రసాహిత్య పరిషద్భాండాగారమునందును, ముద్రితగ్రంథముల లెఖ్ఖ్యారూపము జేసెడి Registrar of Books వారికార్యాలయమునందున్న భాండాగారమునందు గలయాంధ్రవచన గ్రంథములనా యోపినకొలది పఠించి, మచ్చునకు కొన్ని [illegible] నెత్తి వ్రాయుచు చెన్నపురిలో కొన్ని నెలలు గడిపితిని. జూలయి నెలను [illegible] స్వగ్రామమగు నీయలమంచిలి వచ్చితిని. న్యాయపరీక్షయందు తేరియుచట న్యాయ[illegible]గా నున్నాను. నాయోపినకొలది యీ గద్యవాఙ్మయచరిత్ర వ్రాయుచున్నాను.

## పరిభాష.

కావ్య విమర్శగావించు సందర్భమున ప్రతిభాషకును, కొన్ని సాంకేతిక పదములును, విమర్శ పరిభాషయు నుండుట యావశ్యకము. అందుకను కూలమయినపరిభాష పెక్కులగు నలంకార గ్రంథములలో రాజిల్లు సంస్కృతమున గలదు. ఆంధ్రమున విమర్శనిబంధనల బోధించుటకు కావ్యాలంకారచూడామణి,కావ్యాలంకారసంగ్రహమున్నను గ్రంథములు [illegible]. ఇందు మొదటిది సంస్కృతమున దండిమహాకవి

కృతమైన కావ్యాదర్శము ననుసరించి చిన్నకోట పెద్ద నార్యునిచే 14వశతాబ్దమున వ్రాయబడినది. రెండవది ప్రతాపరుద్రీయము ననుసరించి మూర్తి కవిచే 16 వశతాబ్దమున వ్రాయబడినది. ఈరెండు గ్రంథములలో అంతటను వానినేతగుల జేసితినని విద్యానాథ మహాకవి చెప్పినట్లు ప్రతి విషయమును గూర్చి కృతినాయకుడే లక్ష్యమగుట తటస్థమయ్యెను. కావున లక్ష్యలక్షణములు సంభగ్రాహ్యములు గాకపోవుచున్నవి. నేటి పరిశీలించుట కగత్యము లైనలక్ష్యలక్షణములు పరిస్ఫుటముగా నుండినగాని గుణదోషవిమర్శనము సాధ్యముగాదు. కావున దండి కృతమైన కావ్యాదర్శమును, కావ్యాలంకార చూడామణిని, కావ్యాలంకార సంగ్రహమును, ఇంగ్లీషులో Bain బెయిన్ దొర గారు వ్రాసినRhetoricను సమన్వయించుకొని లక్షణముల నేర్పరుచుకొని సుప్రసిద్ధ ప్రథమాంధ్రకవియగు నన్నయభట్టారకుని గద్యరచనల నుండి లక్ష్యముల నీయ యత్నించితిని. ఇట్లగుటచేత, నన్నపార్యుని గద్యరచనల యందుగల ప్రాశస్త్యము సువిదితమగుటయేగాక యీగ్రంథము ఆంధ్రగద్యరచనా విశేషములంగూడ కొంతవఱకు బోధింపగల నిబంధన Elementary Principles of Telugu Prose Rhetoric గ్రంథము కావలసి వచ్చెను. ఈపరిశ్రమ యందు బ్రహ్మశ్రీ మల్లాది వేంకటశాస్త్రిగారును, బ్రహ్మశ్రీ విద్వాన్ అలపాటి వెంకటేశ్వరశాస్త్రిగారును, ముఖ్యముగా బ్రహ్మశ్రీ విద్వాన్ కట్టి కామేశ్వరశాస్త్రిగారును నాకు చాల తోడ్పడిరి గావున కృతజ్ఞుడనై వారికి వందనము లాచరించెద. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు విజ్ఞాన సర్వస్వములో వ్రాసిన యలంకారవ్యాసము నాకత్యంతోపకారియయ్యెను.

## వందనములు.

సుక్షీరదానముచే శిశువులను, తగునౌషధములిప్పించి రోగాతురులను ధర్మశాలల నిర్మించియా ప్రాతవరులను సౌఖ్యాత్ములంజేసి మించిన వైశ్యకుల ప్రదీపకులగు కీ॥ శే॥ రావు బహద్దర్ కలువల కణ్ణను శ్రేష్ఠిగారు, భాషాభిమానచోదితులై యాంధ్రగద్యవాఙ్మయ చరిత్రవినభిలషించి బహుమానస్పర్ధ బుట్టించియే తద్విషయమైపలువురచే పెక్కుగ్రంథములు వ్రాయించి యాంధ్రసభ వారిచే పరీక్షచేయించి, మహాసభలో రత్నఖచిత స్వర్ణపతక బహుమానము నొసంగినట్లు గౌరవించినందుల కాంధ్రసభ వారికిని మహోదార్యశీలియగు శ్రీశ్రేష్ఠిగారికిని బహు కృతజ్ఞుడను. పరీక్షకు మొదట నేనంపిన, వ్యాసమును విస్తరించి వ్రాయుటకు కారణములను అవకాశములను కల్పించి

యీగ్రంథ మిట్లు ప్రకటింపబడుటకు తోడ్పడిన మహాజనుల కెల్లరకు వినతుడన య్యెదను.

దొరతనము వారి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము, సాహిత్యపరిషత్పుస్తకభాండాగారము,(Registrar of Books) వారికార్యాలయములోని భాండాగారమును కాకినాడ ఈశ్వర పుస్తకభాండాగారము- మాయూరికర్మ గ్రంథాలయమును ఈగ్రంథము వ్రాయుటలో నాకు చాలయుపకరించినవి. గావున వానినిట కృతజ్ఞతతో స్మరించెదను. ఏగ్రంథమునుండి యేయంశములు గ్రహింపబడినదియు నాయాపుటలలో వివరించియున్నాను. 21 వపుటలో నుండ లీకరణమున కథాసరిత్సాగర పీఠికలోని వాక్యములని పొరపాటున పేర్కొన మరచితిని. 27 వపుటలో ప్రశంసింపబడిన విదువాడల పాలెపుశాసనము శ్రీరాజరాజనరేంద్రుని పట్టాభిషేక సంచికలోనుండి పూర్తిగా గైకొని యనుబంధమున నిచ్చియున్నాను. ఇందుకుతత్సంచికాప్రకాశకులకు కృతజ్ఞుడను. ఈగ్రంథరచనా బీజము మొదటనాహృదయసీమను నాటి యిపుడు దీని సాంతముగా పఠించి పీఠిక వ్రాసి పెట్టిన మద్గురువరు లగు డాక్టరు బుఱ్ఱా శేష గిరి రావు పంతులు. ఎమ్.ఎ.పిహెచ్.డిగారికివందనములు.

## ముద్రణము.

ఆంధ్రసభవారి పోటీ పరిక్షకు పంపిన వ్యాసములో మొదట పదునేడుపుటల నుమాత్రము విస్తరింపజేసి నన్నయభట్టారకుని రచనలతో నీప్రథమ సంపుటమును ముగించితిని. గ్రంథము పెంచివ్రాసిన తరువాత రెండు సంవత్సరములు ముద్రణావకాశము లు లేక నా కడ నుండి పోయినది. ఇంతలో మాయూరగ శ్రీ పార్వతీశ్వర ముద్రక్షరశాల వెల కొల్పబడినది. 1922సం॥ జూలయి నెలలో నీపుస్తకముముద్రింప నారంభించితిమి. ఇప్పటికి ముగిసినది. ఇపుడీ ప్రథమ సంపుటము నాంధ్రమహాజనులకు సమర్పించుకొనుచున్నాను. ముద్రణమగు కాలమున నాప్రూఫులు నేనే దిద్దుకొనవలసివచ్చినది గనుక పెక్కుదోషము లిందుగోచరించుచున్నవి. అజ్ఞానముచేతను ప్రమాదముచేతను గ్రంథమున తప్పుగా గానవచ్చు నీతప్పులను సహృదయులై సవరించుకొనుడని పాఠకమహాజనులను సవినయముగా ప్రార్థించెదను. అన్నివిధములచేతను ఇట్టి గ్రంథములు వ్రాయుటకు సామర్థ్యముగల మహాపండితులును విమర్శకులును ఇందుకు పూనుకొని యుండుట ఆంధ్రభాషయొక్క—— గ్రహచార మేయనవలయును. కాయట్టికించిజ్ఞుడీకార్య

మునకు బూనుకొనుట సాహసము. గనుకనే ఇందనేక విధముల పెక్కు లోపములున్నవి. గద్యవాఙ్మయమునకై యీవరకుండిన దురభిప్రాయ మంతరించ నారంభించిన యీదినములలో పండితులును, విమర్శకులును, సాహసమును మన్నించి గ్రంథము తగు ప్రయోజనములోనికి దెచ్చుటకు మార్గములను దయతో చూపిన పత్రికలకు వందనశతములతో నట్టి సూచనలను గ్రహించి యింకొక ముద్రణమవసర మయిన పక్షమున నిందు చేర్చుకొనెదను.

## అంకితము.

ఈ విజ్ఞాపనమింత వరకు వ్రాసిన వెనుక నీ నెల పదునాడవ తేదీ యుదయము రెండు గంటలకు శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారు ఆకస్మికముగా హృదయస్తంభనము వలన చెన్నపురి ఎగ్మూరులో వారి స్వగృహమగు వేదవిలాసభవనమున స్వర్గస్థులైరను ఘోరవార్త విని యత్యంత దుఃఖితుడన యితిని. శ్రీపంతులుగారి పరిచయ భాగ్యము నాకు 1912 సంవత్సరమున లభించెను. వారియాదరణమునకు, వాత్సల్యమునకు పాత్రులయి వారియుపదేశలాభమును విశేషముగా పొంది ధన్యులయిన యాంధ్రయువకులలోనే నొకడను. ఆంధ్రుల సంతోషము, ఆంధ్రభాషాసేవ, ఆంధ్రాభ్యుదయము, ఇవియే వారి జీవితాశయములు. తిక్కకవి బ్రహ్మతరువాత నాంధ్రజాతి పరమార్థము వీరివలె లెస్సగ గుర్తెరిగి యేతదర్థము నిమపార్థముగ నిరంతరము కృషిచేసిన యాంధ్రసత్తము లింకొకరు లేరు. ఆనిగర్వచూడామణి మందహాసమనోజ్ఞవదనమును ఆశాంతశీలుని చల్లని మాటలును, ఆమహాత్ముని సుధామధురోక్తులును మరువజాలము అతని కొక్కటే విచారము—ఇతర భాషలలోవలె నాంధ్రము నందును సమస్తాంశముల బోధించు సద్గ్రంథ బాహుళ్యము లేమియే. అన్య భాషా వాఙ్మయాదులతో నాంధ్ర భాషా వాఙ్మయమ్ములు తులతూగ గలుగుట యెన్న డగునని యామహాశయు డెదురు చూచు చుండుట. అట్టి గ్రంథ చయము తామె స్వయముగ వ్రాయుటయందుకంటెను యువకులను గ్రంథకర్తలుగా చేయు విషయమున నాభాషాభిమాని మిగుల శ్రద్ధ వహించు చుండెను. ఎట్టి యజ్ఞుల కైనను, నిరుత్సాహుల కైనను నాతని సందర్శన సంభాషణ పరిభాషణముచే గ్రంథ రచన యందుత్సాహమును, సామర్థ్యమును లభించుచుండెను నవ యుగమున వెలసిన సమస్త సద్గ్రంథములలో నేదో యొక విధమున నాపుణ్యమూర్తి యొక్క సాహాయ్య లాభము బడయని గ్రంథములు లేవని చెప్ప నొప్పును. పూర్వ

కవి విరచిత ప్రసిద్ధ గ్రంథాదుల నిరంతరము పఠించుచు, సముద్యోగ కరములు, సత్యయుక్తములు, హితకరములు, కడు ప్రియములు నగు వాక్యములు తెలుగున రచించియు రచింపించియు నాంధ్రాభ్యుదయమునకై నిరంతర పరిశ్రమ చేసి, వాఙ్మయ తపోవిభూతి వడసి, యీనడుమ జీర్ణ కాయమును పరిత్యజించి యూర్ధ్వ లోక గతుడై యాకళానిధి యాంధ్ర ప్రపంచమున శాశ్వత యశో జ్యోత్స్నను విరాజితుడగుచున్నాడు. ఆ విజ్ఞాన చంద్రునకీ గ్రంథమును నూలుపోగు సమర్పించి ధన్యుడ నయ్యెదను.

మరియు నాప్రార్థన పై (శ్రీ) పంతులుగారియొక్క యు, శ్రేష్ఠిగారియొక్కయు చిత్రపటములు సమకూర్చి యిందుచేర్చుటకు త్వరలో నాకందజేసిన మా మిత్రులు బ్రహ్మశ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారికి వందనములు చేయుచున్నాను.

| | |
|---|---|
| యలమంచిలి, | ఇట్లువిన్నవించువిధేయుడు. |
| రుధిరోద్గారిసంవత్సర | |
| ఆషాడ శు ౯ భానువారము, | గొబ్బూరు వేంకటానంద రాఘవరావు. |

# ఆంధ్రగద్యవాఙ్మయచరిత్ర.

## ప్రథమసంపుటము.

### విషయసూచిక.



# ఆంధ్రగద్య వాఙ్మయచరిత్ర.

## ప్రథమప్రకరణము.

### వాఙ్మయమనగానేమి ?

శ్రీకృష్ణభగవాను డర్జునునకుపదేశించిన భగవద్గీతాశాస్త్రమునందు (శ్రద్ధాత్రయ విభాగయోగమున) వాఙ్మయతపస్సును గూర్చి యిట్లు చెప్పియున్నాడు.

"అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే" 17—15

అనగా వేదాభ్యాసము చేయుటయును, సత్యయుక్తములును హితప్రియకరములును నై వినువారికి మనోజ్ఞముగానుండి హితవుగలిగించువాక్యముల రచించుటయు వాఙ్మయతపస్సగునని శ్రీకృష్ణుని నిర్వచనము. వాఙ్మయశబ్దము ప్రాచీనసంస్కృతాంధ్ర గ్రంథములలో నచ్చటచ్చట నుపయోగింపబడినట్లు గానవచ్చుచున్నది. గానియీశబ్దార్థము పైగీతాశ్లోకమునందుకంటె విపులముగాగాని సంగ్రహముగాగాని నిర్వచింపబడినట్లు గానరాకున్నది. కాలక్రమమున తపోభ్యాసమును, వేదాభ్యాసమును నామమాత్రావశిష్టములయినవి. మధ్యయుగములందు సంస్కృతాంధ్ర విద్వాంసులు ఏదేనియొక భాషయందు వెలసిన యుత్తమకావ్య సముదాయస్వరూపముగల సారస్వతమే వాఙ్మయమగునని తలంచినట్లూహింప దగియున్నది. ఇటీవల నాంగ్ల సాహిత్య ప్రియులైన యాంధ్రభాషాసేవకులు 'లిటరేచరు' (Literature) అనుపదము ఆంగ్లమున నే యర్థమును స్ఫురింప జేయునో ఆయర్థమునే వాఙ్మయ పద మాంధ్రమున వ్యక్తము చేయగలదని తలంచి ఆయర్థములోనే యీవాఙ్మయ పదము నుపయోగించుచున్నారు. ఆంధ్రపాఠకులెల్లరు నట్టిప్రయోగము నంగీకరించియున్నారు. కావున నాంధ్రమున వాఙ్మయమనగా నేమో మనముస్పష్టముగా గ్రహింప దలంచితిమేని విస్తృతమాంగ్లమున 'లిటరేచర' నగా నేమో తెలిసికొనుట యావశ్యకమగుచున్నది. ప్రతిభావంతులైన స్త్రీపురుషులు యోజించియు, స్వానుభవముచే నెరింగియు రచించిన భావములు గలిగి సొగసైన పద్యరూపమునను సొంపైన వచనరూపమునను వెలసిన సారస్వత కథావిధానమే 'లిటరేచర' గునని యొకరు తెలుపుచున్నారు.' 1. విశ్వవిఖ్యాతములై శ్రేష్ఠతమవిధమున లిఖింపబడిన శ్రేష్ఠతమభావసముదాయము లిటరేచరగునని మరియొకరు చెప్పుచున్నారు.

2. ఈనిర్వచన పరికారము

1 " The History of English Literature is the story




కావ్యములు—వాఙ్మయము.

వాఙ్మయచరిత్ర వ్రాయఁగడఁగువారలాయాభాషలయందు వెలయఁగలిగినయుత్తమ కావ్యములన్ని, శయ్యాదులైనవాని రచనా విశేషములను విమర్శించుటయేగాక, ఆయాభాషావాచకులలో ప్రతిభావంతులగు వారిమానసములందు సహజమైన భావనాశక్తిచేతను, దేశకాల ప్రకృతి పరిణామములచేతను, ఉదయించి యతిశయించి పరచెడి భావప్రవాహస్వభావమును తెల్లగా గమనించి యీభావప్రపంచమునకును ఉత్తమకావ్యోత్పత్తికినిగల జనకజన్యసంబంధము వివరముగా చర్చింపవలసియుండునని స్పష్టమగుచున్నది. 3 ఇట్టిసంబంధమును చర్చించుచు సువ్యక్తము గావించు విమర్శనము లేక ఆభాషయందు బొడమూపిన కావ్యాదుల కేవల స్మరణ గణన శ్లాఘనాదులతో మాత్రము పరిసమాప్తినొందు గ్రంథము నిజమైన వాఙ్మయచరిత్ర కానేరదు. ఉత్తమభావయోచనా ప్రపంచమునకును భాషయందు సరసకావ్యోత్పత్తికిని వాఙ్మయవిజృంభణమునకును గలపరస్పర సంబంధము నిరూపించి సాధించుటకూడ వాఙ్మయచరిత్ర కారుని ముఖ్యకర్తవ్యమని మనము తప్పక గ్రహించి యీయాంధ్ర గద్యవాఙ్మయ చరిత్ర వ్రాయఁగడంగుదము.

---

of what great Englishmen and women thought and felt and then wrote down in good prose and beautiful poetry in the English Language" says Stopford. A. Brooke in his Primer of English Literature. .... .... Page 3

2 Says J. H. Fowber in his Introductn to Nineteenth Century English Prose. Page 1. Introduction,

"Literature has been defined as the best that has been thought in the world expressed in the best way.

3 "Watch what main currents draw the years," Tennyson.

వాఙ్మయ విజృంభణము ఉత్తమకావ్యోత్పత్తి నడకరించి యుండునని స్పష్టమగుచున్నది గావున నిక కావ్యమనగా నేమో మనమిప్పుడు చర్చించి తెలిసికొన వలసియున్నది.

ఈసందర్భమున ప్రథమమున నాంధ్రమున నలంకార గ్రంథము రచించిన విన్నకోట పెద్దన్నమహాకవియు, మధ్యయుగమున నట్టిదే గ్రంథమురచించిన భట్టుమూర్తియు, నిటీవల నాంధ్రవిజ్ఞానసర్వస్వము వ్రాయుచున్న కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావు పంతులుగారును నేమిచెప్పిరో పరిశీలింతము :—

## విన్నకోట పెద్దన్న:— (14వ శతాబ్దము.)

### భావము.

చ. ‘‘సరళవిరాజ దుచ్చరణశస్త్రము వర్ణము, వర్ణపఙ్క్తి వి
స్తరము పదంబు తత్పద వితానము వాక్యము, వాక్యభేద సుం
దరతరమర్థ. మర్థ ఘనతత్త్వ విబుద్ధము భావము— 1 - 17

క॥ ‘‘బహిరర్థాలంబనమై విహరించు మనోవికారవిలసితమనుమీ।
విహితమగు భావమన; నదిమహి విజ్ఞానంబునా సుమతులంబరగున్ 1 - 18

క॥ ‘‘ఘనవిజ్ఞానం బాత్మకు। మనసూనసే గలుగునట్టిమానసునకబ్బున్।
కనదింద్రియములచేతన్ వినగాంచనులకనొందవం విషయప్రాప్తిన్ 1 - 19

చ॥ ‘‘అట్టిభావకుచిరసు ప్రసన్నవిభవంబు రసంబొడగూర్పనేర్చినన్॥ (1 - 17)

క॥ ‘‘నవరస విస్ఫుటకరణ। ప్రవణములగు సుచితరచితభావముల్ల్లన్ ।
వివిధ స్త్రీపురుషులయందవిరళముగ బొడము తెలియనగును గవీంద్రుల్. 1-20

### కవి.

క॥ ‘‘సమయజ్ఞుడు సమచిత్తుడు సమశబ్దార్థ ప్రయోగచతురుడు భావ।
క్రమరసపోషణ రచనాకమనీయ ప్రతిభుడిల సుకవియనఁబరగున్. 3 -

---

కావ్యాలంకార చూడామణి జ్యోతిష్మతి ముద్రాక్షరశాల 1892.

## కావ్యము.

మ॥ కవిసంసిద్ధపదంబు భావరసవిఖ్యాతంబు లోకోచిత
వ్యవహారంబు నుదాత్తనాయకము శ్రావ్యంబుం జతుర్వర్గ సం
భవసద్ధర్మంబునైన కావ్యమిల నాచంద్రోద్భవస్థాయియై
కవిసంపూర్తియు దాతృకీర్తియు దగం గల్పించు నెల్లప్పుడున్, 4- 4

మ॥ చతురశ్రోత్రముఖైకరామృతపరిష్యందంబు నందంబునై
క్షితిగావ్యప్రసరంబువోల్చునిఖిలక్షేమంకరస్ఫూర్తితోన్ 3-76

కం॥ ఛందోలంకారాదులపొందెరిగిన నద్దిరేకతాసగదుకడతా।
సుందరతరకృతి యదియా।కందువదగ నెఱుగువాడె కవియగు నెందున్. 3-87

తే॥ శక్తి వలనైన కావ్యకృతిసాధనంబు
తెల్ల జీకటి యింటిలో నిడినసరకు
లెన్ని ఋతువులు గల్గిన నెట్లు పూచు
మహివసంతాగమము లేక మావిమోక. 3 - 88

భట్టుమూర్తి - నరసభూపాలీయము. (16వ శతాబ్దము)

### కావ్యస్వరూపము.

తే॥ ఇంక కావ్యస్వరూపంబు తేర్పరింతు ।
విగతదోషంబులును గుణాన్వితములధిక ।
లసదలంకార భావోపలక్షితములు ।
నైనశబ్దార్థములు కావ్యమన జెలంగు. 2 - 52

కం॥ తనువగు శబ్దార్థంబులు । ధ్వనిజీవము లంక్రియావితానము సొమ్ముల్
తనరుగుణంబులు గుణములు । ఘనవృత్తులువృత్తులౌర కావ్యేందిరకున్. 2 - 53

[అలంక్రియావితానమనగా:—ఉపమాద్యలంకారములు - సొమ్ములు - హారాదులు । గుణములు - శ్లేషాదులును శౌర్యాదులును - వృత్తులు - కైశికీమొదలైనవి - వర్ణనములును - ఇదియువలక్షణము - ఈవైదర్భ్యాదిరీతులు జాతిధర్మాదిరీతులువంటివి. ఈకావ్యసామగ్రి లోహసామగ్రివంటిది.] [ధ్వనియనగా ‘చప్పుడు’ గాదు. అది కావ్యమున కుపాధిరహితమైన వైశిష్ట్యము.

## కొ॥ వెం॥ లక్ష్మణరావుగారు.

### ఆంధ్ర విజ్ఞానసర్వస్వము.

“విశిష్టములైన శబ్దార్థములు కావ్యము” అనిన కావ్యలక్షణమందరు నొప్పుకొనినదే-కాని ఈ వైశిష్ట్యమెట్టిది యన్న ప్రశ్నమునకు నుత్తరమిచ్చునప్పుడు అలంకారికులలో మూడు తెగలుపుట్టెను. ఆ వైశిష్ట్యము కొందరు ధర్మరూపమనియు కొందరు వ్యాపారరూపమనియు కొందరు వ్యంగ్యరూపమనియు జెప్పిరి ధర్మరూపమను వారిలో నొక 1 తెగవారు అలంకారములే ముఖ్యమనియు 2 మరియొక తెగ గుణములే ముఖ్యమనియు వ్యాపారరూపమనువారిలో 3 నొక తెగవారు ఉక్తివైచిత్ర్యమే అనగా మాటసొంపే ప్రధానమనియు 4 రెండవ తెగవారు భోగకృత్యమే అనగా రసవిషయమైనవ్యంజన వ్యాపారమే ముఖ్యమనియు నిర్వచించిరి 5 వ్యంగ్యధ్వనివాదులతో గూడి ప్రాచీనాలంకారికులు ఐదు తెగలుగనున్నారని చెప్పవచ్చును పాఠకసౌకర్యమున కీమతములనీక్రిందమున వర్గీకరణము చేయుదము.



............“అలంకార సంప్రదాయమువారి మతమును తరువాతికాలపు అలంకారికులంగీకరింపలేదు. అన్ని మతములను సమన్వయించుకొని యాధుని కాలంకారికులు అలంకారములను గుఱించి యీవిధముగ జెప్పియున్నారు. “ధ్వనియుత్తమకావ్యమునకు ప్రాణమువంటిది, అదిలేనిది ఉత్తమకావ్యమేకాలేదు. కావ్యమునకు నాత్మరసము. శబ్దార్థములు శరీరము. ఓజోమాధుర్యాది గుణములు శౌర్యాదికములవంటివి. అలంకారములు హారములవంటివి. రసము అంగి శబ్దార్థములంగములు మాధుర్యాదిగుణములెప్పుడును రసమును విడుచునవికావు. అనగా రసమున్నచోట నవియుండును. అవియున్నచోట రసముపుట్టును. అలంకారములట్టివికావు, ఇవి యంగద్వారమున మాత్రమెుకప్పుడు రసమును అభివృద్ధిచేయును. ఒకప్పుడు చేయకపోవచ్చును. రసము ఉత్కర్షింపఁజేయునపుడు అలంకారములు కేవలము ఉక్తివైచిత్ర్యపర్యవసాయిగ నుండును.”

ఈమతమును అప్పయ్య దీక్షితులువారు పండితరాజు జగన్నాథుడు మొదలగు నాలంకారికులంగీకరించియున్నారు. కావున వ్యంగ్యార్థశోభితమైనధ్వని విశిష్టములైన శబ్దార్థములుత్తమకావ్యమగునని మనకు తెల్లమగుచున్నది.

## కావ్యభేదములు.

ఇట్లురమణీయార్థప్రతిపాదకములైన కావ్యములు మూడువిధములుగా నుండునని

---

1 ముఖ్యార్థము, లక్ష్యార్థము. గౌణార్థము-వ్యంగ్యార్థమునని యర్థవృత్తులు నాల్గువిధములుగా చెప్పబడినవి-చూడుము-కావ్యాలంకారచూడామణి 4—59-60.

క౦॥ నవ్యక్తము సరళంబును। నవ్యాజమునైనయర్థమగు ముఖ్యమనన్ 4-61.

ఆ॥ “ఉపానీయములక్షణోపేతమగునర్థ మరయలక్ష్యమనగనతిశయిల్లు
గంగ యందనంగ గంగాతటంబున గలిమిచెప్పఁజాలు కారణమున 4-62.

క౦॥ గుణసాదృశ్యంబునను। ల్బణమగు వర్ణంబు గౌణఘటితము కదుంటి
పఁవారియాన్నపుడనదగ్గుణమగుదిక్రమము దెలియదోమటనేతక్. 4-63

౩. ముఖ్యలక్ష్య గౌణముల యర్థములదాఁచి యితరమర్థ మెచటనింపుసొసగు
వ్యంగమందురి కైరవంబులు విరిసెనా గమలవైరిపొలుపుగానుటకు. 4-64

## ధ్వని.

క౦. శాబ్దాదిప్రతపంగ్య। వ్యాకీర్ణంబైనకావ్యమదియుత్తమమై
చేకూరును మధురార్థ। శ్రీకమువ్వనియనెదు పేరనుచేవెలుఁగొందున్ 4-65

చిన్నకోట పెద్దనార్యుడు కావ్యాలంకార చూడామణియందీ క్రిందిపద్యములో చెప్పియున్నాడు.

“తే॥ అట్టి కావ్యంబు త్రివిధమై యతిశయిల్లు నవనిపద్యమయంబు గద్యాత్మకంబు
పద్యమయము మొదలు ఛందోనిబద్ధమగుచు గద్యమయమొప్పు వాక్యసంకలితమగుచు. (4-5)

కం. ఆపద్యగద్యకృతములు రూపకములు నాటకములు రూఢములగువా
రూపము చంపూకావ్యప్రపాప్రసింమను నాటకములు బహుళములరయన్ (4-6)

“తే॥ సర్గబంధంబు కావ్యంబు సంస్కృతమున ప్రాకృతంబున నాశ్వాసభాసురంబు
నాటకము లెల్ల నాటకసాధకములు గద్యముచ్ఛ్వాసలంబకాంకంబయందు. (4-7)

“మ॥ కమనీయంబగు గద్యపద్యమయమై కావ్యంబు, గద్యంబు నా
వమరుం బాదనియంత్రణానియమవిన్యస్తప్రశస్తార్థమై
రమణీయాంఘ్రిచతుష్టయస్ఫుటవళిప్రాసాభిరామంబు పద్యము. (7-15)

“తే॥ అట్టి కృతమైన కావ్యత్రియంబు గద్యపద్యవిమిశ్రసంపాద్యమందు
నగరముఖ్యాష్టదశవర్ణనములచేత బరగవలయును భవ్యప్రబంధమనగ”.

పాదములు, గణములు, యతి, ప్రాసము మొదలగు నియామకములు గల్గి ఛందశ్శాస్త్రపరిపాలితమై మధురార్థప్రకాశకమైన కావ్యరూపము పద్యాత్మకము. అట్టినియామకములు లేక పరిస్ఫుటశోభితమై వెలసినది గద్యరూపము. ఉభయమిశ్రితమైన కావ్యములు వానిస్వభావమునుబట్టి చంపూకావ్యములనియు, నాటకములనియు వ్యవహరింపబడుచుండును.

పద్యకావ్యములు, మహాపురాణములు, పురాణములు, ఇతిహాసములు, మహాప్రబంధములు, ప్రబంధములు లోనగు పెక్కునామములతో వెలయుచుండును. కొన్నికథావస్తువునుబట్టియు, మరికొన్ని వానియందు బొదనూపురచనా విశేషములను బట్టియు నానానామములతో వ్యవహరింపబడుచున్నవి. ఉత్తమగ్రంథములను రచించిన మహాకవులందరును, ఏభాషలో నాకావ్యమును రచించినను, తమకావ్యములను పాదగణాదులగు ఛందోనియమములను పాటించుచు వేదోయొక విధమున పద్యశైలినే విశేషము గౌరవించుచు వచ్చిరి. ప్రపంచమునందుత్తమకావ్యకర్తలు సాధారణముగా పద్యమాధ్యమునందే రాల్చి వెలయుటచేత కవిత్వమనేకలకు పద్యరూపమే నైసర్గికమనియు, పద్యసరణియే జీవనమార్గమనియు, కొందరు తలంచుట గలదు. కానిఇది గొప్పపొరపాటు. వెలయవ, పద్యశైలి యనునది కావ్యకర్తకు విహారస్థానము కల్పించిన వస్త్రాది

వేషమాత్రముననుగాని కవి కాఁజాలఁడు. పద్యరచనాపరిపాటిలేకయే మహాకావ్యము లరచించిన మహాకవులనేకులుగలరు. కవిజ్ఞానవిహీనులయి, తమరచనలకు పద్యవేష మొసంగుటకు పలుతెరంగుల పాట్లుపడి, వ్యాకరణములోని గణప్రాసాదులతో గా ట్టికొనుచు ఛందోనియమముల పాటించితిమనుకొనుచు పేరొందుటకై పెద్దయున తడకల్లొడి వేషధారులైనన్నటికిని కవులుగాఁజాలరు. నక్కలుదేవలోకమెక్కఁదలఁచినట్లు వేషధారు లే కవిరాజ్యముచెంత జేరుటకైన నర్హులుకారు. కత్తి చేతబట్టినంతమాత్రమున పిరికిపంద మహాశూరుఁడగునా? గౌనుదొడిగిన పేదరి పట్టభద్రుఁడగునా? కళావిహీనులకు కళా ధికముల ననుసరించి వేశ్వరుదుస్తులను లాంఛనములను ధరించవలసిన నిర్ణయమున్నది. పాదగణాదియుక్తమైన పద్యస్వరూపధారణము మహాకావ్యనిర్మాణ దక్షుల లాంఛనమని యార్యులనిర్ణయము.1 ఆయుడుపుల ధరించినంతమాత్రముచే వేషధారులకు కవితాశక్తి లభింపజాలదు.2 ఆలాంఛనముల ధరింపకున్నను కవిరాజులకు కవిత్వసంపదయందుగాని కవితానైపుణ్యమునందుగాని లోపమిసుమంతయేనియు గలుగబోదు.

Sir Philip Sidney:—'Apologie for Poetry'—Page 12. (Shuckburgh's Edition Cambridge University Press) says:—

"For indeed the greatest part of poets have apparalled their poetical inventions in that numbrous kind of writing which is called verse: indeed but apparalled, verse being but an ornament and no cause to Poetry, since there have been many most excellent poets that never versified, and now swarm many versifiers that need never answer to the name of Poets..............................It is not timing and versing that makes a Poet—no more than a long gown makes an advocate........Delightful teaching........ must be the right describing note to know a Poet by. Although indeed the Senate of Poets have chosen verse as their raiment, meaning, as in matter they passed all in all, so in manner to go beyond them not speaking (table talk fashion or like men in a dream) words as they chanceably fall from the mouth but paying attention to each syllable of each word by just proportion according to the dignity of the subject.

1. మాతృకా-విన్నకోటపెద్దన్న-కావ్యాలంకారచూడామణి. 1 - 87 1 - 8౮

వర్ ఫీల్డ్ సెడ్జ్విక్ మొదలగు పాశ్చాత్య విమర్శకుల యభిప్రాయ ప్రకారమును, సిద్ధశాస్త్రాని కావ్యవర్గీకరణ విధాన ప్రకారమును కావ్యరూపమేదియైన గావచ్చునని యును, రమణీయార్థప్రతిపాదకత్వమే కావ్యమునకు ముఖ్యలక్షణమనియు స్పష్టమగుచున్నది. మహాకవుల గద్యరచనలు "¹ఛందోనియమములేని పద్యములును, రాగతాళము లులేని సుందరమధుర గీతములనియు నిస్సందేహముగా చెప్పవచ్చును. అట్టియుత్కృష్ట కోటియందుఁగల్గిన వచనరచనల సంఖ్య బహుస్వల్పము. సర్వసాధారణముగా వచనకావ్యములు పద్యకావ్యములంతటి యౌన్నత్యము నందజాలినవికావు. "వచనకావ్యముల ప్రయోజనము వేరు. పద్యకావ్యములరుచి వేరు. దేనియుపయోగము దానిది. దాని సౌలభ్యము దీనికిరాదు. దీనిసొగసును జొక్కును దానికిరావు. ఒకటిశరీరపుష్టికి మాత్రమైన తదన్న తేద్రసభోజనము. రెండవది షడ్రసోపేతమైన రాజులవిందుభోజనము మనస్సులోఁబుట్టిన యూహలు స్వాభావికముగ ననాయాసముగ దెల్పుటకు వచనమనుకూలించునట్లు పద్యమనుకూలించదు. గణయతి ప్రాసాది ఛందోనియమ యుక్తమగుట నందుభావప్రకటనము సులభసాధ్యముగాదు. గొగ్గి గొగ్గి పద్యరచనము పద్య కావ్యోద్దేశమును మఱచుటయే......ఆంగ్లభాషలో 'వచనరచన' మనియర్థమిచ్చు 'Prose' 'ప్రోజ్' శబ్దముయొక్క విశేషణ రూపమైన 'Prosaic' 'ప్రోజేయిక్' అనుమాటకు రసహీనము - నిస్సారము - సామాన్యము ననియర్థము". 1 అందువలన పద్యకావ్యముల ప్రాముఖ్యత వచనకావ్యములకు లేకుండెడిదని యూహింపదగియున్నది.

ఈయుగమున వాఙ్మయమునందు ఉత్తమమైన ద్వితీయస్థానము నలంకరించుచున్నను గద్య వాఙ్మయమనేక శాఖలు గలిగి వర్ధిల్లుచున్నది. మతవిషయములు, తత్త్వశాస్త్రములు, కళలు, దేశచరిత్రాంశములు, పక్ష్యాదిశాస్త్రములు, యాత్రాచరిత్రలు, నానాదేశసాంఘికమర్యాదలు జీవచరిత్రములు, వినోదకథలు మొదలగు సమస్తాంశములను గూర్చి కళాదక్షులచే రచింపబడినట్టియు, రుచిరార్థయుక్తమైనట్టియు గద్యసాహిత్య మెల్ల వచనవాఙ్మయమగును. భావసంక్షేపముచేతను, వానినివ్యక్తీకరించు రచనానైపుణ్యముచేతను పాఠకులకు ప్రమోదమొసంగుచు ప్రయోజనకారులగుటకు అందలివాక్యములును, వాక్యాళియందలి పదములును జాగ్రత్తగను, చక్కగను, అద్భుతముగను

1 ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక - 4వ సంపుటము - 88 పుటలో మ॥రా॥రా॥ కుచి నరసింహము పంతులుగారి వ్యాసము.

కుశలులగు కవీంద్రులచే వింపుగ, సొంపుగ, కూర్పఁబడవలయును. కేవలపఠనమున పాఠకుల మానసములందు విస్మయప్రమోదముల నుద్భవింపఁజేయుట యెవ్వరికిని సాధ్యము గాదు. పాఠకులను శ్రోతలను రచనా సామర్థ్యముచే తమ ధోరణికి లాగుకొనఁజాలిన వారందరును వందనీయులు. ఏదేనియొక యంశమునఁ గూర్చి మనోగతాభిప్రాయముల ను వ్యక్తీకరించుటకై గ్రంథకర్తలచే నుపయోగింపఁబడిన పదసముదాయమునకు శైలియను పేరు1. స్వభావోక్తిలలితములైన చతురోక్తులతో రాజిల్లు శైలిగల్గి వెలయువిషయమువ వచన గ్రంథములు వాఙ్మయమున గణనకెక్కఁజాలవు. గృహనిర్మాణమునకు వాస్తుశాస్త్రవిజ్ఞాన సాధకము లెంత యవసరమో, ఉత్తమకావ్యనిర్మాణమునకు రచనాకౌశలనైపుణ్యముగూడ నంతయవసరమేయని గణింపవలయును. మానవస్వభావశీలాదుల నిరూపించుచు జీవకళలతో ప్రకృతి విశేషముల ప్రతిబింబింపఁజేయుటయు, లోకాభ్యుదయహేతువులైన నీతిమార్గముల నుపదేశము సేయుటయు, చమత్కారరచనలచే పాఠకులకు ప్రమోదము నొసంగుటయు, జీవసమస్యల నుపపాదించి వాని నివృత్తిమార్గముల గోచరింపఁజేయుటయు, వివిధశాస్త్రముల విజ్ఞానాభివృద్ధి గావించుటయు లోనగునవి వాఙ్మయ వ్యాపారములనియు ముఖ్యప్రయోజనము లనియు, విమర్శకులు తెలుపుదురు.



## రెండవ ప్రకరణము.



### ప్రథమమున పద్యకావ్యములేల వెలసినవి?

ప్రపంచమునందే దేశీయులు వాఙ్మయపరిణామక్రమము గమనించినను, ఏజాతిసారస్వత విజృంభణ విధానమును పరిశోధించినను, ప్రాచీనులెవ్వరును మున్ముందు పద్యరచనకే గడంగిరి గాని వచనరచన కుత్సహింపలేదని విశదమగుచున్నది. ప్రథమమున శ్లో

1. 'గద్యరచన-శైలి' అనువిషయమునుగూర్చి మ॥రా॥శ్రీ॥ అచంట సాంఖ్యాయనశర్మగారు వ్రాసినవ్యాసము - ఆంధ్రభారతి [illegible] సంపుటము [illegible]వ పుట.

రి రూపములుగల పద్యకావ్యగతములైన కొన్ని యుగములకు పిదపగద్యరచనకు గడంచు అగద్యగ్రంథములు పద్యరచనల యంతటి ప్రచారకములుగను గౌరవదాయకముగను గణింపబడక, కాలమునందు వలెనే ప్రాముఖ్యతయందుగూడ ద్వితీయ స్థానమునే గ్రహించుచు వచ్చినవి. సంఖ్యయందును, కవితాప్రాశస్త్యము నందునుగూడ ప్రాచీన వచనరచనలు విశేషముగ గణనకు రాలేదని నిరూపించుటకు ప్రాక్ప్రతీచీ వాఙ్మయము పరిణామ విధానమును సంగ్రహముగ పరిశీలింతము.

—గ్రీకువాఙ్మయము.—

పాశ్చాత్యవాఙ్మయములలో నతిప్రాచీనమైన గ్రీకువాఙ్మయమునందు మొట్టమొదట 'హోమరు' మహాకవి 'ఇల్లియడ్' అను మహాకావ్యమును రచించినాడు. ద్వితీయమున 'రామాయణము' ను బోలిన మహాకావ్యము. అనంతరము 'మ్యూసేయస్' 'హెసియోడస్' అనుకవులు గూడ తమకావ్యములను పద్యరూపముననే రచించిరి. తరువాత 'ఆర్ఫియస్,' 'లీనస్' అనుకవులు తమపద్యరచనలను లిఖించి భద్రపరచుటయేగాక పశుప్రాయులుగనుండిన తమకాలపుప్రజల నుద్ధరించిరి. ఆమహాకవుల వాక్ప్రభావము గోరిన జనులు విజ్ఞానపరిపూర్ణులై నాగరికులుగా బొచ్చిరి. తీబ్సునగరము గట్టుటకు కావలసిన శిలాజాలమును 'ఆంఫియను' కవిరాజు తనవాఙ్మహిమచే దరించి తెచ్చెనని చెప్పుదురు. స్థావరములును, నిర్జీవములునైన శిలలు సహితము అతని కవిత్వప్రభావముచే కాలుసేతులున్నట్లు కదలి దుడదుడపరగు లిడుచుబోయి కట్టబోవు పట్టణమును జొచ్చెనట! 'ఆర్ఫియస్' కవీశ్వరుడు తనవాక్చాతుర్యముచేత మృగపక్షిజాతులను సహితము మోహింపజేసెనట. ఇకమనుష్యులమాట చెప్పపనియేమి?

ప్రాచీనరోమకవాఙ్మయమునందును ప్రథమకావ్యము 'లివ్యూస్ ఆండ్రోనికస్' మహాకవిచే పద్యరూపముననే రచింపబడెను. ఇటాలీకవాఙ్మయమున 'డాంటి' 'బొకాచో' 'పెట్రార్క్' అనుకవులు తమకావ్యములను పద్యవైఖరినే రచించిరి. ఆంగ్లభాషయందుగూడ ప్రథమకవులగు 'గవరు' 'ఛాసరు'లనువారలు తమగ్రంథములు పద్యకావ్యములుగానే రచించిరి.

హోమరు తరువాత బహుకాలమునకు గ్రీసుదేశము నందుద్భవించిన తత్త్వశాస్త్రములు సహితము ఆయాకృతికర్తలచే పద్యరూపముననే రచింపబడినవి. 'థేల్సు, ఎంపి

- Page 3. 'Apologie for Poetry' by Sir Philip Sidney.

థాలీస్సు,' 'ఫార్మనీడ్సు,' అనువారలు ప్రకృతిశాస్త్ర విషయములను, 'పైతాగరసు,' 'ఫిలీస్సు' అనువారలు నీతిశాస్త్ర విషయములను 'టెర్ట్రియను' అనునతడు యుద్ధతంత్రమును 'సోలను' రాజనీతిని పద్యరూపముననే రచించిరి. ఆవెనుక చాలాకాలమునకు 'హిరాడొటస్' ప్రముఖులు చరిత్రములను, 'అరిస్టాటిలు' తత్వశాస్త్రమును, విమర్శగ్రంథములను 'ప్లేటో' సంవాదరూపమయిన తత్వశాస్త్రమును వచనకావ్యములుగా రచించిరి.

నాగరికత పుట్టినదోయెరుగని వన్యప్రాయజాతులలో సహితము కవులున్నారు, కావ్యములున్నవి. కవులుపూజింప బడుచున్నారు. అట్టిచో నాగరికతనందిన దేశములమాట చెప్పబనియేమి? పాశ్చాత్యఖండములవారు తమమహాకవులను "దివ్యదృష్టిగల మహాత్ములు," "జ్ఞాననేత్రవిభాసి", "కావ్యసృష్టికర్త" "కవిబ్రహ్మ" అని యర్థమిచ్చు Bard - (బార్డు) Vates -(వేటీస్) Poien- పోయీన్, Prophet (ప్రాఫెట్) Seer (సీర్) మొదలగు పెక్కు గౌరవ నామములతో పూజించుచున్నారు.

'బాబాఆదాము' అనునాతడు తనప్రియపుత్రుడగు 'హాబీలు' చనిపోయినపుడు దుఃఖావేశమున పలికిన పలుకులు అప్రయత్నముగా ఛందోబద్ధమైన పద్యరూపము దాల్చి ఆరబికు వాఙ్మయమున కారంభమయ్యెను.

ఈవాఙ్మయములన్నిటిలో సంస్కృతవాఙ్మయము కడుంగడు ప్రాచీనమనునది నిర్వివాదాంశము. ఇందును ఛందోబద్ధమైన శ్లోకరూపముననే ప్రథమకావ్యములవతరించినవి. తరువాత పెక్కుశతాబ్దములు గడచిన వెనుక నచ్చటచ్చట వచనరచనలు బొడసూపినవి.

ఇట్లు ప్రాచ్యప్రతీచ్యవాఙ్మయ ప్రపంచమునందు ప్రథమమున పద్యకావ్యములే వెలయుచుండుటయును, తరువాత బహుకాలమునకు గాని వచనరచనలు పొడచూపకుండుటకును కొన్ని హేతువు లగుపడుచున్నవి. మనయాంధ్రవాఙ్మయమునకును సంస్కృతవాఙ్మయమునకును సంబంధము విశేషముగా గలదుగావున సంస్కృతమున నిట్లుండుటకు హేతువేమి యని చర్చించిచూతము.

విశేష పరిశ్రమగోరకయే సమస్తమును సమకూర్పజాలెడి మేటిసారముగల యీ వ్యభాగమును నిరసించుచు నేల ప్రాచీనకావ్య జాతులవారికి భక్తి మొదలగు వై

కిక వ్యాపారముల కోలాహలమంతయు లేకుండెను. అందు మేధావులగు మహాఋషులకు ప్రపంచ వ్యాపారముల చింత లేకపోవుటచేత వారికాముష్మిక చింత యధికమయ్యెను. మహర్షీయ ప్రకృతిశోభాభాసమానములగు పుణ్యప్రదేశములయందు నివసించుచు, తత్పరిసరప్రేరితులై యామహర్షీయులు ఉషఃకాల ద్విజ కుటుంబములట్లు వసంతకోకిలల చందమున నమృతసారము వర్షించు నత్యంతమధుర గీతములనెలుగెత్తి పాడజొచ్చిరి. మహాశోభవోపేతుడై దినరాజు ప్రాగ్దిశనుదయించు శోభను తిలకించినప్పుడును, షోడశ కళాపరిపూర్ణుడై పండువెన్నెలలచే విశ్వమున కపూర్వ రమణీయత నొసంగుచు సకల జనాహ్లాదకరుడగు శీతకరుని దివిపరికించునప్పుడును, విశ్వవిభుడంబరవీధిం బరచిన నవరత్నరాసులో యన మిణుకుమిణుకు మెరయు నక్షత్రకోటులం దలయెత్తి చూచునప్పుడును సమస్త వృక్షజసస్యాది యోషధీచయ సంపోషణమున కాధారమైన వర్షాగమన విశేషములం గనుంగొనినప్పుడును, మహాబలసంపదచే సమస్తము దూలగొట్టు వాతూల విజృంభణమును, గర్భ నిర్భేదము గావించు నురుముల యాటోపమును శిలాభ్రములపై మిరుమిట్లు గొలుపు సౌదామినుల వింతవిన్నాణమును వీక్షించినప్పుడును, అస్పష్టమంజుల నాదములతో బారెడి నానానదనదులును గంభీర స్థైర్యస్వరూపములగు పర్వతప్రదేశముల నడుమ నిరంతర జీవనప్రవాహములచే నుల్లసిల్లుచుండు నదులంగూడి ప్రవహించి ప్రవహించి గాంభీర్య నిధియగు సాగరవల్లభునితో సంగమించుట సందర్శించినప్పుడును, ఇంకను ఇట్టి యసంఖ్యప్రకృతి వైచిత్ర్యముల నేత్రపర్వముగ కనుగొనగల్గినపుడు విస్మయానందములం దరంగములై మునుప నామహాఋషు లవియన్నియు దైవలీలలనియు, ఈశ్వరుడాయా రూపముల తమకు ప్రత్యక్షమై దర్శన మిచ్చుచున్నాడనియు తలంచి వానియధిష్ఠానదేవతలను వేయివిధముల బ్రస్తుతింపజొచ్చిరి. భక్తిపారవశ్యముచేత నామహాత్ముల మానసములనుండి వెడలిన స్తోత్రవాక్య రత్నములు వాల్మీకుని శాపవాక్యమునట్లు, 1 అప్రయత్నముగ శ్లోకరూపముననే దాల్చినవి. ఆవాక్యరత్నము

1 రామాయణ కథారంభముననున్న క్రౌంచమిథున వృత్తాంతము భాస్కరరామాయణము బాలకాండ 6—10, 16, 17 రచనలలో వర్ణింపబడినది. వాల్మీకి తనశిష్యుడగు భరద్వాజుని వెంటనిడుకొని తమసా నదికేగి "యాపుణ్యవాహిని నవగాహంబుచేసి వెడలి నిలువంబడు నెడల

క౦॥ అంచితగతిదత్తటమున క్రౌంచంబులు రెండులీల గ్రాలుచునుండం।
పొంచియొకశబరుఁ డొక క్రౌంచమునకు నడచె [illegible]

లు శ్రుతిపరంపరచే తరువాతి తరములవారికి పాఠయోగ్యములయ్యెను. కాలముగడచిన కొలది వానిపవిత్రత యతిశయింపసాగెను. ఋగ్యజుస్సామాథర్వణ వేదములీ తీరుననే రచింపబడినవి. పరిసరస్థితుల ననుసరించి చలించినమానవహృదయములగల మహాత్ములు ప్రాచీనకాలములందు, స్వతంత్రయత్నము లేని మహావాక్బలముచే రచించిన రచనలన్నియు నించుమించుగ శ్లోకరూపమునందే దాల్చినవి. వేదములలో గద్యప్రయోగము చాలా స్వల్పము.

---

కం॥ శిరమున రక్తము వెడలగ నొరలెడితనపతిని జూచి పొదవిన వగతో
బరుపధ్వని వాపోవుచు। కరము విషాదించు క్రౌంచిగనుగొని కరుణన్,

వ॥ కటకటంబడి వాల్మీకియధికరోష సంఘటిత కుటిల భ్రుకుటియగుచు నిషాదుం గనుంగొని

శ్లో॥ మానిషాదప్రతిష్ఠాంత్వమగమశ్శాశ్వతీస్సమాః
యత్క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితమ్.

ఉ. ఓరిమహోగ్రపాతకుడ యోరినిషాదుడ క్రౌంచయుగ్మమిం
పారగ కామకేలి మైనాడగ నందొక పక్షినిల్లని
పార్వగనేలచంపితట గావున నీవును వేగజావు బోరోరి
దురాత్మయంచు గడునుగ్రత నమ్మునిబల్కె నల్కనన్.

కం॥ ఆకరుణానిధియగు వాల్మీకుల శాపాక్షరములు మితసమవర్ణ
శ్రీకరపాదచతుష్ట శ్లోకంబయి జగతిబరగె నుశ్లోకంబై।

వ॥ అంతనమ్ముని వెఱగందుచు దనశిష్యు భరద్వాజునింజూచి యోతపోధన యిట్లువేగి విషాదుండనయి యుచ్చరించిన శాపాక్షరంబులు సమవర్ణ చతుష్పాద శ్లోకంబయ్యె ననిపలికెనట. అంత బ్రహ్మదేవుడు వాల్మీకికి ప్రత్యక్షమై.

ఉ॥ నానుగనీ ముఖాబ్జమున వాగదయున్నది నాయనుజ్ఞ వి
జ్ఞానముతోడమున్ను మునిసంఘము చెప్పిన వాక్యపద్ధతిన్
సూనృతభావశాస్త్రముల శ్లోకనిబద్ధముగాగ విస్తృత
శ్రీనెరి విస్తరించి తగజెప్పుము రామకథా ప్రపంచమున్.

యాగతంత్ర విధానముల బోధించు గ్రంథములవసరము లయ్యెను. అప్పుడే బ్రాహ్మణములు రచింపబడినవి.

బ్రాహ్మణము లావశ్యకముచే పద్యరూపమున రచింపబడిన గ్రంథములుగాక విశేషమనుష్యప్రయత్నముచే గద్యరూపముననే యవిరచింపబడినవి. ప్రాచీన హైందవార్యుల ప్రథమ వచన రచనలీ బ్రాహ్మణములే. వేదములకును యజ్ఞశాస్త్రమునకును గలపరస్పర సంబంధమును విశదీకరించుటయే వీని ప్రయోజనము. వేదములు మహర్షి విరచితములు. బ్రాహ్మణములు పురోహిత విరచితములు. అవిశ్లోకరూపమున వెలసినవి. ఇవివచనరూపమున వ్రాయబడినవి. వేదభావములు స్వచ్ఛములు - స్వాభావికములు - సులభగ్రాహ్యములు - బ్రాహ్మణములభావములు స్వాభావికములుగావు. కదు గూఢములు. అవిమంత్రములు. ఇవితంత్రములు అందుకవికల్పిత విశేషములు పెక్కు గలవు. ఇందట్టివిలేవు. వేదములతి మధురములు. బ్రాహ్మణము మొత్తముమీద నిస్సారములు. 1

ఇట్లు పద్యరూపమున గాని గద్యరూపమునగాని వెలసిన వాఙ్మయమును గ్రం[illegible] స్థముగావించుటకు ప్రాథమిక యుగములలో జనులకు సాధనములు లేకుండెను. ఉ[illegible] మభావములుగల రచనలను మనుజులు సులభముగా జ్ఞప్తియుంచుకొనుటకును, [illegible] బోవు తరముల వారికి వానిని వ్యాపింపజేయుటకును, వారిభావములెంత సంక్షిప్తమ[illegible] గా తెలిపిన నంత సౌకర్యముగా నుండెడిది. పత్రములు, గంటములు, అక్షరము[illegible] వ్రాత మొదలగునవి మనుష్యులకు తెలియని యాదికాలములలో నుత్తమరచనలకు సం[illegible] శీలత ప్రధానలక్షణము. సాధారణముగా మనోభావములను గద్యరచనలయందుకం[illegible] శ్లోకములు మొదలగుపద్యరచనలయందిమిడ్చిసంక్షేపముగా వ్యక్తముచేయుట కవిరా[illegible] లకుసులభసాధ్యమగుట చేతను, గద్యములకంటె పద్యములే నిస్సంశయముగా శ్రావ్య[illegible] లై గానయోగ్యములై నవరసభరితములై దివ్యవ్యంగ్యార్థ పరిపూరితములై తనరా[illegible] చుండుటచేతను ఆకాలములో సమస్తశాస్త్రములును, వాఙ్మయమును ఛందోబద్ధమై శ్లోకరూపముననే రచింపబడుచు సమస్తజనసమాదరణీయములై యొప్పుచుండెను. క[illegible] లవతారపురుషులనియు, సకలవిద్యా స్వరూపిణియైన సరస్వతి వారినావేశించి, పల్కి[illegible] ప్రసాదించిన కావ్యములు దైవదత్తములనియు నెల్లవారు భావించి గౌరవించుట[illegible] విద్వాంసులు కవితాలబ్ధికై పాటుపడినట్లు గద్యరచనలకు పాటుపడకుండిరి. అం[illegible] చేతనే వైదిక వాఙ్మయమున వచనరచనలు బహుస్వల్పముగా గానవచ్చుచున్నవి.

---

1A. A. Macdonell History of Sanskrit Literature Page 3[illegible]

ఈవిధముగ కొన్ని శతాబ్దములు గడచిపోవంబోవ భావములందును, భాషములందును పెక్కు మార్పులు పొడమసాగెను. వేద, మత, వైదిక, తంత్ర, సాంఘిక సాంప్రదాయాదులగు నానాశాఖల విజృంభించిన పూర్వవాఙ్మయము పాఠకులకు సుబోధక మగుటకు వ్యాఖ్యానము లవసరము లయ్యెను. కాలక్రమమున నీవ్యాఖ్యానముల సంఖ్య యమితమగుచు వచ్చుటచేతను పవిత్రములైన సమస్త శాస్త్రముల విజ్ఞానమును ద్విజకుటుంబముల కగత్యమగుటచేతను, వీనిని సంక్షిప్తపఱుచుటకు సాధనముల నన్వేషించుట మిగుల యావశ్యక మయ్యెను. ఈయుగముననే సూత్రములు రచింపబడినవి. సూత్రములతి సంక్షేపశీలములు. సమస్తవేదశాస్త్రాదుల సారము నిందు స్ఫుటీకరింప బడినదని చెప్పవచ్చును. ఇవి శ్లోకరూపమున గాక వచనరూపముననే రచింపబడుట గమనింపవలసిన విషయము. రచనయందొక్క యక్షరము తగ్గినపక్షమున తమకు సుపుత్ర జననమైనట్లు సంతసించుచు నీసూత్రకారు లతిప్రయత్న ప్రయాసములతో నీసూత్రముల రచించిరని చెప్పబడినది. బహుసంగ్రహశీలములగు నీసూత్రములు కాలక్రమమున వ్యాఖ్యాన సాహాయ్యములేక పాఠకులకు బోధపడక పోవుటచేత వీనిపైమరల వ్యాఖ్యానములు గావలసివచ్చెను.

మరియు నాగరికత వృద్ధియగుకొలది భూర్జపత్రములపైని, తాళపత్రములపైని, పూర్వవాఙ్మయమును సూత్రవ్యాఖ్యానాదులును లిఖింపబడి భద్రపరుపబడుట కవకాశములు గల్గెను. పూర్వసంస్కృత వాఙ్మయములో యజుర్వేదమునందును, అథర్వణవేదమునందును, ఆరువంతుల నొకవంతు గద్యరచన లగుపడుచున్నవి. బ్రాహ్మణములు వచనరచనలే. తరువాత సంస్కృతవాఙ్మయములో సూత్రములును, వానివ్యాఖ్యానములును వచనరచనలయియున్నవి. మరియు సర్గాంతములయందును, ఇట్టి దృశ్యప్రబంధములలో నచ్చటచ్చట పాత్రముల వాక్యములలోను వచనరచనలగపడుచున్నవి. కొన్ని ప్రాచీనగాథలును కథాసరిత్సాగరము మొదలగు కథలపుస్తకములుగూడ సంస్కృతమున శ్లోకరూపముననే రచింపబడిన సందర్భమును బట్టిచూడ సమస్తమతశాస్త్రసాంఘికసాంప్రదాయ రూపకమైన సమస్త వాఙ్మయమును శ్లోకరూపమున రచింపబడుట యాశ్చర్యకరముగాదు.

శతసహస్రసంఖ్యలుగల గ్రంథములచే రాజిల్లు సంస్కృతమహా వాఙ్మయమునందు క్రీస్తుశక మేడెనిమిది శతాబ్దములు గడచువరకు నిజమగు వచనగ్రంథములగుపడ

యున్నవి. తరువాత దండి దశకుమారచరిత్రమును, బాణభట్టు కాదంబరిని, సుబంధుకవి వాసవదత్తను గద్యగ్రంథములుగా రచించిరి. పంచతంత్రహితోపదేశములు మొత్తముమీద గద్యరచనకే చేరునని భావింపవచ్చును.

సంస్కృతభాష తనప్రాబల్యమును కొద్దిగనో, గొప్పగనో, సమస్తభాషలపైని వాఙ్మయములపైని విస్తరింప జేసినది గనుకనే దేవభాషయని ప్రఖ్యాతిగాంచినది. ఆదేవభాషాసాహాయ్యమును విశేషముగా గొనిన హైందవభాషలలో మనమిచట ముఖ్యముగా నాంధ్రమును జేర్కొనవలసియున్నది.



## మూడవ ప్రకరణము.



### ఆంధ్రప్రశంస.

ఉ. తల్లిసమస్తభాషలకు దైవతభాషయు; దేశభాషలన్
పిల్లలలోన నాంధ్రమును పేరిటిదొంతయు ముద్దుబాడిరో।
త్తల్లజులాదరించిన తతింబున బల్కులగుల్కు మీరి యు।
ల్లల్లనదక్కు పక్కసెలియందప్రియు సెక్కుడు కీర్తి చేకొనెన్॥

ఆంధ్రప్రశంస ఐతరేయ బ్రాహ్మణమునందుగూడ కానవచ్చుచుండుటచేత నాంధ్రజాతి బహుప్రాచీనజాతిగా గన్పట్టుచున్నది. ఆంధ్రదేశము దండకారణ్యవర్తి దేశములలోని దనియు, పురాణపురుషుడగు శ్రీరాముడు భార్యాసోదరసమేతుడై యుచ్చటికివచ్చి యరణ్యావాసముచేసి పుణ్యభూమిగా జేసెననియు పామరజనులు విశ్వసించుటయేగాక విద్వాంసులగు నవీనచరిత్రకారులుకూడ సిద్ధాంతముచేసి యున్నారు, హైందవార్యులు భరతభూమి నాక్రమించి స్థిరనివాసము లేర్పరుచుకొని మతవిషయములను గూర్చి గ్రంథములు వ్రాయునంతటి నాగరికులైన వేదయుగమునాటికి ఆంధ్రులాటవికులైయున్నట్లు ఐతరేయబ్రహ్మణమునందు లేఖము గావింపబడియున్నది.[1] మహాభారత

1. ఆంధ్రులచరిత్ర - ప్రథమసంపుటము. 17 - 20.

మునందు పెద్ద-వోడ్ల కళింగాంధ్రముల ప్రశంస గానవచ్చుచున్నది. తరువాతసంస్కృత గ్రంథములలోఁగూడ నాంధ్రదేశమునుగూర్చి తరుచుగా వినవచ్చుచున్నది. చంద్రగుప్త చక్రవర్తి యాస్థానమున గ్రీకురాయబారిగనుండిన మెగాస్తనీసు వ్రాసిన వ్రాతలవలననే ఆంధ్రరాజ్యము మహోన్నత దశయందున్నట్లును, ఆంధ్రరాజ్యమునందప్పుడు ముప్పది దుర్గములును, లక్షకాల్బలమును, రెండువేల యాశ్వికులును, వేయియేనుంగులునున్నట్లు తెలియుచున్నది. ప్లినీయను గ్రీకుచరిత్రకారుడు ఆంధ్రరాజ్యమును గూర్చి ఆంధ్రజాతినిగూర్చి ప్రశంసించియున్నాడు. అశోకవర్ధనచక్రవర్తి కాలమునాటికాంధ్రులు నాగరికులై పల్లెలు, పట్టణములు నిర్మించుకొని రాజ్యములు స్థాపించి ప్రభుత్వము నేయుచుండిరని యశోకుని శాసనములె సాక్ష్యమిచ్చుచున్నవి. తనరాష్ట్రములోని వారలవలెనే యవనకాంభోజులును నాభకులును భోజులును పైఠాణికులును ఆంధ్రులును, పుళిందులును, తనచే ప్రకటింపబడిన బుద్ధధర్మములను నవలంబించిరని 13వ శిలాశాసనమునందశోకుఁడు వ్రాయించెను. తరువాతి నాంధ్రచక్రవర్తులు మగధసామ్రాజ్యమును జయించి యారాజ్యము నాక్రమించుకొని 450 సంవత్సరములు నిరంకుశముగానేలినట్లు మత్స్యాది పురాణముల వలన తెలియుచున్నది. ఆంధ్రులుత్తరమున మగధమునేగాక పశ్చిమమున మహారాష్ట్రమును దక్షిణమున సింహళమువరకునుగల కర్ణాటాంధ్రదేశములను ఏలుచు కొన్ని శతాబ్దములు పరిపాలించుటయేగాక ప్రచండమైన నావికాదళములు గల్గి, పూర్వపశ్చిమ సముద్రములపై తమయధికారమును నెరపుచు, ఖండాంతరదేశవాణిజ్యమును తమచేతనిడికొని.భరణి,(Borneo)యవ(Java)ద్వీపములలోను గాలనివాసములకు వలసపోయిన యాంధ్రజనులను సంరక్షించుచు నేటి బ్రిటిషు రాజాధికారులవలె వన్నెకెక్కి, తమదిగ్విజయ మెల్లయెడల తెల్లమగునట్లు శాసనాముల వ్రాయించి నాణెముల ముద్రించి ప్రకటించిరి2. సామ్రాజ్య విజృంభణముతో పాటు వాఙ్మయవిజృంభణము సహజముగా నుండునని నానాదేశచరిత్రపాఠకులకు విదితమైయుండును, ఆంధ్రసామ్రాజ్యముతో గూడవర్ధిల్లగనిన యాంధ్రవాఙ్మయమెట్టిదో తెలిసికొనుటకు సాధనము లింతవరకేమియు గానరాలేదు. ప్రాచీనాంధ్రవాఙ్మయస్వరూపము తెలియలేదు సరేకదా ఆభాషాస్వరూపమైనను సరిగానిర్ణయించు

2. Prof. Radha Kumud Mukhurjee - History of Indian Shipping Page 44 Onwards - Kalinga - Andhra and Kushan periods.

టకు తగినసాధనములింకనులభించకున్నవి.

1॥ తెలిసినంతవరకాంధ్రదేశమును బాలించినరాజులలో నాంధ్రరాజులనివ్యవహరింపబడుచున్న యాంధ్రవంశ్యులు ప్రముఖులుగాను ప్రథములుగాను గణుతికెక్కుచున్నారు. వీరికుత్తరమున పాటలీపుత్రమును దక్షిణమున గుంటూరు మండలములో కృష్ణాతీరముననున్న ధాన్యకటకము(ధరణికోట) ను రాజధానులైయుండెడివి. ఈధరణికోటసత్తెనపల్లి తాలూకాలో నమరావతి నంటియున్నది. ఈయాంధ్రరాజులు బౌద్ధమతావలంబకులు. బౌద్ధులకు ప్రాకృతభాషసంస్కృతమునకంటె ముఖ్యము. బౌద్ధమతగ్రంథములు తరచుగా ప్రాకృతమునందేయున్నవి. అశోకునికాలమందు ప్రాకృతము రాజభాషయై యాతని శిలాశాసనములన్నియు నాభాషయందే రచింపబడియున్నవి. పెద్దశాసనములు మాత్రమేగాక ధరణికోట, భట్టిప్రోలు, ఘంటసాల మొదలగుగ్రామములయందున్న చైత్యములయందలి రాళ్లమీద చెక్కబడియున్న చిన్నశాసనములు కూడప్రాకృతముననేయున్నవి. తెలుగుశాసనము లెచ్చటను నింతవరకు గానరాలేదు. కాబట్టియాంధ్రరాజుల కాలమందుప్రాకృతభాషయే రాజభాషగనువ్యవహారభాషగను నున్నట్లూహింపదగియున్నది. ఆకాలమునందు దేనుగెట్లున్నదో తెలియుట కాధారము లింతవరకులభింపలేదు. ప్రాకృతబౌద్ధ మతగ్రంథములతోపాటు కొన్ని ప్రాచీనాంధ్రగ్రంథములు చీనాచక్రవర్తుల గ్రంథభాండాగారములలో నున్నట్లుతమకు తెలియవచ్చెనని కూమిత్రులొకరు తెలుపుచున్నారు. ఈయంశమును గూర్చివిచారింప వలసియున్నది. ఆకాలపుదేశ భాషాభివృద్ధినిగూర్చి ఆంధ్రచరిత్రకారుకిట్లు వ్రాయుచున్నారు 2

2. ఆకాలమున నార్య బ్రాహ్మణులు సంస్కృతప్రాకృతములను వాడుకొనుచుండిరి. రాజకీయ భాషప్రాకృతము. వ్యవహారిక భాషమాగధము. ప్రాచీనమహారాష్ట్రము- పైశాచి- అపభ్రంశము మొదలగు ప్రాకృతభేదములు దేశభాషలునుండినవి. ఆకాలమునవాడ బడుచుండిన లిపిమార్గ్య లిపిగానుండెను శాసనము

1. బ్రి॥ శ్రీ జయంతిరామయ్యపంతులువారు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. 5 వ సంపుటములో ప్రకటించిన "ప్రాచీనాంధ్రభాషాస్వరూపము" అనువ్యాసములోని సంగతులు.

2. ఆంధ్రులచరిత్ర – ప్రథమసంపుటము – 177 – 178 పుటలలో చూడుము. బ్రి॥శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు రచించినది.

లన్నియు పాలిభాషలో నున్నవి. ప్రాచీన ద్రావిడభాషయే పైశాచి యనంబడు చుండెను. ఆర్యులుదీనిని పైశాచియని యపహాస్యము చేయుచుండిరి. అయినను ఆంధ్ర రాజులీ భాషలో గ్రంథములను వ్రాసియు వ్రాయించియు దేశభాషను ప్రోత్సాహపరచిరి. శాలివాహనుని మంత్రియగు గుణాఢ్య పండితుడీ భాషలోనే బృహత్కథను రచించెను. శర్వవర్మ యనుమరియొక మంత్రి కాతంత్రవ్యాకరణము నాభాషలోనే రచించి శాలివాహనునకు చెప్పెను. హాలశాత వాహనుడు ప్రాచీనమహారాష్ట్రభాషలో సప్తశతియను గ్రంథమును రచించియున్నాడు. వీనిని బట్టియాంధ్ర రాజులపరిపాలనమున దేశభాషలు పోషింపబడి వర్ధిల్లినవని యూహింపవచ్చును. ఈపైశాచిభాషనుండియే అరవము తెలుగు కన్నడము మళయాళము తులు మొదలగు భాషలు జనించినవి. అనేక భాషల సాంకర్యము తెలుగుబాస కబ్బుటచే తక్కిన పైశాచీ ప్రకృతికల కంటె తెనుగుభిన్నముగా గాన్పించుచున్నది"... "అనార్యులైన జనసామాన్యము యొక్క భాషను వృద్ధిపొందింప బూని ప్రయత్నించిన విధమును ఆకాలము నందలి రాజులును మంత్రులును జనసామాన్య భాషను గ్రంథములు వ్రాయుచు, వ్రాయించి వ్రాసినవారిని సత్కరించు చుండినట్లును ఆర్యులా భాషయందును తద్భాషా గ్రంథముల యందును అసూయ గలిగి యుండినట్లును బృహత్కథావృత్తాంతమునుబట్టి మనకు సులభముగా బోధపడుచున్నది. [ఈబృహత్కథా ప్రబంధమును సుబంధుకవి వాసవదత్తలోను బాణకవికాదంబరిలోను కాళిదాసు మేఘసందేశములోను తడవియున్నారు. నాగానందప్రియదర్శికా రత్నావళీ మాలతీమాధవ ముద్రారాక్షసాదిరూపకములకును 'కాదంబర్యాది కథలకును ఇదియే మూలము. తరువాత కొన్ని శతాబ్దములకు కాశ్మీరదేశమున సోమదేవుడను కవివర్యుడు ఈకథనే కథాసరిత్సాగరమను పేరసంక్షేపముగా సంస్కృతభాషలోరచించి నాడు. దీనినికథాశాఖకు సంబంధించినవచన వాఙ్మయప్రశంస ప్రకరణమునందు విపులముగా ముచ్చటింతము].

1॥ ఆంధ్రసామ్రాజ్యము క్షీణించి యంతరించిన తరువాత పల్లవులీదేశమునకు రాజులైరి. వీరుఆంధ్ర కన్నడ చోళదేశ ములలో జాలభాగము కూడ బాలించినట్లున్నది. వీరిశాసనములను బట్టి యశ్వత్థామ కొకానొక యప్సరస్త్రీయందు బుట్టిన

1. "ప్రాచీనాంధ్ర భాషాస్వరూపమును గూర్చి బ్ర॥ శ్రీ జయంతిరామయ్యపంతులుగారు "ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక - 5 వ సంపుటములో ప్రకటించిన వ్యాసము చూడుము.

పల్లవుడను పురుషుడు వీరివంశకర్తయనియు వీరు వైదిక మార్గావలంబకులనియు గన్పట్టుచున్నది. కాని యాంధ్ర రాజుల కాలమందు ప్రాకృతము వ్యవహార భాషగా స్థిరపడుట చేతా బోలు వీనిశాసనములు కూడననేకములు ప్రాకృతమునందే రచింపబడినవి. ఇటీవలి శాసనములలో కొన్ని సంస్కృతము నందున్నవి గాని యా సంస్కృతము తరుచుగా లక్షణవిరుద్ధముగను, ప్రాకృతపదభూయిష్ఠముగను గనబడుచున్నది.

ఏడవ శతాబ్దారంభమున చాళుక్యులాంధ్ర దేశముపైదండెత్తివచ్చి పల్లవరాజులను జయించి దేశమును స్వాధీనముచేసుకొని పరిపాలింప గలిగిరి. వీరు మానవ్యగోత్రులు, హారితీపుత్రులు, సప్తమాతృకలరక్షణముగలిగి కార్తికేయానుగ్రహమున నభ్యుదయమును గాంచిరనియు నారాయణానుగ్రహముచే వరాహధ్వజమును బడసియా ధ్వజము నీడనుండి అనేక రాజులను వశపరుచుకొని రనియు శాసనముల వలన తెలియుచున్నది. చాళుక్యవిజయాదిత్యుని కుమారుడగు జయసింహవల్లభుడు విష్ణుభట్టసోమయాజి వలన పెంపబడి విష్ణువర్ధనుడను నామము వహించి. కదంబులు గాంగులు రాష్ట్రకూటులు ననుజాతులవారి నోడించి రాష్ట్రకూట రాజగు నయింద్రుని నుక్కడించి వాని రాజ్యమును గైకొని వాతాపినగరము రాజధానిగా పరిపాలనము చేయనారంభించెను. ఇతని యనంతరము రణరాగుడు, పులకేశివల్లభమహారాజు, కీర్తివల్లభమహారాజు, మంగళేశుడు ననువారలు రాజ్యమును క్రమముగా విస్తరింప జేయుచుండిరి. క్రీ॥శ॥ 611 వ సంవత్సరమున సింహాసనముకువచ్చిన శ్రీ పృథ్వీవల్లభ మహారాజు మహాసేనలం గూర్చుకొని పోయి దక్షిణ కోసలమును జయించి, కళింగ వేంగీ దేశములపై దండెత్తివచ్చి పిష్టపుర (పిఠాపుర) దుర్గమును సాధించి కళింగ వేంగీదేశముల జయించి తన సోదరుడగు కుబ్జవిష్ణువర్ధనుని రాజప్రతినిధిగా నుంచెను. ఈ కుబ్జవిష్ణువర్ధనుడే తరువాత స్వతంత్రుడై వేంగిదేశమున పూర్వచాళుక్య రాజ్యమును స్థాపించినాడు. ఈతని యన్న యగు పృథ్వీవల్లభ మహారాజునకు సత్యాశ్రయుడనియు నీతనికి విషమసిద్ధియనియు బిరుదునామములు గలవు. అభేద్యములగు స్థలదుర్గములను జలదుర్గములను భేదించిన మహాశూరుడగుటచే నీతనికి విషమసిద్ధియని బిరుదువచ్చెనని తిమ్మాపురశాసనమున చెప్పబడినది-1. ఈ విషమసిద్ధి మహారాజు క్రీ॥శ॥ 615 సం॥రమున చైత్రశుద్ధపూర్ణిమ తరువాత మహారాజ పదవిని గాంచినదు ఎనిమిదిసంవత్సరములు రాజ్యము చేసెను. ఈతని వంశజులు క్రీస్తుశకము పండ్రెండు

1. See Epigraphica Indica Vol. IX Page 317 No. 50 Line 8.
స్థలజలాది దుర్గవిషమేష్వపి!

పదమూడవ శతాబ్దమువరకీదేశమును పరిపాలించిరి.

ఇట్లేడెనిమిది శతాబ్దములీ యాంధ్రదేశమునేలి చరిత్రయందుకెక్కి ప్రఖ్యాతిగాంచినచాళుక్యనృపాలురు వైదిక ధర్మప్రవర్తకులు. సంస్కృతభాషాభిమానులు గావున వారికాలమునబుట్టిన శాసనములు సంస్కృతమయముగా నున్నవి. కానియాకాలమున బుట్టిన తామ్రశిలాశాసనములో నచ్చటచ్చట తెనుగుమాటలు కొన్ని చేరియున్నవి. వీనినిబట్టియాకాలమునందెనుగుభాషాస్వరూపము స్థాలీపులాకన్యాయముగా గొంతవరకునిర్ణయింపవచ్చును. ఆంధ్రపల్లవుల కాలమందు ప్రాకృతభాషయే రాజాశ్రయముగలిగి గౌరవింపబడుచున్నను జనులాంధ్రులగుట నాంధ్రభాష వాడుకలో నుండకమానదు. కానిసలక్షణమైగ్రంథరచనా సహమైనభాష యుండియుండదు. తద్భవశబ్దములనేకము లీకాలముననే ప్రాకృత భాషాద్వారమున తెనుగులో జేరినట్లు కనబడుచున్నది. పూర్వచాళుక్య వంశకర్తయగు సత్యాశ్రయ మహారాజును అతని వంశజులును వైదికధర్మ ప్రవర్తకులు నుసంస్కృత భాషాభిమానులు నైయున్నను ఆంధ్రభాషావాఙ్మయములను పోషించుటకుగూడబద్ధకంకణులై కృషిసల్పిరనుటకు.

కం॥ మును మార్గకవితలోకం । బున వెలయగ దేశకవిత బుట్టించి తెనుం ।
గున నిలిపిరంధ్రవిషయమున । జనసత్యాశ్రయుని దొట్టిచాళుక్యనృపుల్ ॥

అనికుమార సంభవమున నన్నెచోడకవిరాజశిఖామణి చెప్పిన పద్యము ప్రబలతార్కాణముగానున్నది

"చాళుక్యరాజ్యముతోడ నాంధ్రభాషయు దినదిన ప్రవర్ధమానమై రాజరాజు నాటికున్నత స్థితికివచ్చినది. కవికులతిలకుండగు నన్నయభట్టారకుడు భారత రచనయందు ప్రయోగించుటచేత నీభాషపావనమై భావికవులకు పరమప్రమాణమైనది. అమహాకవిని వాగనుశాసనుడనుట కిదియొకటిచాలును.

నన్నయభట్టారకునికి పూర్వమాంధ్రభాషలో వెలసిన పద్యకావ్యముగాని గద్యకావ్యముగాని చంపువుగాని ఇంతవరకొక్కటియు దొరకలేదు. 1అయినను అట్టి

1. నన్నెచోడకవిరాజశిఖామణి రచించిన యాంధ్ర 'కుమారసంభవ' కావ్యము నన్నయకు ముందొక శతాబ్దమున ననగా క్రీ॥ శ॥ 9[illegible]7 సం॥ న వ్రాయబడినట్లు అగ్రంథసంపాదకులగు బ్ర॥ శ్రీ॥ మానవల్లి రామకృష్ణకవి M.A. గారు ప్రకటించియున్నారు. కానియాంధ్రవిద్వాంసు లనేకులాకాల నిర్ణయములంగీకరింపలేదు. రావుబహద్దరు వీరేశలింగంపంతులుగారు నన్నెచోడుడు నన్నయకు తరువాతవాడనియే తమకవుల

కవులున్న కావ్యములున్నట్లు విశ్వసించుటకు కొన్ని హేతువులగు పడుచున్నవి. ఉభయభాషాకావ్య రచనాభిశోభితుడగు నన్నయ భట్టారకుడు రాజరాజసభను వర్ణించుచో నందు "మృదుమధుర రసభావ భాసుర నవార్థ వచనరచనా విశారదులైన మహాకవులున్నారని చెప్పియున్నారు." (ఆదిపర్వము 1 - 8) ఇంతవరకునట్టి కావ్యములేవియు లభింపలేదని మాత్రము అంగీకరింపక తప్పదు. అట్టిపూర్వవాఙ్మయమునకింకను లభింపకున్నందుకు చింతిల్లుచు, ఆకాలమునాటి యాంధ్రభాషాస్వరూపమునైన కొంత చూచిసంతసింతము. ఆస్వరూపమును స్థాలీపులాకన్యాయముగ గ్రహించుటకాకాలపు శాసనములే ముఖ్యసాధనములు. ప్రాచీనచాళుక్య రాజుల శాసనములు సంస్కృతమునందే రచింపబడినవి గాని తరువాతిశాసనములు కొన్నిటిలో శాసనకాలమును, గ్రామసీమాదులును సరిహద్దులును వివరించునపుడు తెలుగుమాటలు ప్రయోగింపబడినవి అట్టిశాసనముల రెండుమూడిచ్చట నుదాహరించుచున్నాను.

(1) ఇంద్రకీల పర్వతముమీద రెండు చాళుక్యశాసనములు.

చాళుక్యభీమునినాటి శాసనము - మ॥ జయంతిరామయ్యపంతులుగారు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (సంపుటము 7 సంచిక 4) లో ప్రకటించినది చూడుము. అందు కాలమును సూచించు భాగమిట్లువ్రాయబడియున్నది. "స్వస్తిశ్రీ సర్వలో
కాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్య
సంవత్సరంబుళ్ పదిపడగునేణ్ట విక్రమాదిత్య తనయశ్రీ విష్ణువర్ధన
ప్రసాదాచ.........................................

(ఈశాసనకాలము శాలివాహనశకము 831 అనగా క్రీస్తుశకము 909 అని నిర్ణయింపబడియున్నది. 2-10-22 తేదిగల ఆంధ్రదినపత్రికయందు కాకినాడ విలేఖరి యింద్రవర్మ శాసనమునందు (క్రీ॥ శ॥ 684 సం॥రం॥) "అలపాంబోళ్" "నెప్పిలాళ్" "సోమయాజుల వెల్లెక్కిబోళ్" మ అటబోళ్" 'పాల్మంకుల్లి' 'కాంశవోడబోళ్' అనుమాటలున్నట్లు వ్రాయుచున్నాడు. దీనినిగూర్చివిచారింపవలసియున్నది.

---

చరిత్రమునందిటీవల సిద్ధాంతముచేసియున్నారు. తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు మొదలగు విద్వాంసులీ విషయమై చేసిన విమర్శనములవలన నీసిద్ధాంతము మరియు పోషింపబడుచున్నది. కావున నన్నెచోడుడు నన్నయకు తరువాతవాడనియే నిశ్చయింపవలసియున్నది. గొ॥ వేం॥ రా॥

2. సరిహద్దులను సూచించు భాగము.

చూడుము. Epigraphica Indica. Vol. XII Pages 61-65 Nammuru Grant of Ammaraja II

అమ్మరాజ విష్ణువర్ధన మహారాజు (క్రీ॥ శ॥ 918 - 925) నమ్మూరు గ్రామము దానముచేసినట్లు వ్రాయించిన శాసనములో 26 వ పంక్తిలో ఆఖరు పదములును 27 - 28 పంక్తులును -

"అస్యక్షేత్రస్యావధయః పూర్వతః స్థాపితశిలాగుణ్టసీమ
దక్షిణతః పందివేద్దెరి పన్నస్సైవసీమ పశ్చిమతః క్రోప్పేటి తూర్పుసీమ
ఉత్తరతః ఈందులగుణ్ట ఏతేషామధ్యవర్తి క్షేత్రమ్

మఱియునిటీవల 1921 సం॥రం॥ ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక 73 - 80 పుటలలో బాపమహారా జొసంగిన "అరుంబాకతామ్రశాసనము" ప్రకటింపబడినది. అందుసరిహద్దుల భాగమిూ క్రింద వ్రాయుచున్నాను.

"తస్యగ్రామస్యావధయః పూర్వతః చెఱకుంబల్లి
దక్షిణతః శ్రీపుణ్డి
పశ్చిమతః కావ్రూరు
ఉత్తరతః గోమడువు

ఈశాసనకాలము క్రీ॥శ॥ 977 - 999 మద్యనుండునని మ॥ రా॥ వేం॥ లక్ష్మణరావు పంతులుగారు కాలనిర్ణయము చేసియున్నారు.

3. మఱియొకటిచూడుము - Epigraphica Indica Vol. VI page 347
రాజరాజనరేంద్రుని తండ్రియైన విమలాదిత్యుడు శాలివాహనశకము 932 సంవత్సరమున (క్రీస్తుశకము 1011 సంవత్సరము) భూదానముచేసి వ్రాయించిన రణస్థిపూండి శాసనమున సరిహద్దుల భాగము:—

॥అస్యావధయః

పూర్వతః కొతనడిపియ చెఱువుపఱుమటికట్ట

ఆగ్నేయతః బ్రోంతుకఱతియుం బొలురియు రణస్థపూండియు ము
య్యలికట్టున వేలంగగుణ్ట పఱుమటికట్ట.

దక్షిణతః పెంజెఱువు కట్టడిగు (నా) విత్రోవ

నైరుత్యతః పాలూరియుం గోఱుకోటియు రణస్థపూణ్డియు ముయ్యలి
కట్టున చిన్తగుణ్ట.

పశ్చిమతః కోఱుకోటిపోదఱు.

వాయవ్యతః ఱుల్లసీమైవసీమా.

ఉత్తరతః కఱపట్ఱియు నేట్టయుసీమైవ,

ఈశానతః ఏట్టయు బ్రోన్తుకట్ఱియు రణస్తి పూండియు ము
య్యలికట్టు

ఏతద్............

(ముయ్యలికట్టు అనగాముాడుసరిహద్దులు కలియుచోటు అనియర్థము

8. యుద్ధమల్లుని బెజవాడశాసనము.

నన్నయభట్టారకునకు పూర్వము కేవలమాంధ్రమున రచింపబడి దొరకిన శాసనము యుద్ధమల్లుని బెజవాడశాసనము. ఈశాసనము క్రైస్తవాబ్దములు 890 - 946 మధ్యపుట్టియుండునని కాలనిర్ణయము చేయబడియున్నది ; ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికయొక్క 6 వ సంపుటము 49 - 88 పుటలలో బ్ర॥ శ్రీ॥ జయంతిరామయ్యపంతులుగారిచే ప్రకటింపబడినది. అందు 29 వ పంక్తి యాఖరుపదములు మొదలు 26 వ పంక్తి తుదవరకున్న భాగము వచనరూపమునను శేషించినదంతయు మధ్యాక్కర పద్యరూపమునను ఉన్నది. ఈవచనపంక్తులలో నాఖరియారింటికి పంక్తి మొదటి యక్షరములు పోయినవి. మిగిలినదంతయు నీక్రింద వ్రాయుచున్నాను.

“...............దీనిజేంబ్రోలు

హాలెమురతిరబేలు

× రొణ్డు పోటిగోరగ

× నుబెట్టివేసగనుజ

× యిస్తితినేకొణికాచు

× రదీనిన్దారునిల్పినవా:

× తిదప్పియశిపుటవా

× బుగాగ ”

ఈశాసన వృత్తాంతమంతయు నాంధ్రసాహిత్య పరిషత్పత్త్రికవారు పుస్తక రూపమునగూడ ప్రకటించియున్నారు.

మరియు 2-10-1932 తేదిగల ఆంధ్రదినపత్రికయందిట్లు ప్రకటింపబడినది.

ఏడువాడలపాలెపు శాసనము.

ఇది కాకినాడ వాస్తవ్యులయిన కీ॥ శే॥ నాళం పద్మనాభముగారిచే ప్రథమమున సంపాదింపబడెను. ఇదియామధ్య దొరతనమువారికి పంపబడి చదువబడినది. శా. శ. 940 సం అనగా కీ॥ శ॥ 1018 సంవత్సరమునందు యీ శాసనము వ్రాయబడెను. రాజరాజనరేంద్రుడు కీ॥ శ॥ 1023 సం. సెప్టెంబరు నెలలో పట్టాభిషిక్తుడైనట్లుల యీశాసనమువలన ఋజువగుచున్నది. వఱూకామరాజు, తెమ్మరాజు, యిమ్మడి పెడంగరాజు, శోధపరాజు, కాళియుగ కణ్ణరాజు, వీరు ‹‹పడవాలు నడుప సేయకు (నకు) (అనగా సేనాధిపతి అని అర్థము చెప్పబడుచున్నది.) గ్రహారము ఇచ్చినట్లును, యీ ప్రదేశములకు నైఋతిభాగమున కాలూరు, తూర్పున పోంగాటది, దక్షిణమున గరివిడి, ఆగ్నేయమున రేంగులచెఱువు, పశ్చిమమున పోతిపూణ్డి, మొదలగు హద్దుల మధ్య ఆ యగ్రహార మున్నట్లును శాసనము తెలుపుచున్నది.

పైశాసనములలోనున్న తెలుగువ్రాతలను, తెలుగుమాటలనుబట్టి చూడగా నన్నయభట్టారకునికిముందు నూరు, నూట యేబదిసంవత్సరములకు పూర్వము తెలుగుభాష యొక్క-యాద్యప్రకృతి. అనగా బాల్యావస్థయందీ భాష యేరూపమును దాల్చియుండెనో మనము గ్రహింపగలుగుచున్నాము. అవల నొకటి రెండుశతాబ్దములు గడచిన యనంతరమాంధ్రభాషామతల్లి నన్నయభట్టారకాది కవిచంద్రుల కళాప్రభావముచేత

నెక్కొల్పబడినవో, ఆదలి వాఙ్మయమేయే రూపముల దాల్చి విజృంభింపఁగల్గెనో, ఆవిజృంభణమున బొడసూపిన గద్య పద్య శాఖల వాఙ్మయమునకు గలపరస్పర సంబంధమెట్టిదో చర్చింతము.



## ఆంధ్ర గద్య వాఙ్మయ చరిత్ర.

### నాల్గవ ప్రకరణము.

### చంపూకావ్య బాహుళ్యము.

మ॥ "మహిమున్ వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితిమూలమై దనర శ్రీనాథుండు ప్రోవన్మహో
న్నతుఁడై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటించు నీ
బహుళాంధ్రోక్తి మయప్రపంచమున తత్త్వాగల్భ్యమూహించెదన్."

శ్రీసత్యాశ్రయ ప్రముఖ చాళుక్యనృపాలు రనేకులతి గారాబముతోఁ బెంచుటం జేసి నైసర్గికాటవికతన్వీడి మోటుతనంబెడబెట్టుచున్న యాంధ్రభాషాకుమారి నన్నపార్యమహామహుని యపారకళాకౌశల ప్రభావముచే సంస్కరితయై, నూతనోజ్జీవముల గొని, మెఱుగుదేరిన సుందరసుకుమార శరీరమును ఇంపుమీరెడు మృదుమధుర వాక్కులను, సొంపుగులుకెడు గంభీరమహనీయ స్వరూపమును బడసి, సాహిత్యాభిమానులకు నిరంతరమనః ప్రియంబుసేయు మనోజ్ఞమూర్తిం దాల్పఁగలిగె గావున నాంధ్రభారతిని నన్నపార్య చతురాననుఁడే సృజించి చేపట్టి శాసించెననుట యెంతయు సమంజసముగానున్నది. ఈకవికులతిలకుండీ విధమున సృజించి శాసించిన యాంధ్రవాణీ ప్రపంచమాతని యనంతరమున నన్నెచోడకవి రాజశిఖామణి మేధాసంపత్తి జూఱగొని, భాస్కరకవి ప్రసాదిత తేజోధన మొకింత పరిగ్రహించి, భారతసంహిత మిషంబున తిక్కకవి బ్రహ్మచే జీవితపరమార్థము తెస్సఁగ నెఱింగినదై, నాచనసోముని సర్వజ్ఞతం బాలుగొని శ్రీనాథకవి సార్వభౌముఁడు కల్పించిన శృంగార వీథులం దిరిగితిరిగి యావలభక్త శ్రేసరుఁడంగు పోతనామాత్యుండు ప్రబోధింప విరక్తచిత్తయు. భక్తిమార్గ గామియునై యుల్లసిల్లనాగెను. తదనంతర మాంధ్రసరస్వతి శ్రీకృష్ణదేవరాయ చక్రవర్తి పజ్జంజేరి

సహస్రహస్తముల సంరక్షించి పూజించె నాంధ్రకవితా పితామహుని ప్రౌఢత్వముంగర చి, ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకులు వినుచు, రామకృష్ణుని పరిహాసప్రసంగములను ముచ్చటనొందుచు, నష్టదిగ్గజముల నడుమకొంతదనుక విహరించి, విహరించి రామరాజభూషణుని శ్లేషవైచిత్ర్యముల కెంతయు బ్రీతచిత్తయై యావల సూరనార్యుని ప్రభావముచే సకలకళాపరిపూర్ణయు సర్వజనాహ్లాదకారిణియునై సంచరింపజొచ్చెను. కాని వేంకటకవి నైవేద్యమిడిన 'పాకమునబడిన చేమకూర' మెసవిన తరువాత కవినామధారులగువార లనేకులాంధ్రవాణికి, ఉత్కళాంగనల కరకంకణములే మేలుమేలనిపించు నాని, నలంకారములను పేరబరగు వానినమోమయ భూషణములను బెక్కుబెట్టి. నిలువెల్ల బహుగ్రంథములపాలుచేసి, పునిలుకులం బెట్టుట కారణముగ నాంధ్రసారస్వత మాత మిగుల నీరసించి శోషించి ప్రాణమాత్రావశిష్టయయ్యెనని యాంధ్రభాషాభిమానులకెల్లరకు విదితమైయున్నది.

ఇట్టుద్భవించి పెంపొంది నీరసించిన యాంధ్రవాఙ్మయ ప్రపంచమునందలికావ్యజాలమునకును, పాశ్చాత్యాది వాఙ్మయముల పొడసూపెడి కావ్యజాలమునకును రచనవిధానమున నొకగొప్ప భేదమగుపడుచున్నది. పాశ్చాత్య పద్యకావ్యములలో కావ్యమంతయు గణాదినియమములను పాటించుచు పద్యరూపముననే యుండును గాని నడుమనెచ్చటను గద్యగానరాదు. కొన్నిదృశ్య ప్రబంధములలో మాత్రము నీచపాత్రముల నోటనుండి గద్యసాధారణముగా వినవచ్చును. మరికొన్ని స్వల్పసందర్భములలో కూడ నట్టి దృశ్యప్రబంధములలో మాత్రము కావ్యమధ్యమున నచ్చటచ్చట గద్యకానవచ్చును. కానిమరియే యితర పద్యకావ్యము లందును కొంతవరకు పద్యమును మరికొంత గద్యయును జేరియుండవు. గద్యపద్యాత్మకములై చంపువులనంబడెడి మిశ్రితకావ్యములా వాఙ్మయములలేవు. సంస్కృతమున చంపూకావ్యములు కొన్నిగలవు. మన యాంధ్రమందన్ననో కావ్యపురాణాదులన్నియు నించుమించుగ చంపువులేయై యున్నవి. నిర్వచన గ్రంథములు కొన్ని పొడసూపినవి కాని అవి బహుస్వల్ప సంఖ్యాకములై యున్నవి.

కావ్య మధ్యమున వచన రచనమున కేవమియ్యనని భీష్మించి యాంధ్రమున ప్రథమనిర్వచన గ్రంథము రచించినవాడు కవి తిక్కన. ఈతడు చిన్నతనమున నుత్తర రామాయణమును నిర్వచనగ్రంథముగా రచించెను. వచనములేక వ[illegible] తెన్ను

టీకాష్టమును దిలంపీతనికి కలదనుట కారామాయణములోని యీ క్రింది పద్యము నిదర్శనముగా నున్నది.

కం॥ వచనము లేక యవర్ణన । రచియింపగ గొంతవచ్చు ప్రౌఢులకుగథా ।
ప్రచయము బద్యములన పొం।దుచితంబుగ జెప్పటార్యులొప్పిదవనకే ॥

కేవల పద్యకావ్య రచనకష్టమైనదనియు, నందుచేతనే యది యధిక గౌరవ హేతువనియును కొందరుతలంచుట గలదు.

చూడుము - కంకంటి పాపరాజురచించిన యుత్తర రామాయణ మునందీ క్రింది పద్యము :-

మ॥ వరుసందిక్కన యజ్వ నిర్వచన కావ్యంబై తగం దేనెవు ।
త్తరరామాయణ మందు నున్నరి ప్రబంధంబూని నిర్మించు టే
సరసత్వంబని ప్రాజ్ఞులారని రసింపబోకుడీ రాఘవే।
శ్వరు చారిత్రము లెందరెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాలవే॥

అని ప్రబంధము అనగా చంపువు కంటె నిర్వచన కావ్యములందు పండితులకు గౌరవమెక్కుడని తెలుపుచున్నాడు.

తిక్కనరచితమైన యుత్తర రామాయణములో గొంత కథమిగిలి యుండగా దానినే కాశ్వాసముగా ముగించిన జయంతి రామభట్టకవి తనభాగమును నిర్వచనముగా వ్రాసెను.

వీనితరువాతి మధ్యయుగమున మరియేనిర్వచన గ్రంథములు రచింపబడినవో తెలియరాకున్నది. ఇటీవల రావుబహద్దరు కందుకూరి వీరేశలింగముగారు శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వచన నైషధము రచించిరి. మచ్చ వెంకటకవియనునాతడు క్రీ॥ శ॥ 1884 సంవత్సరములో పర్లాకిమిడి మండలమున శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వచన కుశచరిత్రరచించెను. ఈగ్రంథమును పూండ్ల రామకృష్ణయ్యగారు తమఅముద్రితగ్రంథ చింతామణి

---

చూడుము. భాస్కరోదంతము పుటలు, 24 - 27. బ్ర॥ శ్రీ॥ కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు రచించినది.

లో 1893 సం॥ న ప్రకటించుచు నీగ్రంథ పీఠికయందు 11వపుటలో నిట్లు వ్రాయుచున్నారు

నిర్వచన గ్రంథము-వచనము లేక కేవల పద్య భూయిష్ఠమైన గ్రంథము ...ప్రకృతున్నియు నిర్వచన నియమములోనివి, ఈనియమమునకు మార్గదర్శి బుధారాధన విరాజియగు తిక్కన సోమయాజి....ఇట్టినిర్వ చనగ్రంథములనేకము లిలవెలయుచున్నవి. వానినెల్లనిచట పేర్కొనుట యనావశ్యకము. అయినవీనిలో నెల్ల బ్రహ్మశ్రీ కొండూరు వెంకట రత్నము పంతులుగారి "శ్రీబిల్వేశ్వరీయము" నిర్వచన గ్రంథములలో దలకట్టనదగి యున్నది. ఇందుదాదాపుగా 8000 పద్యములు గలవు.

ఇట్టినిర్వచన కావ్యరచన బహుప్రయాస కరమనియు, అట్టిఘనకార్యమును నిర్వహించి తమయసాధారణ ప్రజ్ఞలోకవిదితము గావించియనన్య సామాన్య గౌరవ లాభముం బడయవలయుననియు తలంచి పట్టుదలతో గూరుచుండి తెలుగున నిట్టికావ్యములే యుదారుగురు కవులో వ్రాయజాలినట్లగు పడుచున్నది. కానివచన బహిష్కారవిశేషము దప్పవీనియందుత్తమ కావ్యలక్షణమైన కవిత్వ కళాకౌశలత్వ మేమియుగానరా నందున వీనికి వాఙ్మయరాష్ట్రమున ప్రవేశమున్నదనుట కవకాశము జాలకున్నది. బాల్యమున సందేహించుచునే నిర్వచనోత్తర రామాయణ రచన కుపక్రమించి, పట్టుదల కెక్కెట్లో పనిజేసి తిక్కన వ్రాసితి ననుకొనియెమ గానియారామాయణము భారతమంత ప్రజారంజకముగా నుండక, వ్యాప్తిగనక యుండిపోవుట మనమందర మెరిగియేయున్నాము. తిక్కన పెద్దవాడై, యాంధ్రమహా భారతరచనకు గడంగుచు వ్రాసినయీక్రింది పద్యమువలన నామహాకావ్యము నతడు చంపువుగానే రచించుటకు నిశ్చయించినట్లు స్పష్టమగుచున్నది.

ఉ.॥ కావునభారతామృతము కర్ణపుటంబులనార గ్రోలియాం ।<br>
ధ్రావలిమోదముంబొరయు నట్లుగ సాత్యవతేయసంస్మృతి<br>
శ్రీవిభవాస్పదంబయినచిత్తముతోడ మహాకవిత్వదీ ।<br>
క్షావిధినొందిపద్యములగద్యములన్ రచియించెదన్గృతుల్

విరాట. 1-30

ఇట్లుమహా కవిత్వ దీక్షావిధితో, గద్యపద్యాత్మకముగా మహాభారతమునురచించుచున్నానని ఘంటాపదముగా చెప్పుచు, తానురచించిన భారత మంతటిలో మూడింటనొకపాలు వచనములు వ్రాసియుండుటచేత, కవిబ్రహ్మయాంధ్ర కావ్యములలో త

చన ప్రయోగము నిషేధించుట సమంజసముగాదని నిశ్చయించినట్లు మనమూహింపవలసియున్నది.

మరియు నిటీవలనాంధ్రమున శుద్ధాంధ్రని రోష్ఠ్యనిర్వచన నైషధము రచించిన రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు తామాకావ్యమునట్లు రచించుటకుగల కారణములను తమస్వీయ చరిత్రము- 2వసంపుటము 126 పుటలో నిట్లుచెప్పుచున్నారు.

“ఈవరకెవ్వరును త్రొక్కని త్రొక్కిత్రోవ త్రొక్క వలెనని... నామనస్సునకుతోచినది. అచ్చతెలుగుగ్రంథములు పొన్నగంటి తెలగనార్యుడు కూచిమంచితిమ్మకవియు మాత్రమేరచించిరి. నిర్వచన గ్రంథములనొక్క తిక్కన సోమయాజిమాత్రము రచించెను. నిరోష్ఠ్యగ్రంథముల నిద్దరుకవులు మాత్రమేచేసిరి ఈమూడువిధములైన ప్రయాసములు సమీకరింప జేసి యేకగ్రంథము నందిముడ్చుట యొక్కవ ప్రశస్తనీయమనితలచి... శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వచన నైషధమను పేరగ్రంథరచన కారంభించితిని. ఇట్టియెడాను గ్రంథములందు మాత్రమే వచనరచన బహిష్కరింపబడుటయు, నీగ్రంథములందు సహితము వచన నిషేధమొక నియామకముగాను, ప్రయాసముగాను విద్వాంసులు తలంచుచుండుట చేతను ఈప్రయాస ఫలితములుత్తమకావ్యములుగా పరిగణింప బడుచుండుట చేతను, బాల్యమున రచించిన యుత్తర రామాయణము నందుతా నిషేధించినను, జ్ఞానవృద్ధుడును, సోమయాజియునై రచించిన పంచమ వేదమునందు మూడింట నొకపాలు కి మిశ్రమ్మ వచన ముపయోగించుటయు చూపజాడ, వచనప్రయోగ నిరాకరణమాంధ్రమునందు సరససారోగ్య కావ్యోత్పత్తికొక ప్రతిబంధకముగా గన్పట్టుచున్నది. ఇతరభాషలలో ఛందశ్శాస్త్రములందుకంటె తెలుగున గణ యతి ప్రాస నిబంధనలత్యధికము గావున పెక్కు సందర్భములందు వచనసాహాయ్య మపేక్షించక సజీవములై రసవంతములైన కావ్యములాంధ్రమున వెలువడుట దుస్తరమని తలంపవలసి వచ్చుచున్నది. సంస్కృతమునందు సహితము కేవలపద్యముల కంటెను, కేవల గద్యములకంటెను ఉభయ మిశ్రితములైన చంపూకావ్యము లెక్కువహృదయంగమముగానుండు నని కొందరు తలంచుచున్నారు.

శ్లో॥ పద్యం ... కే బహుసతాం హృద్యం విగద్యం నత।
గద్యంచ ప్ర... విజహాత్పద్యేన బుధా స్వాద్యతాం।
అథ త్రైహ... గడుభకౌ రామోద భూమోదయం।
సంగః ... ముసకే మాధ్వీక మృద్వీకయోః॥

వేంకటాధ్వరి - విశ్వగుణాదర్శము.

ఈవిధముగనే సంస్కృతమున చంపువులు వ్రాసినవారందరు పద్యకావ్యములకంటె చంపువులే శ్రేష్ఠములని వ్రాసియున్నారు.

సంస్కృతభోజచంపువునందు కూడ నీవిషయమై యిట్లు చెప్పబడి[*] యున్నది.

గద్యానుబంధ పదమిశ్రిత పద్యసూక్తి ।
ర్హృద్యాహి వాద్యకలయా కలితేవ గీతిః ।
తస్మాదధాతు కవిమార్గజుషాం సుఖాయ ।
చంపూప్రబంధరచనాం రసనా మదీయా ॥

శ్రీవ్యాస భగవానులు సంస్కృత మహాభారతమును చంపువుగానే రచించెను. నన్నయభట్టారకుడు ఆంధ్రమహాభారతమును గూడ చంపువుగానే రచించి యున్నాడు. తిక్కనకవి యుత్తర రామాయణమును కేవలము పద్యరూపముగనే రచించి చూచి యట్టిరచన లాంధ్రభాషా జీవతత్త్వమునకు సరిపడవని యనుభవముచే తెలిసికొనిన తరువాత, నన్నపార్యుని మార్గమునే యనుసరించి భారతకృతిని చంపువుగానే రచించెను. ఇట్లు వాగనుశాసనుడును కవిబ్రహ్మయు నవలంబించిన మార్గమునే యనుసరించి, ప్రబంధ పరమేశ్వరుడు భారతారణ్య పర్వశేషమును పూర్తి చేసి యున్నాడు.

మరి యతఁడు తాను రచించిన హరివంశమునందు సహితమీ విధానమే గోచరించు చున్నది.

ఉ॥ నన్నయభట్టు తిక్కకవినాథులు చేసినత్రోవ పావనం।
బెన్న పరాశరాత్మజ మునీంద్రుని వాఙ్మయ మాదిదేవుడా।
వెన్నుని వృత్తమీవు గడువేడుకతో విను నాయకుండవై!
ట్లన్నియు సంఘటించె మదభీప్సిత సిద్ధికి రాజపుంగవా॥

ఎఱ్ఱాప్రెగ్గడ-హరివంశము.

ఈ కవిత్రయము వారిమార్గమునే యవలంబించి శేషించిన యాంధ్రకవి శేఖరులందరు తమకావ్యములను చంపువులుగనే రచించిరిగాని వారురచించిన కావ్యములలో వచనరచనల పరిమాణము మొత్తముమీద క్రమక్రమముగ తగ్గుచు వచ్చినది. ఈ క్రిందిపట్టిక చూడుము:

---

[*] భాస్కరోదంతము. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు రచించినది. 24-25 పుటలు

| కాలము. | కవి. | కావ్యము. | %వచనము. |
|---|---|---|---|
| 11వ శతాబ్దము. | నన్నయభట్టు. | ఆంధ్రమహాభారతము. ఆది, సభా, అరణ్య పర్వములు. | 46 |
| 13వ ,, | తిక్కనసోమయాజి. | విరాటపర్వము మొదలు స్వర్గారోహణపర్వాంతమువరకు. | 33 |
| 14వ ,, | ఎఱ్ఱాప్రెగ్గడ. | అరణ్యపర్వశేషము. | 40 |
| ,, ,, | నాచనసోముడు. | ఉత్తరహరివంశము. | 23 |
| 14-15 ,, | శ్రీనాథుడు. | శృంగారనైషధము. | 26 |
| ,, ,, | బమ్మెరపోతరాజు. | ఆంధ్రమహాభాగవతము. | 35 |
| 15-16 ,, | అల్లసానిపెద్దన్న | మనుచరిత్రము. | 18 |
| | కృష్ణదేవరాయలు. | ఆముక్తమాల్యద. | 21 |
| 16 ,, | ముక్కుతిమ్మన్న. | పారిజాతాపహరణము. | 10 |
| ,, ,, | పింగళి సూరన్న. | కళాపూర్ణోదయము. | 21 |
| ,, ,, | రామరాజభూషణుడు. | వసుచరిత్రము. | 8 |
| 17 ,, | చేమకూరవేంకటకవి. | విజయవిలాసము. | 4 |

మొత్తం త్రిగ్రంథములో సగటువచనం త్రిసంఖ్య.

ఇట్లుప్రసిద్ధాంధ్ర కావ్యములలో వచనరచన క్రమముగా తగ్గిపోవుచు వచ్చినది. పదునేడవశతాబ్దమునందు చేమకూర వేంకటకవి వ్రాసిన విజయవిలాసము నందు నూటికి నాలుగుపంక్తులైన వచనగ్రంథము లేదయ్యెను. కొందరుకవులు సంస్కృతము పైదండెత్తి శుద్ధాంధ్ర గ్రంథములు రచింపదొడగిరి. కొందరు ఓష్ఠ్యములపై దండెత్తి నిరోష్ఠ్యగ్రంథములు వ్రాసిరి. ఇంచుమించుగ నందరును కావ్యములయందు వచనోపయోగమును నిరసింప దొడగిరి. కొంతమంది కవులుస్వల్పముగ వచనముల రచించుచు చంపుకావ్యముల వ్రాయజొచ్చినను కొండవీటి చేద్రతాడుల వలెకడుదీర్ఘములై పాఠకులకల్లడము నొదవించు కర్కశ సమాసజాలమును జొప్పించి వచనరచనకు గడంగిరి. ఇట్లుచంపు కావ్యములందు స్వచ్ఛమై సులభమై మధురార్థ శ్రీకమైన మనోజ్ఞ వచనరచన యంతరించి పోయెనా యేమియని సంశయింప వలసినకాల మాసన్న మయ్యెను.

అంతలోనద్భుతముగ భాగ్యవిధానము చేతనాయకరాజులుదక్షిణమున తంజాపురిలో నాంధ్ర రాజ్యస్థాపనము గావించి, శోషించి పోవుచున్న గద్యవాఙ్మయమును పునరుజ్జీవనము గావింప బద్ధకంకణులైరి. అవ్వపసత్తముల కటాక్షముచే గద్యవాఙ్మయము వేయివిధముల విజృంభింప గలిగెను. చాళుక్య నృపాలుర కాలమందును కాకతీయేంద్రుల కాలమందును రెడ్డిరాజుల కాలమందును కృష్ణదేవరాయల కాలమందును

తానెన్నడు సమర్థించని మహాద్వైతమును, నాయకరాజుల పట్టంకేశి ఆంధ్రగద్య వాఙ్మయ మనుభవింప గల్గెను. కలువవీరరాజ కవి వచనభారతమును వ్రాసెను. పాకల అనంతభూపాలుడు భారతశేషము, విష్ణుపురాణము భగవద్గీత మొదలగు పలు వచనగ్రంథముల రమణీయముగ రచించెను. సముఖము వెంకటకృష్ణప్ప నాయకుడు జైమిని భారతము సారంగధర చరిత్రము మొదలగు పెక్కు గ్రంథములు రచించెను. శ్యామరాయకవి రామాయణము వ్రాసెను. విజయరంగ చొక్కభూపాలుడు శ్రీరంగ మహాత్మ్యము మొదలగు గ్రంథరాజము లనేకములు చేసెను. వేనవేలటవంటి సరిమధురములై మనోజ్ఞములైన వచనకావ్యములు కొన్ని యకర్తృకములో తెలియక యే గ్రంథభాండాగారములలో నున్నవి. ఈ గ్రంథ జాలములో నొకటి రెండు మాత్రము ముద్రితములైనవి. శేషించిన వన్నియు తంజావూరు సరస్వతీ పుస్తకభాండాగారమందును ఆంధ్రసాహిత్య పరిషద్భాండాగారమందును భద్రపరుప బడియున్నవి. కొన్ని దొరతనమువారి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్నవి. ఈ గ్రంథములను ముద్రింపించి ప్రకటించుట కింతవరకెవ్వరును తగు ప్రయత్నము గావింపకుండుట మిగుల శోచనీయము. పదునేడు పదునెనిమిదవ శతాబ్దములయందు వెలసిన యీ కేవల గద్య వాఙ్మయ విమర్శనమునకు మనచరిత్ర యందొక ప్రత్యేక సంపుటము కావలసి యుండును. తత్పూర్వపు గద్యవాఙ్మయ విమర్శ సందర్భమున తత్పూర్వపు చంపూ కావ్యములలో గానవచ్చెడి వచనరచన లనే పరిశీలించి చర్చించుట మనకవశ్య కర్తవ్యము.

ఈ విమర్శనము నందు మనము చర్చింప వలసిన విషయములు ముఖ్యముగా మూడుగలవు.

(1) కావ్యమునందు వచనగ్రంథ పరిమితి యెంతయని నిరూపించుట. ఇందుకు నేనవలంబించిన పద్ధతి నిట వివరించు చున్నాను. ఆనంద ముద్రాయంత్రాలయము వారో వావిళ్ల వారో ప్రచురించిన గ్రంథమును దీసి అందు విమర్శనములోనున్న కవి రచించిన భాగములలో మొత్తపు పంక్తులెన్ని యుండునని లెక్కించి చూచి యా సంఖ్య నొకచోట వేసి తరువాత నందు వచనపంక్తు లెన్నియో లెక్కించి చూచి యది కూడ వ్రాసియుంచి ఆవల శతాంశగణితరీతిని

ఇన్ని పంక్తుల మొత్తము గ్రంథములో నిన్ని పంక్తుల వచన రచనగలదు.

100 పంక్తుల గ్రంథములో.............. ఎన్ని?

అనిగుణించి కతాంతలెక్కను నిరూపించుట. ఇందులో గమనింప వలసిన విశేషమొకటి కలదు. పంక్తుల సంఖ్యపుటపరిమాణమును బట్టిమారుచుండును. మఱి కొన్ని వచనములలో కురుచలు, అంత, మరియును, తదనంతరంబ, పెండియు, మొదలగు సముచ్చయార్థక పదములు మూడునాలుగక్షరములు కంటె నెక్కువ బట్టనివి పెక్కుతావు లగానవచ్చుచుండును. పంక్తికి సగబాలునకు తక్కువగనున్నకురుచ వచనముల లెక్కింపక అంతకెక్కువ యుండిపూర్తిగనొక పంక్తికి చాలని వచనముల నొకపంక్తి క్రిందనే లెక్కించితిని. ఏదోయొక గ్రంథమును మూలముగా తీసికొని దానియాధారముపై లెక్కలు తేల్చుకొనక తీరనందునను, వావిళ్లవారును ఆనంద ముద్రణాలయము వారును ప్రచురించిన గ్రంథము లాంధ్ర మండలమం దంతటను సర్వసాధారణముగా వ్యాపించి యుండుట చేతను ముఖ్యముగా వారిప్రచురణములనే యాధారముగాచేసికొని లెక్కించితిని. మనవిమర్శనమునకు గ్రంథమునందుగల వచనరచనల పరిమాణము ఇంచుమించుగా తెలిసిన జాలును. అయినను సాధ్యమగు నంతశ్రద్ధతో పనిచేసి స్వయముగ లెక్కించియు మిత్రులచేతను ఛాత్రులచేతను లెక్కింపించి పరిమాణము నిందుగల సంఖ్యలను తేల్చగలిగితినని పాఠకమహాశయులకు విన్నవించు కొనుచున్నాను.

(2) కావ్యమునందే యేసందర్భములందు కవివచనముల రచింపను పక్రమించుచుండెనో నిరూపించుట మనముచర్చింప వలసినరెండవ యంశము. గ్రంథకర్తలుతమయిచ్చము వచ్చినట్టు వచనరచనలు చేయులేదు. జాగ్రతగా పరిశీలించిన పక్షమున కావ్యమునగలవచన రచన యుపయోగమునందు పద్ధతియు నియామకములును గా నగుచున్నవి. మనమాపద్ధతులంగను గొనిసోదాహరణముగా నిరూపింపవలసి యున్నది.

(3) ఈరెండిటి కంటె ముఖ్యమైనదియు ప్రయాసకరమైనదియు నైనమన మూడవ కర్తవ్యము కావ్యమునందు గలవచనరచనల శైలియెట్టిదని చర్చించుట.

శైలియనగా నేమి?

క॥ మృదుతరమై యొండొంటికి । బదమైత్రి కలిగి నొదవు పలుగులలోనన్ ।
బొదలెడు నర్థంబెచ్చట వదలించి కయించు శయ్యయనగా వదివో ॥

యనిచిన్నకోట పెద్దనార్యుడు కావ్యాలంకారచూడామణి(4—53)లో నిర్వచించి యున్నాడు.

కా॥ "కదళీపదంబులు మంజరి! పదములతో భరమమూర్తి బరగిన పదబా
స్ఫుటమనకుండిన గృహలం! దతిశయ్యా" యనిభట్టుమూర్తి

చెప్పుచున్నాడు. (చూడుడు - కావ్యాలంకార సంగ్రహము -2-88)
ఆధునికులు style స్టయిలు అనునాంగ్లేయపదమునకుపర్యాయ పదముగా నాంధ్రమున శైలిపదమునుపయోగించు చున్నారు.

స్టయిలనునది భాషను సాధనముగా చేసికొని కవి తనభావములను వ్యక్తీకరించుటకవలంబించిన మార్గమనియు, పాఠక జనబోధార్థమై కవిభావము ధరించిన భాషారూపమనియూ నాంగ్లవిద్వాంసులు నిర్వచించుచున్నారు. కావున భాషాదర్పణము నందు యథార్థముగ స్వచ్ఛముగ ప్రతిబింబితమైన కవిభావమే శైలి; అనగా భాషలో పదరూపమున నవతరించిన కవిభావము శైలియని నిర్వచింతము. ఏదేనియొకయంశమును గూర్చి మనోగతాభిప్రాయములను వ్యక్తీకరించుటకై గ్రంథకర్తయుపయోగించెడి పదసముదాయము శైలియని చెప్పిన నిర్వచనము చక్కగా నున్నది. శైలిభావప్రకాశకము. శైలి, భావము, ఇవి రెండును లేనిద్వంద్వములు (2) కావ్యము యొక్క శైలిని గూర్చివిమర్శించునపుడు మనము అందుగల పదములను వానిస్వభావమును వానిక్రమమును వాక్యస్వభావమును వాక్యరచన యొక్క గ్రహణ ధారణానుకూల్యత కవశ్యములైన స్వచ్ఛతయు సరళత్వ చిత్రౌపమ్యాదులయిన విశేషములను అర్థకావ్య వ్యక్తులను శబ్దాలంకార అర్థాలంకారములను, రసవిశేషములను, కావ్యరీతులను, గుణములను, చమత్కార చిత్తాకర్షణ విశేషములను, ప్రావ్యత శబ్దార్థముల పొందిక లోనగురచనా విశేషము లన్నిటిని చర్చింప వలసియుండును.

మరియు చంపువులలో సాధారణముగా నొక్కభావమే యొక్కయంశమే కొంతపద్యమునను మరికొంత ఆపద్యము వెనుకనే వచ్చు వచనమునందును, కొన్ని కొంతవచనమునందును మరికొంత వెనుకవచ్చు పద్యమునందును విచారింపబడు చుండును. అట్టి భావములను, అంశములను, చర్చించునపుడు కేవలగద్య రచనమును మాత్రమే కాక దానింజేరియుండెడి పద్యభాగములను గూడ సందర్భశుద్ధికొరకు తీసుకొనుచుండ వలయును. ఇట్లుమన విమర్శన మార్గముల నిర్ణయించుకొని, ఆంధ్రకవికులతిలకుండగునన్నె చోడుని ప్రశంసిప బోవుదము

---

ఆంధ్రభారతి 2వసంపుటము. 230 వ పుటలో మ॥ అచంట సూర్యనారాయణరాజు గారు 'గద్యరచన' శైలి అనువిషయమునుగూర్చి వ్రాసినవ్యాసము (2) మ॥ కట్టమంచి రామలింగారెడ్డిగారి కవిత్వతత్త్వ విచారము 60 పుట.

## ఐదవ ప్రకరణము.

### మహాభారతరచన. నన్నయభట్టారకుడు

ఉ॥ "వ్యాసముని ప్రణీతపరమార్థము తెల్లముచేసినట్టి యబ్జాసనకల్పు"
నృసింహపురాణము.

సీ॥ కమనీయధర్మార్థ కామమోక్షములకు నత్యంత సాధనంబయినదాని
భక్తితో దవిలితన్ వినుచున్న వారలకభిమత శుభకరంబయినదాని
రాజులకఖిల భూరాజ్యాభివృద్ధి నిత్యాభ్యుదయ ప్రదంబయినదాని
వాఙ్మనః కాయప్రవర్తి తానేకజన్మాఘని బర్హణంబయినదాని
సత్యవాక్ప్రబంధశత సహస్రి శ్లోకసంఖ్యమయిన దానిసర్వలోక
పూజ్యమయిన దాని ఋషినుతవ్యాస మహాముని ప్రణీత మయినదాని
ఆది (3-9)

చ॥ వినుతపరాక్రముల్ ధృతవివేకులు సత్యసమన్వితుల్ యశో
ధనులు కృతజ్ఞులుత్తములు ధర్మపరుల్ శరణాగతానుకం
పనులనగా ప్రసిద్ధులగు భారతవీరుల సద్గుణాను క
ర్తనములనొప్పు దాని వితతంబగు దాని సభాంతరంబులన్- ఆది (3--10)

శా॥ ఆయుష్యం బితిహాసవస్తు సముదాయం బైహికాముష్మిక
శ్రేయః ప్రాప్తినిమిత్త ముత్తమ సభాసేవ్యంబులోకాగమ
న్యాయైకాంత గృహంబునా బరగి నానావేదవేదాంతవి
ద్యాయుక్తంబగు దాని జెప్పదొడగెం దద్భారతాఖ్యానముల్
ఆది (3--11)

సంస్కృత మహాభారత మష్టాదశ పర్వంబులు గలిగి ఆది (1--64)

మ॥ అమితాఖ్యానకశాఖలంబొలిచి వేదార్థామలచ్ఛాయమై
సుమహావర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణ కీర్తనార్థ ఫలమై ద్వైపాయ నోద్యానజా,
తమహా భారతపారిజాత మమరున్ ధాత్రీసుర ప్రార్థ్యమై
ఆది (2--85)

ఇట్టి మహాభారతంబు ననేకవిధ పదార్థ ప్రపంచ సంచితంబును చతుర్వర్గ మహాశాస్త్రోప శోభితంబు నుపద్వీప మహాద్వీపసంభృతంబైన భువనంబు జాడ నిర్మించినట్లు కృష్ణద్వైపాయనుండు నిఖిలలోక హితార్థంబుగ దత్తావధానుండై సంవత్సర త్రయంబు నిర్మించె. దాని దేవలోకంబు నందు వక్కాణింప నారదుం బనిచె. పితృలోకంబున వక్కాణింప నసితుండైన దేవలుం బనిచె. గరుడగంధర్వ యక్షరాక్షస లోకంబు లందు వక్కాణింప శుకుం బనిచె. నాగలోకంబు నందు వక్కాణింప సుమంతుం బనిచె. మనుష్య లోకంబున జనమేజయునకు వక్కాణింప వైశంపాయనుం బనిచె. (ఆది 1—88)

పదునొకండవ శతాబ్దమున దీని నాంధ్ర లోకంబున నాంధ్రమున వక్కాణింప నన్నయ భట్టారకుం బనిచె. ఆంధ్రప్రపంచము యొక్క సుకృతపరిపాకముచేత పదునొకండవ శతాబ్దారంభమున చాళుక్యాన్వయాభరణుండగు రాజరాజ నరేంద్రచంద్రుడా మండలమును పరిపాలింప దొడగెను. ఆనృప చూడామణి

«అఖిల జలధివేలా వలయిత వసుమతీ వనితా విభూషణంబైన వేగీదేశంబునకు నాయక రత్నంబునుం బోని రాజమహేంద్రపురంబు నందు మహేంద్రమహిమతో బరమానందంబున ననవరత మహామహీరాజ్య సుఖంబులనుభవించుచు సకలభువనలక్ష్మీ విలాస నివాసంబయిన రమ్యహర్మ్యతలంబున మంత్రిపురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానానంత సామంతవిలాసినీ పరివృతుండయి యపారశబ్దశాస్త్ర పారగులైన వైయాకరణులును, భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులును, మృదు మధుర రసభావ భాసుర నవార్థ వచన రచనా విశారదులయి నమహాకవులును, వివిధ తర్క విగాహిత సమస్త శాస్త్రసాగర గరీయః ప్రతిభులైన తార్కికులును నాదిగా గలుగు విద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ విద్యావిలాస గోష్ఠీసుఖోప విష్టుండయి యిష్టకథా వినోదంబులనుండి—................(ఆది 1-8)

సీ॥ తనకుల బ్రాహ్మణు ననురక్తు నవిరళ జపహోమ తత్పరు నిపుణశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతు
బాత్రు నాపస్తంభ సూత్రు ముద్గల గోత్రజాతు సద్వినుతావదాత చరితు
లోకజ్ఞు నుభయ భాషాకావ్య రచనాభి శోభితు సత్ప్రతి భాభియోగ్యు
నిత్య సత్యవచను మత్యమరాధిపాచార్యు సుజను నన్నపార్యు జూచి.

మహాభారత మాంధ్రమున రచింపు మని యానతిచ్చెను. రాజనరేంద్రుడు

వివిధములగు పురాణములనేకములు విని యున్నను, అర్థధర్మ శాస్త్రములు తెరంగె ఱింగి యున్నను, ఉదాత్తర సాహిత్య కావ్యనాటకములు పెక్కు చూచి యున్నను, జగత్పతి పూజ్యము లైనయీశ్వరాగమముల యందు భక్తితో హృదయము నుచ్ఛకాశముగా నిలిపి యున్నను అతనికనవరతంబును శ్రీ మహాభారతము నందలి యభిప్రాయంబు వినవభిలాష పెద్దయై యుండెడిది. ఇట్లుండుట కతడు ముఖ్యముగా మూడు కారణములను చెప్పుచున్నాడు.

(1) పంచమవేదమై పవిత్రాతి పవిత్రమై భాసిల్లు భారత సంహిత యందాతని కగాధభక్తి విశేషమొకటి పార్వతీ పతి పదాబ్జధ్యాన పూజామహోత్సవము నందును భూదేవకులాభితర్పణము నందును సంతతదాన శీలత యందును, శస్త్రశాస్త్రసాంగత్యము నందును నాతని కెంతప్రీతి గలదో భారత శ్రవణమునందు గూడ నాతని కంత యాసక్తి గలదు.

(2) మానసికముగు వంశాభిమానము. రాజరాజు చంద్ర వంశజుడు కావున చంద్రుడు, పూరుడు, భరతుడు, కురుభూపతి, పాండురాజులను మహాపురుషలు వంశకర్తలుగా ప్రసిద్ధంగనిన చంద్రవంశము నందు జన్మించి విమలసద్గుణ శోభితులని జగత్ప్రఖ్యాతి గాంచిన పాండవోత్తముల చరిత్ర సతతము వినుట యందాతని కెంత యభీష్టముండుట యుచితమేగదా.

(3) భారత శ్రవణమతి పుణ్యకార్యమను విశ్వాసము. శాస్త్రోక్తముగ నువర్ణశృంగ ఖురాదులమర్చి కపిలగోశతము నగ్రిమ బహువేదవిప్రులకు దానము చేయుట వలన కలిగెడు మహాపుణ్యము భారత కథాశ్రవణముచేత లభ్యముగా సమకూరును. విశేషించి బహుజనముల వలన బహుభాషలలో బహువిధములుగా భారత కథవినుచ దాని యందు బద్ధస్పృహులగు వారికి బహు యాగములు చేసిన పుణ్యఫలము లభించును. గావున

క॥ జనమతి కృష్ణద్వైపా । యన మునివృషభాభిహితమహాభారతబం
ధనిరూపితార్థమేర్పడ । దెనుగున రచియింపు మధికధీయుక్తిమెయిన్.
(ఆది 1-18)

అనిరాజ చంద్రుడు నన్నపార్యుని కానతిచ్చుటయు భారత సముద్రము దరి
నీదుట యేధాత్రుని కైనను శక్యముకాదని విన్నవించుచు నాకవివరుండు "దేవా నీయ

## ఉపక్రమణ శీలములు.

ఉపక్రమణ శీలములనగా రాబోవువిషయమును దానిసందర్భమును సూచించు స్వభావముగలవి. ఉదాహరణార్థము. చూడుము ఆది. 2. 38.

గరుడుండును దల్లిదీవనలు గైకొని గమనోన్ముఖుండై యమృతంబు దెచ్చునప్పుడు లావుగలుగవలయు నాహారంబుపదేశింపుమనిన వినతయిట్లనియె.

ఈవచనము గరుడునకును ఆతనితల్లియైన వినతకును జైనసంభాషణ సందర్భమును సూచించు, తరువాతపద్యమున నేమి రావలయునో తెలుపుచున్నది. బలముగలుగుటకై గరుడుడే యాహారమును సంపాదింపవలయునో వినత చెప్పుట యేయుత్తరకథాంశము. ముందురాబోవువిషయమేమో, దానినెవ్వరెవరితో వక్కాణింతురో వివరించుట యీవచనముల ధర్మము. ఇందునకు ప్రత్యేకముగానొక పద్యమురచించుటకు కవి పూనుకొనినచో సాధారణముగా వ్యర్థపదములంజేర్చి పాదపూరణము కావింపవలసియుండును అట్టివ్యర్థపదభూయిష్ఠములైన పద్యములు కావ్యప్రాశస్త్యమును క్షీణింపజేయుచుండును. ఇట్టివచనములకు కావ్యమున నెపమియ్యకున్నచో సందర్భశుద్ధిలేక కావ్య మగమ్యగోచరమై పోవును. కావున నె రసహీనములైనను పరమ ప్రయోజనకారులగుటచే కావ్యమున వీనికి ప్రాయికముగా స్థానమొసంగబడుచుండును.

ఈయుపక్రమణ శీలమును (1) ఆశ్వాసాది (2)ఇతరములు ననిమరల రెండు వర్గముల క్రింద విభజించితిమి ప్రతికవియు తారచించిన కావ్యములో కృతికర్తయగు భగవంతునో, రాజచంద్రునో, మరియొకరినో ప్రశంసించు పద్యమునో శ్లోకమునో యాశ్వాసారంభమున రచించి తరువాత వచనమునే రచించుట మనము సర్వసాధారణముగా చూచుచున్నాము. నన్నయ భట్టారకుడు తానురచించిన భారతమంతటిలో ప్రతియాశ్వాసము నందును రెండవ రచనమును వచనముగనే వ్రాసియున్నాడు. ఆదిపర్వము నందలి ప్రథమాశ్వాసము నందు.

శ్లో॥ శ్రీవాణీగిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే।
లోకానాం స్థితిమావహంతి విహితాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవశ్రీకంధరా శ్రేయసే॥

అనుమఃగళ శ్లోకముతరువాత

“అనిశం భువనరక్షణ ప్రభువులై యాద్యులయిన హరిహర హిరణ్యగర్భు లో శ్రీమావాణీపతుల స్తుతియించి తత్ప్రసాద సామాదిత నిత్యప్రవర్ధమాన మహామహీరాజ్య విభవుండును నిజభుజ విక్రమ విజితారాతిరాజ నివహుండును నఖిల జగజ్జేగీయమాననానా గుణరత్నరత్నాకరుండును నైనరాజరాజనరేంద్రుడు” అనుచు త్రిమూర్తులను, ముపురమ్మలను, భూలోక ప్రత్యక్ష దైవమగు రాజతిలకుని స్తుతియించి దైవభక్తిని సూచించు శ్లోకము వెనుక, రాజభక్తిని సూచించు భాగము వచనమున రచించి వాఙ్మయమున వచన రచనలకియ్య వలసినద్వితీయ స్థానమును సూచించు చున్నాడు' ఆదిపర్వ ప్రథమాశ్వాసమున నీవచనమును, అవల ప్రతి యాశ్వాసమునంతును ద్వితీయ రచనమును మార్పులేక అక్కథ నుండుశౌనకాది మహామునులకుంజెప్పినను వచనముతో నారంభించు నట్లును నన్నపార్యుడు రచించి యున్నాడు. సందర్భమును బట్టియాతరువాత వాక్యజాలము నిడివిగల వచనముగావచ్చు అదియుగానిచో పద్యముగావచ్చు. గానిఆశ్వాసమున రెండవ రచనము మాత్రము వచనమేయగుటయు అదియును, ఆదిపర్వ ప్రథమాశ్వాసమున తప్ప తక్కిన చోట్లను మార్పులేక యొకేవిధమున నుండుటయు మాత్రము గమనించి యీ విషయమైన చర్చముగింతము.

ఉపక్రమణ వచనముల తరువాత మనము సముచ్చయార్థక వచనములను గూర్చి ప్రసంగింప వలసియున్నది, రెండు పద్యములకు నడుమనిలచి వానికిపరస్పర సంబంధము కలుపుటయే వీనిధర్మము. అట్టిటంకపు పాదులు లేక పద్యములకు పొందిక కుదరదు. ఇవిగూడ వానిప్రయోజనమును బట్టి కావ్యములో జొచ్చినగాని గమనీయార్థప్రతిపాదకదక్షత్వము చేతగాదని స్పష్టమే గదా? మరియు, రెండయు అంత తిరనంతరంబ మొదలగు కురుచ వచనములును సుమారొక పంక్తినిడివిగల వచనములును నన్నపార్యుని రచనలందచ్చటచ్చట గానవచ్చుచున్నవి. కానియిట్టి సముచ్చయార్థక వచనముల సంఖ్యనన్నెచోడుడు నాచనసోముడు మొదలగు కొందరు కవులుపయోగించిన దానికంటె చాలతక్కువగానున్నదని మాత్రమిచ్చ చెప్పవలసి యున్నది. ఉదాహరణార్థముగా నొక్కటి మాత్రము చూతము ఆది—2 41;— “ధరుడుంతు గద్రువ వంచిన వసులెల్ల వినత యనుమతంబున నతివినయపరుడై చేయుచు.

ద్యమునకు పద్యమునకును మధ్య రచనమును రచించియు వందనీయుడగుచున్నాడు. ఉదాహరణార్థము ఆది పర్వారంభమున గల పర్వానుక్రమణికయు, ఆపర్వమందే తృతీయాశ్వాసమునందు 59 61 63 65 67 69 71 సంఖ్యలుగల రచనలందు వివరింపబడిన దేవ దానవుల యుత్పత్తి క్రమమును, 80 వ రచనయందు దేవదానవాద్యంశముల భూమియందు బుట్టినవారి క్రమమును చూడనగును. మరియు నా పర్వము చతుర్థాశ్వాసమున 111 114 116 రచనలలో కౌరవ వంశవివరణమున్నది. సభాపర్వమునందు రాజసూయమహాధ్వర సందర్భమున కావింపబడిన దిగ్విజయమునందు పాండవ సోదరులచే జయింపబడిన నానాదేశాధీశుల యొక్కయు, దేశముల యొక్కయు పట్టికలు గలవు. అరణ్య పర్వమునందు పాండవు లరణ్యవాస దీక్షలో సేవించిన తీర్థముల పట్టికలును, ఆయా తీర్థముల సేవించుట వలన కలుగు పుణ్య ఫలములును పెక్కుచోట్ల వచనములుగానే రచింపబడినవి. ఈ విధముగా నన్నయ పద్యములందే వర్ణించిన పక్షమున నా రచనలు పాండురంగమాహాత్మ్యము ద్వితీయాశ్వాసము వలె మిగుల వినుగు పుట్టించియుండును.

ఇంతటితో నీపట్టికల చర్చ చాలించి యాశ్వాసాంత గద్యలను గూర్చి ప్రసంగింతము. సంస్కృత గ్రంథములలో సర్గాంతమందు సర్వసాధారణముగా గద్య యుండుచున్నది. సంస్కృత గ్రంథముల యందే గాక తామ్ర, శిలా, శాసనములలో సహితము, రచించిన వారి పేరును లిఖించిన వారి పేరును చివరను చేర్చబడియుండుట వానితో పరిచయము గలవారి కెల్ల విదితమయి యున్నది. సంస్కృత మర్యాద ననుసరించి యాంధ్రము నందును, కావ్యభాగములైన యాశ్వాసాంతములందు గద్య యుండుటయు గద్యయందు కావ్య నామ కవినామములును, ఆశ్వాస సంఖ్యయు పేర్కొన బడుటయు సర్వ సాధారణముగా గానగును కొన్ని కావ్యములలో గద్యలందు ఆశ్వాసమునగల యంశముల సంగ్రహ ప్రశంస గూడ చేర్పబడుటయు గలదు నన్నపార్యుని గద్యలు కవి నామమును, పర్వమును పేర్కొని యాశ్వాస విషయముల సంగ్రహముగ సూచించి, యాశ్వాస సంఖ్యా నిర్వచనముతో ముగియుచుండును. కవి రచించిన గ్రంథములోని యాశ్వాసాంత గద్యలన్నియు నొక్క విధముననే రచింపబడుచుండును కావున నన్నపార్యుని గద్యము నొక దానిని చూతము

ఇది సకల సుకవిజన వినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీ మహాభారతంబున

యుంటుగుండు చుండెను... అవియాప్రకారమెక్కడ కక్కడ క్రియలను సమా సక్రియలుగా చేసి వాక్యములు క్రుంది వాక్యజీవనము కొరకథా కారము తైనక ర్తకర్మక్రియలను రచించుకొనుచు పోవుచుండిన పక్షమున గ్రంథమింపుగానుండ కాపెరిగి వినుకష్టుచుండును.

మరియు మృదులములగు నల్పసంస్కృత పదములను విశేషముగా చేరికూర్చుట వలన రచనకు పుష్టియు జవమును చేకూరి శైలి గంభీరమై యొప్పారును. మృదుత్వమును గాంభీర్యమును పోషించుట యందే నన్నపార్యునికి యత్యాదరము కలుగుచేతను, పారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కవితార్థ యుక్తిలో నానిపేములను నట్లురచించుట యాతని పరమావధియని యతడు వక్కాణించి యట్లేరచించుట చేతను, ఆతనికృతి యందు రెండు పాళ్లు సంస్కృత పదములును, ఒకపాలు తెలుగు పదములును చేర్చిరచించెను. మరియు సంస్కృత భాషాపక్షపాతులగు సత్కవీంద్రుల మెచ్చునభిలషించియే సంస్కృత భాషామర్యాదలనే విశేషముగాపాటించి యున్నాడు. అవకాశ మున్నచోటుల కూడ తెలుగు సాంప్రదాయముల నంతగా జొప్పింపలేదు. ఈవిషయమున తిక్కన సోమయాజులకును నన్నయ భట్టారకునకును విషభేదము గలదు. పైనిర్వాయబడిన రచనయందు, భోజనము చేసి పొమ్మని వ్రాయక కృతభోజ నుండవై పొమ్మని వ్రాసి యున్నాడు. ఇట్లేఅన్నములో తలవెంద్రుక వచ్చెననిగాని నీకుకొడుకులు గలుగరని కాని వ్రాయక, అన్నంబు కేశదుష్టమయ్యెననియు, అనపత్యుండ వగుమని శాపమిచ్చె ననియు వ్రాసియున్నాడు. కథావివరణ భాగముల రచనావిధానము బరిశీలింప మరిరెండుదాహరణముల నిట బొందు పరచుచున్నాను.

ఆది.3-134. ఇటవృషపర్వునకూతురు శర్మిష్ఠయను కన్యక యొక్కనాడు కన్యకా సహస్రపరివృతయై దేవయానీ సహితంబు వనంబునకుంజని యొక్కసరసీ వరతీరంబున దమతమ పరిధానంబులు పెట్టి జలక్రీడ లాడుచున్న నవి మరుగరు వలిచేతం బ్రేరితంబులయి కలసిన నొండొరులం గడవ గొలను వెలువడు సంభ్రమంబున నక్కన్య కలన్యోన్యపరి ధానంబులు వివ్వడంగొని కట్టుకొనెడ దేవయాని పుట్టంబు శర్మిష్ఠగట్టుకొనిన మత్తకాశి పరిధానంబు దేవయాని పుచ్చుకొనక కోపి శర్మిష్ఠం జూచి.

నయిది యొప్పుచున్నయది ...... అనియిట్లిద్దఱనొండొరులకు దాసీత్వంబు పణంబుగా నోడిరి పన్నిదంబుసరచిన వినతయయ్యేత్వంబు దాసిచూతమునమ్మనిన కద్రువ యిప్పుడుప్రొద్దుతేదు రేపకడచూతము....

సభా 1. 182 (జరాసంధుడు కృష్ణాదులకెదురువచ్చుచు, «మత్క్రియయనాకావింన మధుపర్కంబు ప్రతిగ్రహింపనొల్లమి యిదియేమి? మీరలువేషధారులు కావలయు. మీ వేషంబున బ్రాహ్మణత్వంబును మహాసత్వదీర్ఘ బాహువృథుల వక్షోలక్షణంబుల క్షత్రియత్వంబును ప్రకాశించుచున్నవారనిన వానికి నారాయణుండిట్లనియె. .... ద్వారంబున మిత్రనివాసంబును, నద్వారంబున నమిత్రనివాసంబును జొచ్చుటయిది బాహువీర్యసంపన్నులయిన క్షత్రియులకుం గర్తవ్యంబు మరిగంధమాల్యంబులయందు లక్ష్మియుండుంగావున బలాత్కారంబున గంధమాల్యంబులగొంటిమి. నీయందు బహుమానంబు కారంబుగలుగుట జేసినీయిచ్చు నర్ఘ్యంబుగొననొల్లము.

## వాదప్రతివాదములు.

శిబిచరిత్రము (ఆరణ్య. 3—229, 233).

డేగయిట్లనుచున్నది. సర్వభూతంబులు నాహారంబున జీవించి వర్ధిల్లునిదినాకు భక్ష్యంబుగానినాడు బుభుక్షావేదనంజేసి ప్రాణవియోగంబగు నట్లయిన నాపుత్రులుం భార్యయు జీవింపనేరరొక్క కపోతంబురక్షించి పెక్కుజీవంబులకు హింససేయుట ధర్మవిరోధంబు... ఇక్కపోతంబు నాకువేదవిహితంబైన యాహారంబు. శ్యేనాఃకపోతాన్ ఖాదయన్తి, యనువేద వచనముగలదు. గావునదీని నాహారంబుగానిమ్మనిన దానికిశిబియిట్లనియె... నీవుపక్షివయ్యును ధర్మమెరింగినట్లుపలికితివి శరణాగత పరిత్యాగంబు సేయుటకంటె మిక్కిలి యధర్మంబొండెద్ది? నీయాకలిదీవనకాని యొంటనుపశమింపదే? నీయత్నంబాహారార్థం బేనియిప్పుడివ్వనంబున మృగమహిష వరాహఖగమాంసంబులు దీనికంటెమిక్కిలిగా బెట్టెద నిక్కపోతంబువలని యాగ్రహంబుడుగుము. దీనినేనెట్లును విడువననిన....

ఇందునన్నయ ముందుశ్యేనపక్షమునను, తరువాత కపోతపక్షమునను, న్యాయవాదియయి న్యాయపీఠముసెదుట యుక్తియుక్తముగను సప్రమాణముగను సలిపినవాదప్రతివాదముల ప్రాశస్త్యము స్వయంవ్యక్తము. విశేషించి సంస్కృతమూల

మానగల యీసంవాదమును పఠించినయనంతర మీరచనలఁజదివినవిచక్షణున, ముఖ్యాంశములవిడువక యెంతచేర్పుతో సంగ్రహపరచి నన్నయస్పటీకరించ జేసి యెంతరమణీయముగ నాంధ్రమహాభారతము రచించినదిస్పష్టమగును.

## ఉపన్యాసములు.

విశేషాంశములంగూర్చి చతురమతులు సరసవచోధోరణిచే జేయుభావప్రకటన ముపన్యాసము. నిజమనోభావములు శ్రోతలకునువ్యక్తమగురీతిని బ్రసంగించుచు వారలందమధోరణికి లాగుకొని వశవర్తులుగచేసికొనుట మహాప్రతిభగల వక్తలకుమాత్రము సాధ్యము. నన్నపార్యుని కీయద్భుతవక్తృత్వసామర్థ్యము విశేషముగాగలదు.

### దుర్యోధనుని మనోదుఃఖము. (ఆది 6 121, 28, 30)

(నీవుపాండవజ్యేష్ఠునకు యౌవరాజ్యమిచ్చితివి) దానఁజేసి పౌరజానపద బ్రాహ్మణప్రధానవరులు ధర్మజునకనురక్తులయి నిన్నును భీష్మునినాదరింపక, ప్రజ్ఞాచక్షుండు రాజ్యంబు సేయసమర్థుండుగాఁడు. భీష్ముండు సమర్థుండయ్యును మున్నె రాజ్యనివర్తనంబునందు కృతప్రతిజ్ఞుండయ్యెం గావున పాండవజ్యేష్ఠుండైన యుధిష్ఠిరునకు రాజ్యాభిషేకంబు సేయుద మతండు తరుణుండయ్యును గుణవృద్ధుండు ధర్మశీలుండు, పరాక్రమవంతులైన తమ్ములఁగలవాఁడు రాజ్యప్రతిష్ఠితుండయి వృద్ధులనమాత్యుల బంధుమిత్రులను దొల్లింటికంటె మిక్కిలిగా బూజార్హుల నెల్లంబూజించు పితామహుండయిన భీష్ముని సపుత్రకుండైన ధృతరాష్ట్రుని పతిభక్తినభీష్టభోగానుభవపరులంగా సుఖంబునుచు. దీనికివిదురుండు నొడంబడునని యెప్పుడు దమలోవిచారింతురు. దీనివింటె కర్ణశూలాయమానంబులైన మూర్ఖప్రకృతుల పలుకులువిననోప బాండవులనిప్పురంబువలన బాయునట్లుగా జేయవలయు...ఈరాజ్యంబు మొదలింటంగోలె భవదీయంబయినం బ్రకృతిజనులు వశ్యులుగాకున్నను క్రమాగతంబయి మాకునప్రయత్నలభ్యంబగు దొల్లిపాండురాజు రాజగుణంబులం బ్రజానురాగంబు వడయుటంజేసి యెల్లవారును ధర్మరాజు రాజ్యంబవలతురు దానినెఱింగికాదె దానసమ్మానంబులం బ్రకృతిజనంబులకు సంతోషంబు సేయుచునుండుదు. నిందుల దుష్టజనుల పక్షపాతవచంబులుడుగు నంతకును వారణావతంబున గొంతిని పాండవులను దదీయ భృత్యామాత్య వర్గంబుతో వారణావతంబునకుం బుత్తము మనకురాజ్యంబు సుప్రతిష్ఠితంబైన మఱివారలింమకునత్తురు...భవదన్యజ్ఞాగౌరవంబున గాంగేయాదులు

అ॥ వె॥ క్షమయదాల్చియుండ జనదెల్ల ప్రొద్దుజే॥ యంతకాల్చియుండ జనదుకతికి
సంతతక్షముండు సంతత తేజుండు నగుట దోషమందు కనఘ మతులు.

ఇట్లనిన నిత్యక్షమాన్వితుండయిన వానికి భృత్యులు వెలవెక యవమానంబు సేయుదురు శత్రుగణంబులందశిక్షితులయినవారలు ధనంబుల నపహరించి దర్పంబు నూపుదురు మఱి నిత్య తేజోధనుండయిన వాడతి క్రూర దండంబున సర్వజన సంతాపంబు సేయుచు గృహాగతుం డైన సర్పంబు వోలె వెఱపుడును ద్వేగకరుండగుంగావున కాలోచితంబులుగా క్షమాతేజంబు లాశ్రయించుననిం యథాకాల కల్పిత క్షమాతేజుండైన వానికి నుభయలోక సిద్ధియగు.''
(మాఘ కావ్యమునందు బలరాముడునిట్లే యుపన్యసించెను)

ఇకధర్మోప దేశశాఖం గూర్చి ప్రశంసింతము.

## గృహస్థధర్మములు.

అరణ్య 1-31

''ఆర్తునకు శయనంబును భీతున కభయంబును తృషితునకు జలంబు బుభుక్షితునకు నన్నంబును శ్రాంతునకు నాసనంబును నిచ్చుట సనాతనంబైన యుత్తమగృహస్థధర్మంబు తృణభూమ్యుదక ప్రియవచనాదరదానంబెల్లవారికి నక్రమంబు యథార్హంబు గానన్నపాకంబును నపాత్రిక భోజనంబును వృథా పశుఘాతంబును పాపహేతువు లగ్నిహోత్రంబులన స్వాధ్యాయంబులు నతిథిబాంధవ ద్విజజన గురుమిత్ర భామినీ నివహంబులు పూజితంబులై యొగ్గుసేయును గావున గృహస్థుండు సర్వ సంతర్పకుండు గావలయుం గావున ప్రతిదినంబును పక్షులకు శ్వాపదార్థంబు సాయంప్రాతల యందు వైశ్వదేవంబు సేసి యమృతాశియు విఘసాశియు గావలయు యజ్ఞశేషంబమృతంబు నాబరగు నతిథిభుక్త శేషంబు విఘసంబు నాబడు నట్టివృత్తి వర్తిల్లు వాడుత్తమగృహస్థుండనిన ధర్మరాజునకు శౌనకుండిట్లనియె ''

మానవకోటియొక్క క్షేమలాభముల నిమిత్తము మహాత్ములిట్టి ధర్మముల విశేషముగా నుపదేశించినట్లు భారతమున పెక్కుసందర్భములయందు గానవచ్చుచున్నది. చూడుడు, అరణ్య 1-33. అను 3—219. మొదలగునవి, ఇట్లు పాత్రోపాఖ్యానములకుం చేర్చిన వచన రచనల ప్రశంస ముగించి, యాత్రోపాఖ్యానముం చేరిన రచనల జూతము.

## యాత్రావివరణములు.

పాపపరిహారము నిమిత్తమును, పుణ్యసంపాదనము నిమిత్తమును లోకజ్ఞానము విస్తరింపచేసికొనునిమిత్తమును సమర్థులగు వారెల్లరు తమశక్తికొలది దేశసంచారము చేసితామనుకనులార చూచిన విశేషములను, తమకు తెలియవచ్చిన విశేషములను గ్రంథస్థము గావించి సమకాలికులకు భావిజనంబులకును విజ్ఞానాభివృద్ధిగావించి వందనీయులగుచుందురు. ప్రాచీనకాలములనుండియు దేశసంచారము విద్యాభివృద్ధికి ముఖ్యాంగమనియెంచబడుచున్నది. భారతము నందు యాత్రావివరణ విశేషములనేకము పట్టగలవు. మచ్చునకొకటి రెండు వ్రాసెదను.

### అర్జునుని తీర్థయాత్ర

ఆది. 8. 124 127 136 137. 138. 139—140. etc

"...అర్జునుం డగ్రజాపేక్షాని గురుజనానుమతుండై యఖిలవేద వేదాంగ పారగులైన బ్రాహ్మణులు ననేక శాస్త్రవిదులై వివిధకథాకథన దీక్షులయిన పౌరాణికులును దనకుసహాయులుగా నరిగి సకలతీర్థసేవ సేయుచు........

. గంగాస్నానంబు సేసి తత్తీరంబున హోమంబు సేయుచు వాసవసుతుండు మహీసురవర సహితుండయి కొన్ని దివసంబులు వసియించి......(అటనుండి హిమ పర్వతపార్శ్వంబునకు జనియగస్త్యవటమును, భృగుతుంగమును జూచుచు హిరణ్యబిందు తీర్థంబున కేగి) యందును గోదాన భూదాన హిరణ్య దానంబులాదిగా పెక్కు దానంబులుసేసి యజ్ఞార్థంబుగా భూసురోత్తములకు గోసహస్రంబులిచ్చి, ప్రాగ్దేశంబున కరిగి నైమిశారణ్యంబునందు జగన్నాథు నారాయణు నారాధించి యుత్పలినియు గౌశికియు నందయు నపరనందయు గయయు గంగయు గంగాసాగర సంగమంబును జూచుచు (కేళావనరమ్యములగు వేలావనములను, పవన విచల ద్వీచీలాలితసముద్ర విద్రుమ మాలాపులిన స్థలములను మసలుచు) కళింగ విషయంబు సొచ్చునంత తోడిబ్రాహ్మణులు కళింగ ద్వారంబున గ్రమ్మరి యుత్తరదేశంబులకరిగిన నందుగతి వినయ బ్రాహ్మణ సహాయుండయి పార్థుండరిగి పూర్వసముద్ర తీరంబున పురుషోత్తమ దేవుని సమర్చించి మహేంద్ర పర్వతంబు సూచుచు

సీ॥ దక్షిణగంగా ప్రసిద్ధయనొప్పిన గోదావరియు జగత్పావనియైన
భీమేశ్వరంబును బెడగగుచున్న శ్రీపర్వతంబును జూచియుర్విలోన
ననఘమై శిష్టాగ్రహారభూయిష్టమై ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేగిదేశవిభవంబు జూచుచు విభుడు

దక్షిణాంబురాశి తీరమున కరిగి దురితహారియైన కావేరీమహాసముద్రసంగమంబున భూసురేశ్వరుల కభిమతార్థదానంబు చేసి కృతార్థుడగుచు పదుమూడగుమాసంబున మణిపూరుపురంబునకు జని ........................................."

ఇందు గమనింప వలసిన విశేషమొక్కటి గలదు. సంస్కృత మహాభారతమునందు వర్ణింపబడిన యర్జునుని తీర్థయాత్రా వివరములలో వేగిదేశ ప్రశంస లేదు. లేకున్నను, నన్నయార్యుడు, కళింగద్వారమును, మహేంద్రగిరిని, దక్షిణగంగయగు గోదావరిని చేర్కొని, గాఢ దేశాభిమాన చోదితుడై స్వవిషయమగు వేగిదేశ విభవమును సగర్వముగ వర్ణించికొని యున్నాడు. "అనఘమై, శిష్టాగ్రహార భూయిష్టమై, ధరణీసురోత్తమాధ్వర విధాన పుణ్యసమృద్ధమై, వేగిదేశ విభవము పొలుచుచుండె" నట. పామరజనులకే స్వగ్రామమునందును స్వవిషయమునందును నత్యంతమగు నభిమానముండు నపుడు వివేక్యుత్తముడగు[1] నన్నయార్యకవిచంద్రునికి, రాజనరేంద్రచంద్ర పరిపాలితమై పవిత్రతరమైన స్వదేశమునందింతటి యభిమానముండుట యాశ్చర్యకరముగునా? యాత్రా విషయముం గూర్చిన వచనరచనలు భీమార్జున నకుల సహదేవులు గావించిన దిగ్విజయ విషయములందును, వనవాసగతులైన పాండవులాడిన తీర్థ వివరణమునందును పెక్కుచోట్ల గానవచ్చుచున్నవి.

## ప్రకృతిశాస్త్రవిషయమైన వచనరచనలు.

ప్రకృతిశాస్త్రాంశముల బోధించు వచనరచనలు నన్నయార్యుడు రచించిన భారతమునందక్కడక్కడ గానవచ్చుచున్నవి. చూడుము.

---

1 సప్తవిధకవులలో 'వివేకి' యను కవిలక్షణమిట్లు చెప్పబడినది.

క. శ్రుతశాస్త్రాలంకార ప్రతిభుడు శబ్దాది దోషములు గనుగొనుటన్
చతురుడు వివేకి నాఁ జనునతడు మహాకవికృతంబులందు జరించున్.

కావ్యాలంకారచూడామణి 8 - ౬౮

యంబిక యందు బలపరాక్రమ సంపన్నుండయిన కొడుకు పుట్టు గాని మాతృదోషం బున నంధుండగునని విని విషణ్ణయై సత్యవతి వెండియుం గృష్ణ ద్వైపాయనుం బ్రార్థించి యుగ్ర సంబాలిక యందొక్క కొడుకుం బడయుమని నియోగించిన నప్పటియట్ల యమ్మహాత్ముండు నంబాలిక కడకుం జనిన నదియుం దన వేషంబునకు వెఱచి తెల్లనైయున్న నక్కుమారికి ప్రతిదానంబు సేసి యయ్యంబాలిక యందు మహాబలపరాక్రమ గుణవంతుండు వంశకరుండు నగు పుత్త్రుండు పుట్టు వాడును మాతృదోషంబున పాండుదేహుండగునని చెప్పి యరిగె"

## వర్ణనలు

ప్రకృతి శాస్త్ర విషయములంగూర్చిన రచనల ప్రశంస చాలించి మనమిక వర్ణ నాత్మకములైన వచన రచనలంగూర్చి ప్రసంగింప వలసియున్నది. ఇంత వరకును మన ము పరిశీలించిన కథా వివరణాదులైనశాఖలకుం జేరినవచన రచనలకును, వర్ణనాత్మ కవచనములకును రచనయందొక గొప్ప భేదము గాన్పించుచున్నది. అందు వాక్యము లు కడు కురుచలు; అర్థ సౌలభ్యము ప్రశంసనీయము. ఇందు గలవాక్యములు దీర్ఘములు సాధారణముగా నన్వయకాఠిన్యము గలిగి, దీర్ఘసమాసభూయిష్ఠము లైయుండు ను. పొంగి పొరలివచ్చు కవిభావముల నిట్టిరచనల చేతనే వ్యక్తము చేయుట సమంజస మని కవిమతమగుట చేతనో, లేక యిట్టిరచనలచే నిండియుండు సంస్కృతకావ్య శైలి ప్రాబల్యము చేతనో, లేక యిట్లు వీనిని రచింపని పక్షమున వర్ణితాంశములకును విద్వ త్కోటిలో తనకావ్యమునకును తనకును తగు గౌరవము లభింపదని నన్నయార్యుడు తల చియుండుట చేతనో, మరియే హేతువు చేతనో గాని వర్ణనాత్మకము లైనరచనలన్ని టినిట్టి దీర్ఘ సమాసభూయిష్ఠములుగానే చేసియున్నాడు. మరియు శబ్దాలంకార ప్ర యోగము గూడ విశేషముగా వీనియందే చూపట్టుచున్నది. మనోహరములైన సం భాషణ రంగముల యందును, స్వచ్ఛమైన మధురజలపూరితమై శీఘ్రముగా పారుచుండు ప్రవాహము వలెనలరు కథా వివరణ రచనలయందును గూడ వర్ణనీయాంశమేదై నతటస్థమగుచో నానావిధ శబ్దాలంకార భూషితమైన దీర్ఘసమాసమొకటి యుచ్చట ప్ర త్యక్షమగు చుండును. చూడుము.

సభా 1-182 జరాసంధుడు: "మరియు నాశాలించిన మాగధవర్గ్యరాజు ప్రతి గ్ర హింపనొల్లమి యీ రేని గా... ...కావలయు మీ వేషంబున బ్రాహ్మణ

ను కళ్యాణగోత్రాంగిరః ప్రవేశనములును, చంద్రాదిత్య గ్రహనక్షత్ర గణంబులు నీనగణం బులు వసు రుద్ర పితృ సాధ్యులును...... ఋగ్యజుస్సామాథర్వణ వేదవేదాంగంబులును పురాణేతి హాసంబులును బహుప్రకార భాషలును సమస్త విద్యలును మూర్తి మంతంబు లై గానము సరస్వతీ సమేతుండయి పరమానందంబునం బరమేష్ఠి కొల్వు సమయంబునం ను.'' ఇట్టి రచనలించుమించుగా పట్టికం జేటికలని మనము ముందుదాహరించిన శాఖల జేసినకేతునుగాని యావిధాంగములను పేర్కొను సందర్భముల వాని గుణ విశేషములం గూర్చిచెప్పు సులభ సమాసములందందు గలవు. చూడుము పైయుదాహర ణములందే

1. విశ్వకర్తయైన మన్వంత్రిభృగు

2. క్షణ లవ త్రుటి కాష్ఠా ముహూర్తాహోరాత్ర పక్షమాస ఋతు సంవత్సరయుగాత్మక కాలభైరవకాలచక్రంబు.

ఈ విషయములతో నీభూమిక నుండి విరమించి, వర్ణనాత్మక రచనల వర్గీకరణ విధానము పరిశీలింప నరుగుదము.

అలంకార శాస్త్ర ప్రకారము భవ్యప్రబంధముల యందష్టాదశవర్ణనలుండ వలయునని విధింపబడినది. చూడుము. కావ్యాలంకార చూడామణి 3 - 90, 91:-

గీ అట్టి కవికృతమైన కావ్యశ్రేయంబు
గద్యపద్య విమిశ్రసంపాద్య మగుచు
నగర ముఖ్యాష్టదశ వర్ణనములచేత
బరగు నదియును భవ్యప్రబంధమనగ ,

అష్టాదశవర్ణనలేవనగా.

మ॥ పుర వారాశి మహీధరర్తు శశిభుత్ప్రాపోద యోద్యానపు
ష్కరకేళీ మధుపానమోహన వియోగక్షేమయానస్వయం।
వరపుత్రోత్సవ మంత్ర దూత్యరణదోర్వ్యక్రాంతి సంకీర్తనా।
కరమష్టాదశవర్ణనాన్వితము తత్కావ్యంబు భవంబికన్ ,

నన్నయభట్టారకుని భారతమునందీ వర్ణనలన్నియు గానవచ్చుచున్నవి గాని యవియేగాక మరి కొన్ని ముఖ్యాంశములుగూడమిగుల ప్రశంసనీయముగ వర్ణింపబడి యున్నవి కావున మనము నన్నపార్యుని వర్ణనరచనల మరియొక విధమున వర్గీకరణము చేయ వలసిన యవసరము కలుగుచున్నది.


వర్ణనలు.
భౌతికములు.
(Natural and artificial beauties).
నరనారీజనముయొక్కయు, వస్తువులయొక్కయు, రూపగుణాదులవర్ణనలు,
Description of men & women and their things. Appearence forms qualities etc.
జీవవ్యాపారముల వర్ణనలు, సమరము - వేట విహారము - మంత్రము. మొదలగునవి.
Functions.
మనోవిషయ వర్ణనలు, రసములు, మనోవికారములు, మనస్పర్శనులు, అనుభవములు, లోనగునవి
Emotions Feelings Experiences.
ప్రకృతిజన్యములు, పర్వతములు సముద్రము. మొదలగునవి.
మధ్యమములు ఋష్యాశ్రమములు, మొదలయినవి.
ప్రయత్నకృతములు, నగరములు, రంగములు, వేదికలు, మొదలయినవి.
ప్రకృతిచర్యలు, ఖగోళవిషయములు, చంద్రోదయము, సూర్యోదయము, ఋతువర్ణనములు, మొదలగునవి.

రమణీయములైన ప్రకృతి సౌందర్య విశేషములలో మనము ముందుగా పర్వత వర్ణనమునుగూర్చి ప్రశంసింతము.

అరణ్య. 3 - 77. "ఇట్లు భగీరథుండు గంగావతరణంబునందు కృతనిశ్చయుండై యరిగి బహువిధాకారధాతుమంతంబులైన యుత్తమశృంగంబులను, జలభరవినమ్ర ప్రబల బలాహకవ్యూహ సంఛాదితశ్యామాయమానంబులైన తుహినస్థలంబులను, సిద్ధవిద్యాధర గంధర్వ గీర్వాణ మిథున సంసేవ్యమానంబులైన నానారత్న కందరంబులను, శుకపిక పారావత శుక్లాపాంగ సారంగ శతపత్రిదాత్యూహవ్యూహ శబ్దశబ్దాయమానంబులైన తరువనశేఖలను, సింహ శరభ శార్దూల శుండాలగోలాంగూల కోలాహలాన్వితంబులైన గహ్వరంబులను జేసి రమణీయభయానకంబైన హిమవత్పర్వతంబున." ఇందు మొదటి పంక్తి యుపక్రమణిక తరువాత హిమవత్పర్వతంబునకుంగల వివిధాంగములగు శృంగములు, తుహినస్థలములు, నానారత్న కందరములు తరువనశేఖలు గహ్వరములును పేర్కొనబడినవి. ఇందుపర్తియంగమునకును గలగుణ విశేషములు దానిననుసరించి వ్రాయబడిన దీర్ఘసమాసమునందు వర్ణింపబడినవి. ఇందలి సమాసములన్నియు తొలుదూడినట్లు సమానరూప పరిమాణములుగలిగి పెక్కుశబ్దాలంకారములచే భూషింపబడియున్నవి.

మరియు అరణ్య 3-311-313. గంధమాదనమును, అందుగల సరస్సును, కదళీషండమును వర్ణింపబడిన విధము.

అక్రమలంబు దెచ్చివగాడ్పున కభిముఖుండై గాడ్పునట్టి గంధమాదనంబున వివిధరత్న బంధుర కందర కదళీ షండదర్శనంబులను, మందారమందిర సుగంధి గంధవహస్పర్శనంబులను, నళికులకోకిలాలాప శ్రవణంబులను సర్వర్తు కుసుమసురుచిర గంధాఘ్రాణంబులను నతిమధుర ఫలాస్వాదనంబులను బద్ధప్రమోద హృదయుండగుచు...... త్వరితగతింజనిచని పవనవశ తరుచలిత తలీరుహ పనస తమాల తాలహింతాల విశాల కదళీ దళ వీజ్యమాన శీతలజలపరిపూర్ణంబైన యొక్కసరోవరంబుగని...."

*జలాశయములందెల్ల మహోదధి మహనీయగాంభీర్య నిధి. దానివర్ణనమును నన్నపార్యుడాది పర్వమున ద్వితీయాశ్వాసమునం దిరువదియేడవ రచనయందురమ్యాలంకారభూషితంజేసి గావించి యున్నాడు

అక్రూరవరము వివరయు వినోదార్థంబు విహరించువారు కరిమకరిని కరాఘాత జాతవాతోద్ధూత తుంగతరంగాగ్రసముచ్చల జ్జలకణాసారచ్ఛటాచ్ఛాదిత గగనతలంబైనదాని సుద్యాన వనంబునుంబోలె బహువిద్రుమలతాలంకృతంబైనదాని, నాటకప్రయోగంబునుంబోలె ఘనరసపాత్రశోభితరంగరమ్యంబైనదాని దివంబునుంబోలెను హిమకరభరితంబైనదాని...గాంచిరి.'' (ఇందు నన్నయ బాణకవి రచనల ననుకరించి నాడు). మరియు

బహువిధంబుల వ్యక్తమగు మహనీయ ప్రకృతిశోభను నేత్రపర్వముగ తిలకించుచు తన్ని ర్మాతయగు సర్వేశ్వరుని నిరంతరము ధ్యానించి తపముసేయు మహాఋషుల యాశ్రమములందు, పట్టణాలనిర్మాణాదులైన మనుష్యయత్నములు కొన్నియున్నను సహజ ప్రకృతి మహాత్మ్యమే విశేషముగా గన్పట్టుచుండును. ప్రకృతి మనుష్య సమ్మేళన మనపరిమ శోభావహములగు నిట్టి పుణ్య ప్రదేశములను సందర్శించుటకై మనము దుష్యంతునితో గూడ కణ్వాశ్రమమునకు బోవుదము, ఆది— 4-22

## కణ్వాశ్రమము.

(ఆజ్యహవిర్గంధ సౌరభ ధూమలతాతతులం బెనగిన క్రమాకులకోవ్యుల మీదన పేతిల తాంతములైనను బాయని మధుపప్రకరంబుల) హృదయసుఖావహంబగుచున్న యువ్వనంబులో నరిగి యనవరతపద క్రమ మహాద్విజ పఠ్యమానవేదధ్వనులను నవిచ్ఛిన్నాహూయమానాగ్ని హోత్రస్వాహాశబ్దంబులను ననేకముని గణప్రణీత వచనవిషయవిభాగవినిర్ణయ వ్యాఖ్యానిపుణవిద్వత్సంభాషణ ఘోషంబులను, ప్రతిపక్షదుర్భేద ప్రమాణవిచార్య మాణపదార్థ మీమాంసక గోష్ఠీవివాద వాదంబులను జేసి మ్రోయుచు యజ్ఞప్రయోగప్రవీణులైన యాజ్ఞికులను, నధికతపోనిరతులయిన మహాతపోధనులను, నివాసంబైన పుణ్యనదీతీరంబున దర్శనీయరమ్యంబయి గంగాతీరంబున నరనారాయణ స్థానంబునుంబోలె జగత్పావనంబగుచున్న కణ్వమహాముని యాశ్రమ

ఇట్టు ప్రకృతాంశమున గానవగు వివిధవస్తుతతిని తద్గుణ విశేషముల వివరించి బహువిధ శబ్దాలంకార భూషితములైన సమాసములతో నిర్వచించుటయే వర్ణనలయందు నన్నయభట్టారకు డవలంబించిన పద్ధతియని యిందువలన తెల్లమగుచున్నది.

ఇంతవరకు నన్నయ ప్రయత్న ప్రమేయములు లేకయే సృష్టిలోను ధ్వని

మనమిక నరనారీ జనముయొక్కయు వారివస్త్రజాలముయొక్కయు రూపశీలాదులం గూర్చిన వర్ణనల గొన్నింటి వ్రాయుదము.

వాలఖిల్యులు. ఆది 1—84

అల్పకుశపలాశేద్మభారంబులు మోచికొని వడవడ వడంకుచు వచ్చువారి నల్పసత్త్వుల నంగుష్ఠపరిమాణదేహుల ననవరతోపవాసకృశీభూతశరీరుల వాలఖిల్య మహామునులం జూచి నగిన...

భరతుడు. ఆది 4—62

శకుంతలకు భరతుండుదయించి కణ్వనిర్వర్తిత జాతకర్మాది క్రియాకలాపుండయి పెరుగుచు కరతలాలంకృత చక్రుండును జక్రవర్తి లక్షణలక్షితుండును సింహసంహననుండును దీర్ఘబాహుండును ననంత జవసత్త్వ సంపన్నుండును నై పెరుగుచు.

శకుంతల ఆది 4—46.

అమ్మాలినీ పులినతీరంబున శకుంతరక్షితయై యున్నకూతు నత్యంత కాంతిమతి నవనీతలంబున కవతరించిన తరుణశశిరేఖయుంబోని దాని నెత్తికొనివచ్చి శకుంత రక్షితయగుటంజేసి శకుంతల యనునామంబిడి కరంబుగారవంబునం బెంచితిమి.

కచుడు. ఆది 3—109.

అనిన నమ్ముని కుమారుని సుకుమారత్వంబును వినయ ప్రియవచనమృదుత్వంబును, ననవరత నియమ వ్రత ప్రకాశిత ప్రశాంతత్వంబునుం జూచి శుక్రుండతిస్నేహంబున.

మాద్గల్యుడు. ఆది 7—255

« తొల్లినాలాయనియైన యింద్రసేన యనంబరగిన పరమపతివ్రత మౌద్గల్యుండను మహామునికి భార్యయయి కర్మవశంబునఁ నమ్మునిం గుష్ఠవ్యాధి బాధితత్వక్క్షీభూతశరీరు, వయోవృద్ధువలీపలితధరు దుర్గంధవదను, దుఃఖజీవునతికోపను విశీర్యమాణనఖత్వచుం......

అగ్ని దేవుడు కృష్ణార్జునుల కిచ్చినవస్తువులు ఆది 8—254

«. (గాండీవమను చాపరత్నమును) మఱియు బ్రతి పక్షసంక్షయ కరంబుల యునక్షయ్య శరధులును, వివిధాయుధ భరితంబై సింహలాంగూలాంకితగోలాంగూ

లన్వరాజ మానంబై మహాంబుధర ధ్వానబంధురంబై మనోవేగనిత వాహవాహ్యా మానంబై యొప్పుచున్న దివ్యరథంబు నర్జునకిచ్చి, సహస్రకర సహస్రదుస్సహమహః పటల భాసురంబగుచు దేవదైత్య దానవయక్ష రాక్షస పిశాచోరగ ప్రశమనంబయి వెలుంగుచున్న సుదర్శనంబను చక్రంబును గౌమోదకియను గదయును నారాయణున కిచ్చె.";

ఇత్యాది వర్ణనలయందు నరనారీజనులసాంగోపాంగవర్ణనల కుపక్రమింపక యేముఖ్యాంశప్రశంస చేత నేవ్యక్తిత్వము స్ఫుటీకరింపజేయుచు నన్నయమనకు పూజ్యుడగుచున్నాడు.

## జీవ వ్యాపారములు.

మహాభారత కావ్యమునందు క్షత్రియ వీరులుప్రధాన పాత్రములగుటచేత నిందు వర్ణింపబడిన జీవవ్యాపారములు విశేషముగా క్షత్రియ కులధర్మములైన వేట, మంత్రము, యుద్ధము మొదలగు వానికిసంబంధించినవై యుండును. ఈరచనలయందు పూర్వోదాహృతములైన పురవారాశి మహీధరాదుల వర్ణనల యందున్న దీర్ఘకఠినసమాసములంతగా గానరావు. గానియలదుల్లే యిందును శబ్దాలంకారములు బహుళముగానేగలవు.

## దుష్యంతుని వేట, ఆది 4: 10, 12. 14

“అమ్మహీపతి యొక్కనాడు మృగయావినోదార్థియయి యాదిత్య హయంబులకంబై వడిగల వాహంబులు పూనిన రథంబెక్కి యాజానేయ తురంగారూఢులైన యాశ్వికులు పరివేష్టించిరాగ ననంతకుంతశక్తి చాపకృపాణ పాణులైన వీరభట సహస్రంబులతోజని వనంబులోని మృగంబులం జట్టిముట్టి ...(సరభ ద్వీపరిపు వరాహశార్దూల మదద్విరదాదిప్రకర భయంకర వనమధ్యమున) నృపతి పెక్కు మృగంబులనేసి చంపెడు వేడుక నతిదూరంబున కరిగిన నాతని రథవేగంబునను గమింప నోపక యధికక్షుత్పిపాసాపరవశులై పదాతులయ్యయి ప్రదేశంబుల విశ్రమించి రంతదుష్యంతుండు కతి

సచివామాత్య పరిజనపురోహిత సహితుండై కొండొకనేలయరిగి ముందటనొక్క పుణ్యనదీతీరంబున వివిధసురభి కుసుమఫల భారవినమ్రితరులతా గుల్మపరిశోభితంబయినయొక్కవనంబుగని.”

## రాజసూయార్థమైన మంత్రాలోచన. సభా 1—98. 129, 131

“అనినవారల వచనంబుల కనుగుణంబుగా ననుజానుమతుండయి ధర్మరాజు రాజసూయంబు సేయసమకట్టి దీని నిర్విఘ్నంబున నిర్వహించుటకనాది నిధనుండాది పురుషుండు పురుషోత్తముండు పుండరీకాక్షుండు జాండయ్యును జగద్ధితంబుగా మర్త్యంబునజనియించిన యమ్మహాత్ముండువాసుదేవుండ యోపుంగానియన్యులకశక్యంబని యప్పుడయాప్తచరులంబిలువంబంచి (కృష్ణుండేవరబనిచిన) వయ్యుధిష్ఠిరు సందేశంబున దాశార్హుండునుదద్దర్శనోత్సుకుండయి ద్వారవతిగదలి యతిత్వరితగతింజని నిరంతర ప్రయాణంబుల నింద్రప్రస్థపురంబునకు వచ్చె......తదనంతరంబధర్మతనయుండు (తనపిత్యాగరోగంబునంజేసి రాజసూయ క్రతుప్రారంభము నాండుట కృష్ణునకెరిగించి యాతనిని యోగమభిలషించుట నెరింగింపకృష్ణుండును రాజోత్తమా నీతమ్ముల బలసంపదచేత నీమహాయాగమును నీవచేదగియున్నావు) తొల్లిజమదగ్ని సుతుండయిన రామునిచేత ధాత్రియుపగత క్షత్రంబయిన నంతనుండి యైలవంశంబును నిక్ష్వాకువంశంబును దక్కదక్కిన క్షత్రియవంశంబులెల్ల కృత్రిమంబులు గానివిమలమకుటార్హంబులుగా వీరెండువంశంబుల వలననే కొత్తరశత వంశంబులయ్యె. మరియుయాతి భోజవంశంబుల వలనంజతుర్దశ వంశంబులయ్యె నిట్టిసకలక్షత్రియుల జయించిజరాసంధుడున్నవాడువానిసార్వభౌమ్యంబు జెప్పనశక్యంబు... రాజసూయార్థంబుగా పరాక్రమంబున జరాసంధవధియించి నిఖిలక్షత్రియుని గ్రహమోక్షణంబు సేయుసంతకంటె మిక్కిలి యశోధర్మంబు లేండెవ్వి... కావున మేము ముచ్చ్వురము గ్రమంబునం బరాక్రమించి యాజరాసంధుడాసి నదీప్రవాహంబులు వృక్షోన్మూలనంబు సేయునట్లు క్రమంబునవాని నిర్మూలింతుము. అద్దురాత్ముండు భూతంబుల యందంత రాత్మంబోలె దనయుంతరంబెరుగక యేకాంతశీలుండై సుఖంబనుభవించుటంజేసి వానియంతికంబున కరుగుట యశక్యంబు.”

## సమరము.

### భీమజరాసంధుల మల్లయుద్ధము. సభా 1—106, 210

"ఇట్లు కార్తిక మాసంబున బ్రథమదివసంబున దొడంగి భీమజరాసంధు లెడయుడుగక యొండొరులం బట్టియు గిట్టియు. నడచియుం బొడిచియు, డాచియుం ద్రోచియు మహాయుద్ధంబు సేయుచుండ ద్రయోదశినాడిద్దరుంగిట్టి మల్లయుద్ధకౌశలం బేర్పడ బెనంగుచుండ జతుర్దశినాటి రాత్రియందు జరాసంధునతి శ్రాంతభావంబు వలక్షించి యధోక్షజుండు (విష్ణువు) ననిలతనయుండ నిలదేవుందలంచి తత్ప్రసాదంబున నధికసత్త్వ సమేతుండై (మరునాడు) జరాసంధుంబట్టుకొని సంధిసంధుల యెమ్ములు విరిచివధియించి వానినధియించుట జగద్విదితంబుగా తదీయగృహద్వారతోరణ సమీపంబునందత్కళేబరంబు వైచిననది సర్వజన భయంకరంబయియుండె."

ఈయుద్ధవర్ణనమునందు నన్నపార్యుడా రెండుమూడు అన్త్యప్రాసములతో తృప్తిపొందవలయునని యున్నాడు గాని యాతని యనంతరము నాచనసోమనాథులైన కొందరు కవులు యుద్ధములు వర్ణించు పట్టున తరిమి తరిమియును ప్రాసములను యమకములను వ్రాయుచు వచ్చినయంశమీయా సందర్భములయందు చర్చింతము. అర్వాక్కవీశ్వరుల చేతులలో మిగులపెంపొంది నానాముఖముల వ్యాపించిన వర్ణనవిశేషములయొక్క బీజములన్నియు నన్నపార్యుని కృతులందు గలవని సోదాహరణముగ నిరూపించుటయే యిచ్చటమా యాశయము.

మనవర్గీకరణము ప్రకారమిక వర్ణనలలో మనోవిషయముగూర్చి తెలిపెడు వర్ణనలగూర్చిమన మిపుడు చర్చింపవలసి యున్నది. వీనిపరిశంస యంతయు ముందొకప్రకరణమున నన్నపార్యుని భావరసపోషణ క్రమము చర్చించుపట్టున గావలసియుండును. గావున పరిమితమున నదనిలిపియుంచి, సంకీర్ణను రచనాశాఖంగూర్చి ప్రసంగింపబోవుదము.

### సంకీర్ణరచనలు.

కథాసందర్భమును బట్టి పైనుదహరింపబడినవి విధశాఖలకు చేర్పదగిన వచనరచనా

లేకండుగాని అందుకెక్కుడు సంఖ్యగలవిగాని వివిధ ప్రకారములచేతచేరి మిశ్రితరచన లయి సంకీర్ణములనదగు వచనరచన లగునని చెప్పనొప్పును. నన్నయ రచనలందిట్టి మిశ్రితశైలముగల రచనలే విశేషముగా గలవని వక్కాణింప వలసియున్నది.

ఊర్వశి—అర్జునుడు— అరణ్య. 1—358.

అంతనూర్యాస్తమయ సమయంబున జంద్రుడుదయించి సాంద్రచంద్రికాపిలా సంబునది గ్వనితల నలంకరింపుచుండని లింపపతి పంపుసొంపార నూర్వశియర్జున సం గమకాంక్షం జేసి చంద్రికాధవళదుకూలంబు గట్టి మృగమదకర్పూర కుంకుమోన్మిశ్రిత స గంధంబులది వివిధసురభి కుసుమవిసరంబులు ముడిచిమణిమయ భూషణాలంకృతయైనితంబ డంబడసిన కొప్పెమ్మెరుంగు దీగయుంబోలె మణిమయమంజీర ఝుళంఝుళ నినాదంబును గంకణ ఝణఝణత్కారంబును గటకలాప కింకిణీ కేంకారంబును మదనాజ్ఞావాద్య ఘోషంబునుంబోలె మ్రోయుచుండ మందగమనంబున బురందరనందను మందిరంబున కరుగుదెంచిన నప్పురుష సత్తముండుభయభక్తి సంభ్రమంబులతో బ్రత్యుత్థానంబును దం డప్రణామంబును జేసి కరకమలంబులు మొగిచియిట్లనియె.

ఈరచన మిశ్రితశైలముగలది. చంద్రోదయ వర్ణనముతో నారంభించి, యూ ర్వశికి యర్జునునందుగల సంగమకాంక్షను సూచించుచు, విభ్రమశృంగారార్థ మామె ధరించిన యుడుపులను, అలదినసుగంధమును ముడిచిన కుసుమములును, దాల్చినసొ మ్ములలోనుగాగల యలంకారమును వర్ణించి తుదకొక్కయుపమానముతో సౌందర్యవ ర్ణనముగించి యామెనడచునప్పుడు మంజీరకంకణాదులు ఘట్టనచేజనించిన శబ్దజాలము నయధోచితశబ్దజాలముచే పేర్కొని యామెయర్జునుకేర నరుదెంచిన గమనవిధానము సమతను మందగమనమనే వర్ణించియవ్వలి కథాభాగము గూర్చిచెప్పుచున్నాడు. ఇంద గలశబ్దాను ప్రాసముల సహజగతులు మెచ్చదగియున్నవి. మందగమనంబున పురంద నందను మందిరంబున కరుదెంచి, యనుకూర్పునందు ఊర్వశిమందగమనము ప్రతిఫలిం ప్రతిధ్వనించుచున్నది. ఝుళంఝుళ నినాదములు ఝణఝణత్కారంబులు కేంకా ములును మిశ్రితములై యూర్వశి కరచరణంబుల దాల్చిన యాభరణ ఘట్టనల ననచె అలో వేయుచున్నవి. మరియునిందు ఊర్వశికామోత్కంఠతయు నర్జునునిపరకాంత

లోనే విబుధ గమ్యములైన యర్థాలంకారములచే నెంతయు నొప్పుచున్నది. సర్వజనాహ్లాద కారణములై రమణీయార్థ ప్రతిపాదకము లైన యిట్టి సుప్రసిద్ధ వచనరచనలను తన కృతులందు పెక్కుచోట్లగావించి వాగనుశాసనుండు వచనరచనాకుతూహలు లైన పిమ్మటి యాంధ్రకవులకు మార్గదర్శకుడై మన కనుదిన సంస్మరణీయుడగు చున్నాడు.

## వా క్య ర చ నా క్ర మ ము.

మనమింత వరకు నన్నయభట్టారకు డేయే విధములగు వచనరచనల గావించియుండినాడో, ఏయేసందర్భములయందెట్టి వచనములరచించి యున్నాడో సంగ్రహముగా ప్రశంసించితిమి. ఇపుడతని వాక్యరచన క్రమమును గూర్చి యించుక ప్రశంసింపవలసి యున్నది. మానవ స్వభావానుగుణ్యముగ పాత్రభాషితవర్ణనములకు చేరదగు వచన రచనలలో సంపూర్ణములైన పెక్కు కురుచ వాక్యము లుండునని యీవరకు కొన్ని యుదాహరణముల వలన తెలిసికొంటిమి. పాత్రభాషితములు కాని రచనల యందు, అసమాపక భూత క్రియలతో గూడిన యసంపూర్ణ వాక్యముల శకలములు చేరియు, నొక్క సంపూర్ణ వాక్యమైన నేర్పడకయే యారచన ముగించి వైచి తరువాత పద్యము ను కూర్చ నుపక్రమించుచుండుటను పెక్కుతావుల జూడనగుచున్నది. మందపాలోపాఖ్యానమున గల యీక్రింది వచనమును పరీక్షింతము: (ఆది - 8 - 310)

కావున నీవు మెచ్చిన చోటికి బోవ నోపము మావలని మోహంబు విడిచి యరుగుము ఏమీదహనక్లేశంబు నంబొంది నను నీవు జీవించి పుత్రులంబడయ నోపుదువు నీ పుణ్యాతిశయంబున మాకునగ్నిభయంబు దొలంగెనేని నీవు మాయొద్దకు వచ్చి యెప్పటియట్ల రక్షింతు.'' ఈవాక్యములు మందపాలుని భార్యయగు లపితతో ఖాండవ దహన సమయమున దాని పిల్లలనిన మాటలు. సంధులు విడదీసినచో నిందు సంపూర్ణ వాక్యములు నాల్గుగలవు, ఇవిచాలకురుచలు. ఇంతవరకును పాత్రభాషిత భాగము. తరువాత చూడుము.

రక్షింతు అని కొడుకు తల్లి మొక్కినం జూచి జరితయు బాష్ప పూరితనయనయై యాసన్న తరు దహన మహోత్సాహుండై వచ్చు హవ్య వాహనుం జూచి

ప్రాణభయంబున గగనంబున కెగసి చనెనంత ఇతికథా వివరణ వర్ణనమునకుం జేరదగిన రచన. ఇందు చూచి, ఆయి, చూచి, ఎగసి, అను నసమాపక ధాతుక్రియలతో గూడిన యసంపూర్ణవాక్యములు నాలుగైదు గలవు. చనెను క్రియతో ముగించి యుండినచో నీరచనార్థము సంపూర్ణమై యుండెడిది. గాని తరువాత వంత, యను పదముతుదనుండుట చేత రచనసంపూర్ణార్థము గలది గాలేదు.

మరి యొక విశేషము గూడ గలదు. మనస్సునందలి యాందోళనమును, స్వల్ప కాలమునందు మనుష్యుల మనశ్శరీరముల యందు బొడ చూపెడు వికారపరంపరను సూచించుటకు గూడ నిట్టిరచనలె మిక్కిలి యుపయోగకరముగా నుండును. ఉదాహరణార్థము రాజసభలో దుష్యంతునిచే నిరాకరింప బడిన శకుంతల హృదయాందోళన మెట్లువర్ణింప బడినదో చూతము. ఆది-4-77.

అనినవిని। వెలవెల్లనై। వెచ్చనూర్చి। నిశ్చేష్టితయై। కెందమ్మిరేకులవలనం దొరంగు జలకణంబుల పోలెకోపారుణితనయనంబుల బాష్పకణంబులు దొరగంగ దల వాంచి యారాజుంగటాక్షించుచు। హృదయసంతాపంబు తనకు దానయుపశమించు కొని। పెద్దయుంబ్రొద్దు చింతించి। శకుంతల యారాజున కిట్లనియె।''

ఇట్టి యసమాపక క్రియాపూరితమైన మహావాక్యములు రచించుచుండుటవలన స్పష్టముగా నొక్క సదుపాయమున్నది. కావ్యపఠనము త్వరగా, సంగ్రహముగా సాగిపోవుచు, విసువను వదిలేక కడుమనోజ్ఞముగా నుండును. అట్లుగాక వాక్యము లెక్కడను త్రెంచివైచి "శకుంతల వినెను. ఆమె వెలవెల్లనయ్యెను. ఆమె వెచ్చనూర్చెను. ఆమె నిశ్చేష్టితయయ్యెను.'' అని యీప్రకారముగా చెక్కు సంపూర్ణకురుచ వాక్యములతో శ్వాసకాసాది రోగపీడితులు చదువుకొనుటకు సదుపాయముగా నుండునట్లు కావ్యము రచించినచో కర్తలను, కర్తృవ్యాంశములను పలుమరు పేర్కొనుచు, పోవంబోవ గ్రంథమనవసరము గాదీర్ఘమయి విసువు గల్గించును. సంస్కృతమూలమునందు నేకవిధముల విసుగు పుట్టించెడు వర్ణనలను, రచనలనుచక్కని యుపాయములచే మిక్కిలి సంగ్రహపరచి యాంధ్ర భారతమును మనోజ్ఞతరముగ గావించిన కవిత్రయ కవిసింహుల కాంధ్రపాఠకు లెల్లరు మిగుల కృతజ్ఞులయి యుండవలయును.

గర్జిల్లుచున్న వాని నిజపాదఘట్టితమహీతలప్రచలనవేగ శిథిలిత వల్లీపల్లవ శాఖాశ పరిరంభణ సుఖంబు తాదపంబుల కాపాదించుచున్నవాని, నెమర నొక్కొక్క నుంగని రంత వాడును బ్రాహ్మణ సంఘంబు నుండట కృష్ణాజినావృతులైన ఋపాండవుల దవ్వులంగని మార్గని రోధియై మహాపర్వతంబు నం బోలెనున్న నదృష్టపూర్వ ప్రమాణంబైన వానిదేహంబు జూచి। నిమీలితనయనయయి దుశ్శాసనకరా కృష్టవేణీ భరంబువెను వెంట నొలయంబాంచాలివంచ పాత్రంబుల నను మ నదియుం బోలె బతుల నడుమ భయవ్యాకులిత చిత్తయైన నింద్రియంబులు విషయరతింబరిగ్రహించినట్లు లయ్యేవురునకొక్కడలిం బట్టుకొని భయపడకుండ వాశ్వాసించుచున్నంత...,,

ఇందొక్క నాటి యర్ధరాత్రంబున నొందొకరక్క సుంగనిరన వరకు గలరచనము రక్కసునికిగల గుణములు జూపికన్నను విస్తరింపజేయుచున్నది. ఆరక్కసుని రూపాదులవర్ణించు సమాసములో క్కయచ్చున తీసినట్లుతులదూచినట్లు రచింపబడినవి. మరియు, రచనమున నారంభమందునన్వయకాఠిన్యము లేనిసులభ పదములున్నవి. గాని కొంచబోవ

ఆరాక్షసుడు తీక్ష్ణంబులగు కోరల చేత భయంకరంబగు వదనగహ్వరంబును దెరచి గ్రుడ్లు మెరవ భ్రూభ్రదేశంబుల దూలి బాలార్కరశ్మి యుతంబగు మేఘంబువలె ప్రకాశించుచు సకల ప్రాణులకు భయంబు గలుగునట్లు గర్జిల్లుచుండె। అల్లుగర్జిల్లుచు బ్రాహ్మణ సంఘంబులతో గూడ వచ్చుచున్న పాండవులకు మార్గనిరోధంబును జేసి అట్టి వానిని జూచి ద్రౌపది మిగుల భయంబును బొంది పతుల మధ్యంబున గడగడ వణకుచుండె. అట్లు భయంబును బొందుచున్న ద్రౌపదిని పాండవు లేవురును కరంబులచే స్పృశించుచు భయంబును దీర్చిరి.

ఇది సామాన్య సంసారుల తదన్నత ప్రస' భోజనము వలె నున్నది అర్థ సౌలభ్యము నాశించి వాక్యము లెక్కడ కక్కడ త్రుంప బడినవి. అందుచే గీతలుంచిన భాగములు మరల మరల చెప్పవలసి వచ్చినది. ఒక్కచోట తప్పసర్వనామములులయు పదియోగ మిదగు పడదు రసోత్పాదకము లైన వర్ణనలు. అలంకారములు లేవు. కవిత్వ సౌరభమిందు మందునకైన గాన రాకున్నది.

సమాసముల విడివియూ వానియన్వయ మునందు కాఠిన్యమును క్రమముగా హెచ్చుచు మధ్యమ బోవు సరికి కఠిన తమాన్వయము గల దీర్ఘ తమ సమాసము వేయబడినది. అవిల సమాసముల విడివియూ నన్వయ కాఠిన్యమును తగ్గి సులభమైన రచన క్రిందకు దిగుచుండును. నాచన సోమన శ్రీనాథుడు, బమ్మెర పోతరాజును తమ కావ్యములయందు పెక్కు తావుల నిట్టి రచనల జేసి యున్నారు. సంగీత విద్య యందు ప్రదర్శితముగు నారోహణా వరోహణా విధానము మహా కవుల వగిన రచనలయందును ప్రకాశిత మగుచున్నది.

మరియు నీరచన యందు సందర్భోచిత వర్ణనలు గలకథా వివరణము నున్నది. శబ్దాలంకారములు గలవు. ఇందలి యుపమాలంకారముల యందు కవి చూపిన కళాకౌశలము ప్రశంసనీయము. మహాపర్వతము వలె మార్గ నిరోధియైన కిమ్మీరునింజూచి ద్రౌపది పంచ పర్వతముల నడుమ నదివలె నున్న దనుటవలన పాండవుల ధైర్యస్థైర్యంములును, భార్యయై యేవురి సంపర్కము గల ద్రౌపదీ రుత్కృష్టచాంచల్యములును సమంజసముగ సూచింప బడినవి. విశేషించి పంచ పాండవులామెను బట్టుకొని యాశ్వాసించిన విధమెంత చమత్కారముగా వర్ణింపబడినది? ఇంద్రియములు (ఐదును) విషయరతిం బరిగ్రహించి నట్లామెను పంచ పాండవులు పరిగ్రహించిరట. ఈభావములు నన్నయ స్వబుద్ధికి దోచినవి గాక సంస్కృత మూలమునందు గలవు. అయినను మూలము నందలి భావసారస్యమును లెస్సగ గ్రహించి, రమణీయతరముగ నన్యభాషలోనికి వానింబరివర్తనము సేయజాలిన కళాకౌశలం బగటచేసిన నన్నపార్యుని ప్రకృతి సౌందర్యగ్రహణ దక్షత్వమును, తద్వర్ణనా సామర్థ్యమును, ఆధ్యాత్మిక విద్యాపరిజ్ఞానంబును, సందర్భోచితాలంకార రచనా నైపుణ్యమును, నిందు వ్యక్తమగు చున్నవి. దీని ప్రక్కనే వ్రాయబడిన రచన యందిట్టి చమత్కారములు లేవు. అత్తరు దీసినగులాబివలెను, పిండి వైచిన తేనె పట్టువలెను నిది సౌరభహీనమై రసహీనమై యొప్పుచున్నది. ఇట్లు వ్రాయుటలో నాముఖ్యోద్దేశము నన్నపార్యుని వచన రచనలందు చూపట్టెడి ప్రాశస్త్యము విదితము గావించుటగాని బ్రహ్మశ్రీ నోరి గురులింగ శాస్త్రివారి రచనలను న్యూన పరచుట కాదని విన్నవించుచున్నాను. శాస్త్రులవారు భారతకథా శ్రవణాసక్తులైన సామాన్య జనుల కొరకు 'తదన్నత్ద్రస' పద్ధతిని భారత కథను

అతి సులభముగను, సంగ్రహముగను రచించిరి. నన్నపార్యుడన్ననో "సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తిలో నారసి మేలనునవ్వు" భారతమునాంధ్రీకరించియున్నారు. ఇరువురును కృతకృత్యులయిరి. పరిపోల్చి చూచినగాని, యీరచనలయందుగల తారతమ్య భేదముల గ్రహించుట సులభము గాదు గావున పైవిమర్శనమునుగూర్చి యెవ్వరు నన్యథాభావింప కుందురని ప్రార్థించెదను.

## గుణములు రీతులు.

ఇంత వరకును నన్నపార్యుని వాక్యరచనాక్రమమును గూర్చి కొంత ప్రసంగించితిమి. ఇక నాతని కావ్యగుణములను గూర్చియు రీతులను గూర్చియు నించుక ప్రస్తావించ వలసియున్నది. కావ్యమునకు రీతులాత్మయనియు గుణములు ప్రాణములనియు నాలంకారికులు చెప్పుదురు. ఆచార్యదండి ప్రముఖులగు సంస్కృతాలంకారికులు కావ్యగుణములు పదియని చెప్పిరి. "శ్లేషః ప్రసాదః సమతా మాధుర్యం సుకుమారతా అర్థవ్యక్తిరుదారత్వమోజః కాంతి సమాధయః" (దండికావ్యాదర్శము-2-42) కావ్యప్రకాశకారుడైన మమ్మటుడీనిర్వచనము ఖండించి, పదిగుణములు లేవనియు, ఓజస్సు మాధుర్యము, ప్రసాదము నను గుణములు మూడే కావ్య గుణములనియు విశదము చేసెను. (మాధుర్యౌజః ప్రసాదాఖ్యాస్త్రయస్తేన పునర్దశ). నన్నపార్యుని రచనలందు విశేషముగా బొడసూపుచు భారత కావ్యమును శోభాయమానముగా నొనర్చు ప్రాచీనాలంకారికులచే నిర్వచింపబడిన గుణములను, మరికొన్ని ముఖ్య గుణములను సంగ్రహముగా ప్రశంసింప యత్నించెదను.

ఆచార్య దండికృతమైన కావ్యాదర్శము నందును, దానిననుసరించియే యాంధ్రమున రచింపబడిన కావ్యాలంకార చూడామణి యందును, నన్నెచోడుని కుమార సంభవము నందును, ప్రతాపరుద్రీయము ననుసరించి మూర్తి కవిచే రచింపబడిన కావ్యాలంకార సంగ్రహము (నరసభూపాలీయము) నందును, కావ్య గుణములు పదియు చెప్పబడినవి. అందు, శ్లేష, సుకుమారత, సమత, ఓజస్సు అను నాలుగు గుణములు శబ్ద సంబంధము గు గుణములు. అర్థవ్యక్తి ఔదార్యము కాంతి సమాధులనునవి అర్థగుణములు. మాధుర్య ప్రసాదములు ఉభయములు.

ఇందుముందు శబ్దగుణములనుగూర్చి చర్చింతము.

## ఓజస్సు.

ఓజోగుణమనగా విజృంభితమగు పటుసమాసబాహుళ్యము (కా॥ సూ॥ 4 - 8). ఇదియే గద్యకావ్యమునకు జీవనమని దండి విధించియున్నాడు (ఓజఃసమాసభూయస్త్వమేతద్గద్యస్య జీవితమ్. కావ్యాదర్శము 1 - 80).

సంస్కృత శబ్దస్వభావమును బట్టియు ఆభాషాశక్తిత్వమును బట్టియు నాభాషలో సమాసబాహుళ్యమైన రచనలు (కావ్యములై సంగ్రాహశీలములై) యున్నను సమాసవిహీనములగు నితరభాషలందు కూర్పులవలెనే మనోజ్ఞ గమన యుక్తములగుచున్నవి. సంస్కృత భాషామాతకు ముద్దులపెద్దకూతురగు నాంధ్రమునందును, దండివర్ణనమునను సరించియే యనేకకవులు గద్యరచనలలో బహుళసమాస రచనాపరాయణులైరి. బోధకాలువలె మిగుల పెరిగి దిగదిగి పడి యీమహోద్గ్ర సమాస భాగమున కోలాక మనోజ్ఞాంగ్రవాణి నీరసించి శోభించినది. తన్నపార్శ్వని గద్యరచనయందు నీయోజోగుణము ప్రాయికముగా గాన్పించినను, మృదువై సంగ్రహశీలమై గంభీరమై యొప్పారుచున్నది. గాని వెగటుగదోపదు.

1. అవిరళగళిత నయనోదక బిందుసందోహపరిపీడ్యమాన పీన స్తనపరిధానాంతరంబు. సభా 2 - 312.

---

In a sense this artifice of crowding words in huge compounds minimises the etymological difficulties of a syntactical language like Sanskrit and the ideas flow with all the ease that characterises an analytical language. To a foreigner aud beginner the form is repulsive indeed; but after some practice it will be found that Sanskrit prose is not as difficult a reading............It has a charm and verve of its own....... Mr. G. Kasturi Ranga Aiyangar M.A, of Mysore in his English Introduction to Subhandu's Vasavadatta. Page 5.

సామాన్యముగా నన్నపార్యుని కృతులందు శ్లేషగుణము విశేషముగా నగుపడు చున్నది.

## సుకుమారత

శ్రుతి సుఖకర వర్ణంబులనతి కోమలమైన రచన సుకుమారత యన బరగు చున్నది. ఇదియును నన్నపార్యుని కావ్యము నందు ముఖ్యగుణమే.

1 ఆది-2-153...... కన్యకలుండ నును బుష్పాపచయంబు సేయుచు విమల నిర్ఝర విలసితంబైన యొక్క యెలయేటి కెలన నవవికచ కుసుమ సుకుమార కోరకని కరభరిత సహకార కురవక వకుళాశోక తమాలసాల చ్ఛాయా శీతల సికతాతలంబున.

2. చందనలతా భవన చంద్రకాంత వేదికయందు మంద శీతల సురభి మారుతంబు. (ఆది 8-223)

3. నామనోరథంబు సఫలంబుగా మందార మంజరీపుంజాల మకరంద పాన మత్త మధుకర గాన మనోహరస్థలంబులను మేరుశైల కందరంబులను మందపవనంబులు గల నందనాది వనంబుల యందును నితాంత కాంత వికసిత కనకారవింద సముదిత సౌరభ సంవాసిత మహానంత కందంబులైన మందాకినీ తీరమణి మయ వేదికల యందును జంద్రికా సుందరంబులైన సికతాతలంబులను ననవరత సురత కేళీ సౌఖ్యాంబుధి నోలలార్చు మనిన. (అరణ్య 1-263)

## 4 సమత

రచనయందు వాక్యమంతయు నొక్క రూపము దాల్చి యుండుట సమత యనంబడు.

## జరాసంధు సామర్థ్యము. సభా 1.157.

ఇక్కుమారుండు కుమారు వంటియ శక్తిసంపన్నుండై త్రిపురాంతకు నంతక హరుం బరమేశ్వరుం దనకు ప్రహితుం జేసి కొను నెంత బలవంతులయ్యును వైరి వీరులు వీని వాకిటి యగ్ని దాకిన శలభంబులు వోలె నడంగుదురు. గరుడుని గతి నన్య విహంగమంబులను గమింపనోపని యట్లు మానవులు వీని వీర్యంబు ననుగమింప నోపరు.

తేజస్వులలోన నాదిత్యుండు వెలుంగునట్లు వీడు మూర్ధాభిషిక్తులలో మిగిలి వెలుంగు నదీరయంబులు మహాపర్వతంబుల భేదింప నోపని యట్లు దివ్యాస్త్రంబులు వీనిదేహం భేదింప నోపవు. సముద్రంబు మహానదులం జేకొను నట్లు వీడు పరమహీపతుల సంపదలు సేకొను.

## 5 ప్రసాదము.

"అలఘు ప్రసిద్ధ పదంబుల నలఘూక్తి ప్రసాదమయ్యె"

మారుమూల పదముల చేర్చి కూర్చక భాషలోను ప్రసిద్ధ పదములను క్లిష్టార్థముగా కుండ నట్లింపుగ రచించుట ప్రసాద గుణము.

"పాండు రాజు పత మహోత్సవంబున కుంతి వలన పురుష త్రయ సమానంబులైన పుత్ర త్రయంబు వడసి భువన త్రయ రాజ్యంబు వడసినంతియు సుఖంబున సంతసిల్లి కుమారులతోడి వినోదంబు లందివిలి యున్నంత—(ఆది-5-128).

పురుషత్రయ మనగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులని ప్రసిద్ధి. వారిలోను మూడులోకముల రాజ్యాధిపత్యము లభించుట కంటె గొప్ప సంతోషము వేరొకటి యుండదు. పాండురాజు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులతో సమానులనదగు ధర్మజ భీమార్జునలంజూచి పొందిన యత్యంత సంతోషము ప్రసిద్ధ పదములలో వర్ణింపబడినది గావున ప్రసాదము.

## 6 మాధుర్యము.

సంస్కృత భాషాలంకారికుల మతముచేత మాధుర్యము ద్వివిధము.

శబ్దాశ్రయము. అర్థాశ్రయము. కావ్యము రసావహమగుటకు వీరెండును ముఖ్యములే. ఒకమారు వినబడిన శబ్దమే మరల నింపుగ వినబడుటచేత శ్రోతలమనస్సులో కానిక సంతోషమును పొందుట యనుభవ సిద్ధము. ఆశబ్దమే యొక పదం వినబడకున్నను, ఏకస్థాన జనితమైన మరియొక శబ్దము వినబడినను అట్టి సంతోషము కలుగ వచ్చును. అనగా నొక దంత్యము వెనుక నకారముగా, నాదంత్యమే గాని లేదా మరియొక దంత్యము గాని వచ్చుటచే శ్రుతిమాధుర్యము గలుగును. ఇట్లే తాలవ్య, ఓష్ఠ్యమూర్ధన్యాదులగూర్చి యెరుగునది. అవ్యవధానముగా నదే వర్ణముగాని,

సజాతీయవర్ణముగాని అనుప్రాసముగాని మరల మరల వచ్చుటచే శబ్ద మాధుర్యము. శబ్ద సముదాయ పునరావృత్తి అనుప్రాసము గాని యమకము గాని యగును. ఈశబ్ద మాధుర్యముచేనన్న పార్యు డక్షరరమ్యత యని ప్రశంసించి నాడు. మరియు రచనము నందు ద్వేగకరము లయిన గ్రామ్యాది దోషముల పరి హరించి మనోజ్ఞములగు నర్థాలంకారముల చేగాని మరియొక విధము నగాని యింపుగులైన నట్లు రచించుటచే మాధుర్యము వచ్చును. దుష్ప్రతీతి కరము లైనదుష్ట పదములను పరిహరించి, అర్థ గౌరవమును పోషించి, రమణీయార్థములైన రచనలు మాధుర్య గుణపూరిత ములు. ఇవియే నన్న పార్యుని« నానారుచి రార్థ సూక్తులు. ,,

శబ్దార్థలంకారములను గురించియు నర్థాలంకారములను గురించియు వేరొకచో విపులముగా చర్చింతము.

శబ్దార్థమాధుర్య మహిమచే మనోజ్ఞములగు నన్నపార్యుని కూర్పుల గొన్నిటినిట వ్రాసెదను.

ఆది. 6-132. విపుల మణిపీఠీవిహాపితాల కావిలాసంబు.

సభా. 2-88. నిన్నుంబాసి నిమిసంబయిన నిర్వహింప నేర నని ధర్మజుండెట్ట కేలకు గరుడ గమను గమనంబున కొడబడె.

అరణ్య. 114. తదీయ పాదతల లలిత పాలకులిశ కల శాది లక్షిణ అక్షితంబయిన పాంసు పథంబు.

ఆది. 3-172 క్షమ విడిచి సకల క్షమారక్షు కుండగు బరీక్షితు నకుంబరీక్షింపక శాపంబిచ్చి.

ఆది. 4 183. నీవు ధర్మ శీలుండ వర్థానర్థ విదుండవు సకలకార్యసమర్థుండవు గుర్వర్థంబు గవ్యార్థివై వచ్చితివి గావున కృతార్థుండ వయితి.

సభా. 1-247 బిందాను బిందుల మంద దర్పులంజేసి.

ఆది. 3-46 కపిలజటా మండల దండక మండల మండి తుండు.

అరణ్య. 1-307 అభినవ యౌవనవనచరీ పరివృతు.

ఆది. 8-85. పాంచాలుండు పాండవ మధ్యము నసుర్మధ్యము భగ్నంబుగా నొక్క బాణంబునేసెను.

6-190. దానిం బవమానమానుం డవమానపూర్వంబుగా.

## అర్థమాధుర్యము.

1. యయాతి. శర్మిష్ఠ: ఆది: 3-172, 174.

అని విచారించుచున్న సమయంబున దానిపుణ్య స్వరూపంబు సన్నిహితంబైన యట్లొక్కనాడు యయాతి యశోకవనికాలోకన తత్పరుండై వచ్చువాడే కతంబ యున్న శర్మిష్ఠంగని యది యును సంభ్రమ విన యావనత వదనయై తనవలన నమ్మహీపతి ప్రసన్న చిత్తుండగుట యెరింగి కరకమలంబులు మొగిచి ...అద్దేవయానింబరిగ్రహించి నప్పుడ తద్ధనంబనగుట నేనును భవత్పరిగ్రహంబ కావున నన్నుం గరుణించి నాకు బుతు కాలోచితంబు బ్రసాదింపవలయు ననిన.

ఇందు శర్మిష్ఠయు యాతి వలన బుత్రలాభ మభిలషించిన విధమశ్లీలాది దోషములం బరిహరించి సమార్ధవముగ వర్ణించి యర్థగౌరవమను బోషించి మాధుర్య పూరితముగా జేసెను.

2. ఊర్వశి. యర్జునుడు. అరణ్య 1-366.
నేను కర్మ భూమిని జనియించి కర్మ బుండ గాతి నాకు నిప్పటి యాచారంబు ఉచితంబు గాదు మదీయ వంశకర్తయైన పురూరవునకు బత్నినైన కారణంబునను బురందరునకు బరి చర్య యొనర్చుటను నాకు జనని వగుటకు సందియంబు లేదు.

ఇందును ఊర్వశి యింద్రునకు భోగస్త్రీయనిగాని యితర గ్రామ్యాదులగాని యుపయోగింపక సాభిప్రాయమును సగౌరమును నగు బరిచర్యయను పదము బ్రయోగించుటచే మాధుర్యము—

## 7 ఔదార్యము.

వినుత నుశబ్దార్థంబుల దనరగు నోత్కర్ష ణంబు దారత్వ మనన్ జను.
(కా॥ చూ4-80)

1. పూర్వోదాహృత మైన జరాసంధు సామర్థ్య వర్ణన మౌదార్య గుణయుక్తము. సభా-(1-157). . మరిరెండు దాహరణముల చూతము.

2. కణ్వాశ్రమము. (ఆది 4-21)...... పుణ్యనదీతీరంబున తద్దయు రమ్యంబై నరనారాయణ స్థానంబు నుంబోలె జగత్పావనంబగు చున్న కణ్వమహా మునియాశ్రమము.,, జగద్వంద్యులగు కృష్ణార్జునులు పూర్వ మొకప్పుడనేకాయుత వర్షములు తపస్సుచేసి పావనముగావించిన తపోవనము వలెనే కణ్వాశ్రమము రమ్యము పావనము ననుట చేనాదార్యము.

3 ఆది. 6-227. వేదవ్యాసుండు కోడలి (కుంతి) నూరార్చి నీకొడుకులు ధర్మ నిత్యులు. ఈయుధిష్ఠిరుండు నారాయణ భుజంబులంబోని తనవలువురు దమ్ముల బలంబున సర్వ పార్థివుల శాసించి సార్వభౌముండై రాజసూయాశ్వమేధాదిక్రతువు లునేసి.........

భీమార్జునసకుల సహదేవులు, నారాయణ భుజంబు లంబోని వారని వర్ణించుట యౌదార్యము. నారాయణుడు జగత్ప్రభువు చతుర్బాహుడు. కౌమోదకీ యనుగదను, శార్ఙ్గమనువింటిని, నందకమను ఖడ్గమును ధరించినవాడు. గదాపాణియగు భీముడు, గాండీవ ధరుడగు నర్జునుడు కృపాణపాణులగు నకులుని, సాభిప్రాయముగ వర్ణింపబడిరి.

8 కాంతి.

"విమల విచిత్రాయతవర్ణా వృత్తులు గలయతిమృదు బంధంబు కాంతి" అని నరసభూపాలీ యమునందు చెప్పబడినది. (4-66). "వెలవంక" "వనయమ్మ" కడలేక, కవురాల, అను శబ్దములు క్రమముగా నొకొక్క పాదమున మూడేసి మారులు వచ్చునట్లుగా రచింప బడిన సీస పద్యము దాహరణము గానియ్య బడినది ఇట్లు కాంతి గుణము మూర్తి కవిచేకేవల శబ్ద గుణముగా గ్రహింప బడినట్లు గన్పట్టుచున్నది. కాని దండి కృతమైన గావ్యా దర్శమనందు "కాన్తిం సర్వజగత్కాన్తం లౌకికార్థానతిక్రమాత్ । తచ్చవార్తాభిధానేషు వర్ణనాస్వపిదృశ్యతే", అనగా లౌకికార్థమును తిక్రమింపక, వర్ణనల యందును. కుశల ప్రశ్నాదుల యందును రమణీయముగ రచింపబడిన కావ్యము కాన్తి గుణయుక్తము. అత్యుక్తి మొదలగు దోషములను పరిహరించి, స్వభావోక్తులచే లలితముగ రచింపబడిన కావ్యము కాంతి గుణయుక్తము. దీని నింగ్లీషులో elegance అందురు నన్నయ కావ్యము నందుకాంతి గుణము నా

ణముగా నగుపడు చున్నది ఒక్క రచనమును పరిశీలించి యానందింతము.

ఆర 4-25-27

అదియును వసంత విలాసంబున జయంతుండి పోలెనున్న యతని దుష్యం
తుంగా నెరింగి యతి సంభ్రమంబున పాసపార్శ్వ పాద్యాది విధులంబూజించి సకలం
రిగిన వక్కాణ్యకరం జూచి దుష్యంతుండు( నేను వేటకువచ్చియిచట కణ్వమహాముని దర్
శనము చేసి పోవలెనని వచ్చితిని. వారెందరిగి రనిన పండ్లుతెచ్చుటకు వారు వన
మున కరిగిరి) వారు వచ్చునంతకు నొక్కమూ హూర్త మాత్రంబుండు మనిన విని
యొక్కమరి వినయంబునకు, మృదుమధుర వచనంబులకు సంతసిల్లి దానింగన్యకగా నెరింగి
మనోజరాజ్య లక్ష్మి యుంబోలె సర్వ లక్షణ లక్షితంబులైన దాని సర్వాంగయవంబులం
జూచి సంచలిత హృదయుండై నీవెవ్వరి కూతుర విట్టి రూప లావణ్య విలాస విభ్రమ
గుణ సుందరి వీందుల కేల వచ్చితని యడిగిన నది యిట్లనె.

సమాధి.

శ్లో,, అన్య ధర్మ స్తతో న్యత్రలోక సీమాను రోధినా।
సమ్యగా ధీయతే యత్ర ససామధిః స్మృతో యథా॥

దండి, కావ్యా దర్శము. 1. 93.

పరి యన్య గుణాంబులు మఱి వేరొక్కటి పైకలరింపసమాధి యయ్యె.
నరస భూపాలీయము. 4-69.

నిర్జీవగుణ వస్తువులకు సజీవ వస్తువుల గుణము లారోపించుచు మనోజ్ఞముగా రచింపబడిన కూర్పు సమాధి గుణభూషితము.

1. ఆరణ్య. 2-312 నష్టలజ్జా వృత్తులయిన వారిను పోలె మనంబును లక్ష్మియు విడుచు.

వరించుట త్యజించుట మొదలగు కార్యములు మానవ ధర్మములు. ఈ పద్యము నొక స్త్రీగా సూచించు చునది కొందరు మనజుల విడుచునని, మనుష్య ధర్మమారోపించి రచించుటచే సమాధి.

2. ఇట్టే, చంద్రుడు దివ్వెనికల నలంకరించెన, నిషర్షించిన రచన (ఆరణ్య 1.338) యును, వారవణా వత పురము విలాస విశేషములనలకాపురినిపహసించెనని వర్ణించిన రచనయును, రమ్య సమాధి సూక్తులు. ఇవి ఇంగ్లీషులో Personification

అను నలంకారమును బోలి, కొన్ని చోట్ల Transferred Epithet లక్షణములు కలిగి యుండును.

## అర్థవ్యక్తి. (clearness)

స్ఫురణకు దూరమైన అధ్యాహారములు అప్రతీతమే యార్థములు లేక స్పష్టమైన యర్థముతో నింపుగా రచించుట యర్థవ్యక్తి. మరియు నేసందర్భమున నే పదము ప్రయోగించిన యెడల గ్రంథకారుని మనోభిప్రాయము విస్పష్టముగ చక్కగ చదువరులకు స్ఫురించునో ఆపదము నే ఆసందర్భమున ప్రయోగించుటయు నర్థవ్యక్తి కెంతయు ముఖ్యము. ఈకావ్యగుణమును గూర్చి మొల్లతాను రచించిన రామాయణమునందీ విధమున వర్ణించినది.

గీ,, తేనె సోక నోరుతియ్యన యగురీతి। తోఁడ వర్థమెల్లఁ దోపకున్న గూఢ శబ్ద వితతి కొట్టాటపనియెల్ల। మూగచెవిటివారి ముచ్చట రయ కవిభావము పాఠకుల కక్రమముగ నింపుగ గోచరించునట్లు రచించుటయే యర్థవ్యక్తి. అస్పష్టార్థమునైన రచనలంబడుట తెన్నదోపని యాటవికయానము వంటిది. అనని మాలోచనములు కన్నులకు తగిలించుకొని చూచువారలకు దృష్టి చెడి చీకిరి బాకిరి గానుండుట వలన చీకాకు బుట్టినట్లు గుప్తభావములు, క్లిష్టాన్వయములుగల రచనలు చదువరులకు బీతి యిబ్బంపజాలక చీదర యెత్తించును. ఇచ్చటి యర్థమేమోయని తమకుతోన వలసిన దురవస్థ నన్నపార్యుని భారత పాఠకుల కెంతమాత్రము లేదు. అతనికృతులందు ప్రతిపాదితార్థము బహు స్పష్టముగ వక్రమముగ దోచుచునే యుండును. ఓజోగుణ ప్రధానములైన వర్ణనాదుల యందుపటుసమాసఘటిసాగినను అర్థవ్యక్తి గుణముమాత్రము వీడుట లేదు.

ఇట్లు ప్రాచీనాలంకారికులమతము చేత కావ్యజీవమున కాధారములైన దశ గుణములంగూర్చియు, నన్నయ విరచిత భారతము నందు వానివ్యాప్తిని గూర్చియు సంగ్రహముగా ప్రసంగించితిమి. కవిభావము పాఠకులకు సువ్యక్త మగుటకును భాషలో కావ్యమమృత సిద్ధి వడయుటకును, ముఖ్యములైనమరికొన్ని ముఖ్యాంశములు గలవు. అవికొంత వరకు పైదశగుణములలో సూచింపబడి యుండ వచ్చును. అయినను వానికిగల ప్రత్యేక వ్యక్తిత్వమును [illegible] కావ్యమ

నకు మిగుల సహకారులగు గుణరాజములు గావున వానిగూర్చి యిచట జర్చించుట యావశ్యకము.

## 1. స ర ళ త. (Simplicity).

పరుష స్వర పరుషపద భూయిష్ఠ మైన శైలి భావగ్రహణమున కెంతయు ప్రతికూలము. కఠిన శిలాకంటకమయ ప్రదేశయానము వలె మిగుల పీడాకరము. వానినేరి దీసిపారవైచినచో గమనము సుకరమైనట్లు ననాయాస సరళ రచనల చేభావగ్రహణ మశ్రమము నానంద దాయకము నగును. ఈసరళగుణము పూర్వోక్తమైన సుకుమార మాత్రమే కాదు. శ్రవణానంద దాయకములగు కోమల వర్ణములమాత్రము గలది సుకుమారత. అదియర్థముతో సంబంధములేని శబ్ద గుణము. సరళత యర్థ సంబంధముగల సౌకుమార్యము. అర్థసౌకుమార్యమును శబ్దసౌకుమార్యమును మేళగించి, తేనెలూరు మృదు మధుర పదముల గూర్చి కూర్పుటలో నన్నయ యాంధ్ర కవులలో ప్రథముఁడు నద్వితీయుఁడునై యున్నాఁడు.

## 2. ధారణానుకూలత (Impressiveness)

కవి భావములు బాగుగ గ్రహింపబడిన వనుటకు ముఖ్య నిదర్శన మాభావములు పాఠకుల మనస్సుల నంటి దృఢముగా నాటుకొని మఱుపునకు రాకయుండుట. కొన్ని చక్కని కూర్పులలోని భావములుముద్రవేసినట్లు చక్కగాపాఠకులమనస్సులందు నాటుకొని మఱుపునకురావు. మరల మరల చదుపకయే యాభావములు చదువరుల మనస్సులకు బాగుగా పట్టి విస్మృతము గాకుండ చేయగల రచనా చమత్కారము ఉత్కృష్టకవుల లక్షణము. నన్నపార్యుని కూర్పు లందీ సామర్థ్యము విశేషముగా ప్రదర్శితము.

## 3. చిత్రకళాకుశలత్వము (Picturesqueness.)

వర్ణనీయార్థము జీవకళలతో చదువరుల యెట్టయెదుట దోచునట్లును, మనోనేత్రము నెదుట మెరుపు మెరసి నట్లు ప్రత్యక్షముగ గోచరించునట్లును రచించు సామర్థ్యమే కవియొక్క చిత్రకళాకుశలత్వ మనదగి యున్నది.

ఈక్రింది రచనమున సరళత ధారాళాను కూలత, చిత్రకళా కళలత్వమును చక్కగా జూపట్టుచున్నవి.

శకుంతల వృత్తాంతము. ఆది 4-5, 46.

గీ॥ చెలగి లేవ నేడ్పు చిఱుతుక దానిక్రవ్యాద ఘోరమృగముల శకుంబుద్ధి। బట్టుకుండ చెట్టు వలగప్పి రక్షించు। కాని శకుంత తతులు గూడియుండె.

అంత నేను శిష్యగణంబుల తోడ సమిత్కుసుమ ఫలాహరణార్థంబు కక్కడ కుంజని యమ్మాలినీ పులిన తలంబున శకుంతరక్షితంబై యున్న దాని, నత్యంత కాంతి మతి, నవనీ తలంబున కవతరించిన తరుణ శశిరేఖ యుంబోని దాని నెత్తుకొని వచ్చి శకుంతరక్షితయగుటం జేసి శకుంతల యనునామంబిడి.''

ఇందు సరళతయు, ధారాళాను కూలతయు ప్రత్యక్షములు. మరియు టెన్నిసన్ (Tennyson) అను నాంగ్లో మహాకవి చెప్పినట్లు''

An infant crying in the night,
An infant crying for the light,
And with no language but a cry''

యేడ్పుతప్ప మరియొక మాటరాని నెరుగక కరచరణాదుల విదల్చి గదల్చి చాచి లేన యత్నించియు లేవ జాలక యేడ్చుచున్న చిన్నశిశు రూపమొకటి, బయలు పోవు యంత్ర సాహాయ్యము చేత నోయన్నట్లు మనమునో నేత్రములయెదుట పొడగట్టి జాలిగొల్పుచున్నది. ఆశిశువు క్రూర వన్య మృగములచే బాధింప బడకుండ చెట్టువ లగప్పి దానిరక్షించుకొను శకుంతతతులు మనమనో పీఠిం దోచు రెండవ ప్రదర్శనము. అవనితలంబున కవతరించిన తరుణ శశిరేఖ యుంబోని కాంతిమతి పక్కకుతుందెచ్చి కొని కణ్వ మహాముని పెంచుకొనుట మనకు ముఖ్యముగ గన్పట్టు మూడవ ప్రదర్శనము. ఇట్టి చమత్కార రచనల నెడి దివ్యయంత్ర సాధనముచేత భారత పాత్రములన్నియు చిరజీవులై నిజరూప చేష్టాదులగు జీవకళలతో మన యెదుట నిత్యము నృత్యము చేయుచునే యున్నవి. గీతలు గీచిరంగులు పూచి చిత్రకారుడు పటముల రచించుచున్నాడు. పదములను మాత్రము కూర్చి కావ్యకారుడు వ్యక్తులరచించుచున్నాడు

జీవకళలతో కూడిన రచనల రచించుటే యిరువురకు పరమధర్మము. అందుచే నన్నపార్యుడు సాంగోపాంగ వర్ణనలకు పక్రమింపకయే, ముఖ్యాంశములను మాత్రము ఉపసంగ్రహముగ వచించి వ్యక్తిత్వ భంగదోష మేమియులేక పాత్రములను, వస్తువులను, సునాయాసముగ నెదుట దోపింప జేయుటయందు గడు ప్రవీణుడు.

## అలంకారములు.

నన్నపార్యుని రచనలలో నలంకారములను గూర్చి సందర్భవశమున వచ్చుటచ్చుట నొకింత ప్రసంగించి యుంటిమి. ఇప్పుడావిషయమును గూర్చి వివరముగా మరికొంత చర్చింతము.

"అలంకారములు భాషకు నగలవంటివి. నగలు శరీర శోభ నెట్లు హెచ్చించునో యలంకారములు కావ్యశోభనట్లు హెచ్చించును."

అలంకారములు భాషతో గూడ పుట్టిన వచ్చును వినువారికి దివ్యముగ నుండు నిమిత్తమును చక్కగ బోధయగుని మిత్తమును అలంకారయుక్తమైన భాష మాటలాడుట మానవ స్వభావము. నిండు వెన్నెల కాయుచున్నదని చెప్పుటకు మారుగ పిండి యారబోసి నట్లు వెన్నెల కాయుచున్నదనియు, "ఆమె మిక్కిలి చక్కని దనుటకు "ఆమె రంభయనియు, వాడు శూరుడనుటకు వాడు సింహపు బిల్లయనియు, కార్యము సకాలము నందు చేయక ప్రయోజనము పోయిన తరువాత చేసెననుటకు "దొంగలు పడిన ఆరు నెలలకు కుక్కలు మొరిగెను" అనియు నీవిధము గనిత్య వ్యవహారము నందు చెప్పెదము. మనసులోని భావము త్యధిక మైనప్పుడు అలంకారిక భాష వెలువడును. ఇందుకు మన భాషలోని కొన్ని తిట్లు నిదర్శనములు. నీకడుపుకాల, నీదుంప తెగ ఇత్యాదులు వక్తయొక్క కోపోద్రేకమును చూపును కావున వ్యాకరణ శాస్త్రము పుట్టుకు పూర్వమే భాషా ప్రపంచ మెట్లభివృద్ధి చెందునో, అట్లే అలంకార శాస్త్రము పుట్టుటకు పూర్వమే. చాలకాలము పూర్వమే భాషలో పామర జనవ్యవహారము లందును అలంకారము లేర్పడును.

ఇక సంస్కృత వాఙ్మయము జూచిన ఋగ్వేదమునందు పెక్కలంకారములు గలవర్ణనలు గలవు. మహాభారత రామాయణములు కావ్యములే గనుక వానియందు పెక్కలంకారములు గలవని వేరుగా చెప్పనక్కర లేదు. 1. సంస్కృత వాఙ్మయము వృద్ధి నొందిన కొలది యందలి యలంకారముల సంఖ్య హెచ్చుచు వచ్చెను. ఆంధ్ర వాఙ్మయము సంస్కృత వాఙ్మయ ప్రాబల్యపరిపూరితము. సంస్కృతము ననున్న యలంకారము లన్నియు నింకా మించుగా నాంధ్రమున గలవు. ఈ యలంకారములు శబ్దాలంకారములు నర్థాలంకారములని రెండు విధములు. అర్థచమత్కారము లేని కేవల శబ్దచమత్కారములను కూర్చి పండితరాయలను జగన్నాథ పండితుడు రసగంగాధరమున నిట్లు వ్రాసియున్నాడు (2) "ఎందు సామాన్యముగా నర్థచమత్కారము శూన్యమై కేవలము శబ్దచమత్కృతి యుండునో దానిని అధమాధమకావ్య మనిచెప్పుట యుచితము. ఏకాక్షరపద్యములు అర్థావృత్తి యమకములు పద్మబంధాదికము లిట్టివి. కాని ప్రాచీన పరంపరను సరించి కొందరు మహాకవులు వీనిని తమకావ్యములలో నచ్చటచ్చట ప్రయోగించినను, కావ్యలక్షణమైన రమణీయార్థ ప్రతిపాదకత్వము వీనియందు లేనందున వీనిని మేముకావ్యముగ నెంచనే లేదు.''

కావున శబ్దార్థాలంకారములలో అర్థాలంకారము శ్రేష్ఠములు. అర్థచమత్కారము లేని కేవల శబ్దాలంకారములు కావ్యమన్న పేరునకు గూడ తగవని యీ యలంకార సాంప్రదాయము వారిమతము. ఇది సరియైన యభిప్రాయము కాదని యెవరు చెప్పగలరు

“సారమతింగవీంద్రులు ప్రసన్న కథా కవితార్థయుక్తిలో।

నారసి మేలునా నితరు లక్షర రమ్యత నాదరింప ''నానారుచిరార్థ సూక్తినిధి నన్నయ భట్టు మహాభారత సంహితా రచన బంధురుడయ్యెగావున నా కావ్యమునందు అర్థాలంకారములు, శబ్దాలంకారములు బహు విశేషముగా కలవు. గాని యర్థమును శో

---

1. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము. మ,, కొం,, వెం,, లక్ష్మణరావు గారు. సం.3. పుట౧౫౫౪

2 . ,, ,, ,, ,, ,, ,, ,,౧౫౬౬.

షింభకేశి కావ్యమును నీరసము పాలుచేసెడి యక్షర రమ్యత యనఁగా ప్రశస్తమైన శబ్దాలంకార రచన లాతని కవనమున లేవు. కొన్ని శబ్దాలంకారముల పరిశీలింతము.

## ఛేకానుప్రాసము.

ఛేకులనగా విదగ్ధులు. నేర్పరులు. వారికిష్టమైనది గావున దీనికీ పేరు వచ్చెనట. ఎడలేక రెండు రెండ క్షరంబు లెనయు నియమంబు ఛేక మూనెల్లనన్న (నరసభూపాలీయము. 4-74)

1. దమయంతి యంతి కము. (అరణ్య 2-18).
2. అప్పటులంబట్టికొని సవకట్టి కట్టిన ప్రట్టంబు. (అరణ్య 2-66).
3. అభినవ యౌవన వన చరీనిచర చాపల్యతుడు. (అరణ్య 1-307).
4 మధ్యందిన దినకర మూర్తి. (విరా 7-107).
5 అవమానజనిత కోప ఘూర్ణమాన మానసుండు. (ఆది. 5-205).
6 విలకిల్ల నంతి వంతయు వివిధీయుండు (అరణ్య 2-220)
7 వినోదాగాసలంబునం గంది గంద మూలఫలంబు. (అరణ్య 2-120).
8. చతుర్వర్గ వర్గాను బంధ బంధుర కథేతిహాసంబు. (ఆది. 1-30).

## వృత్త్యనుప్రాసము.

ఒక హల్లుగాని పెక్కు హల్లులుగాని రెండు సారులు కంటె నెక్కుడు పర్యాయము లుచ్చరింపబడెనేని వృత్త్యను ప్రాసము.

అరణ్య 1.286. స్నేహాలాల పజిలో లాపాంగవి లోకనంబులు.

ఆది. 4-142 . అనిలాలోల కల్లోల మాలాస్ఫాలన...

సభా 1-194. పటాపటుత్పాటనకు పితకుంజరి చైరియుంబోలెగడు నిరిగి విటుపటిల భ్రుకుటికల నిటలుండగుచు.

ఇంగ్లీషు భాషలో 'alliteration' అనబడువృత్త్యనుప్రాసభేదము నందు పదాది వర్ణము పునరావృత్తి యగుచుండినట్లే శ్రుతిసామ్య మనబడు వృత్త్యను ప్రాసమునందును పదాది వర్ణము మరల మరల వచ్చునట్లు రచించుట యందు నన్నయకు ప్రీతి యత్యధికము. ఆ శ్రుతి సామ్యమునందును. పదము లెరువు తెచ్చి క్కిరించినట్లుండవు. రచనా గమనికతో సహజముగా పొందు పొసగి, మనోజ్ఞము లై యుండును.

1 మారుత మార్గాద మరచి గోచరంబుగాని గహనంబు. ఆది 6-170.

2 గజ సన్నద్ధుండై గవితవయుండు రంగ మధ్యంబున కరుదెంచి

3 సమర సన్నద్ధుండై పాల్యుండు సను దెంచి ఆది 4-87.

4. కుమార కుమారుండు క్రీడార్థంబు వచ్చి ప్రమ్మ చుండ ఆది 1-88.

5 వసువులు వశిష్ఠుని వరు శాపంబున వసుమతింబుట్ట వచ్చుచు. ఆది 4-152.

6 విరహతాప విభూషణ [illegible] వికేశ విశేషనంబులు విస్తరిల్లుటవివి. అరణ్య 2 220

7. మహాశ సర్ణ పుటికలంబట్టుకొని పరీక్షితు పాలికిం జనియుండని వంచిన అ 3.194

8. సర్వసత్ర సదనంబునకుం జను దెంచి స్వదేహకాంతి సభాంతరం బెల్ల వెలుంగ స్వస్తి వచన పూర్వకంబుగా నిట్లని స్తుతించె. ఆది 3-28?,

9. అఖిల జలధి వేలావలయ వలయిత వసుమతీ వనితా విభూషణం బైన వేంగీ దేశము. ఆది. 1-8.

10. పరాక్రమ పరాఙ్ముఖు లైన పాండవులు నాపరిభవంబు సెట్లు దలిగెదరని బాష్ప ధారాస్నపిత పయోధరయయి పాణిపల్లవంబుల నయన సమ్మార్జనం చేయుచున్న పాంచాలిం జూచి పద్మనాభుండిట్లను. అరణ్య 1 140.

11. శిబిర సన్నివేశంబు సేసి నిత్యంబు నుపద్రవంబు సేయుచున్న సహింపక సమర సంరంభమున సర్వాయుధ సన్నద్ధులయి అరణ్య 1.153.

కొన్ని రచనలలో రెండు, మూడు వర్ణాల శ్రుతి సామ్యమును గలదు.

1. అరణ్య 3.207: విజనం బైనవి పినంబు నందు నలసి నిద్రవోయెడి దాని నబల పతి సాధ్వివను వ్రత నగ్ని సన్నిధి బాణిగ్రహణవిధి లబ్ధయైన దానింబాసినలు నట్లొరులు నిర్దయు లైచరిగిన వారు లేరు. ఇందు, వకార, నకార శ్రుతిసామ్య గలదు.

2. అరణ్య 1 363.

మందారమంజరీమంజుల మకరంద పానమత్త మధుకర గాన మనోహర స్థలంబులను, మేరుశైలకందరంబులను, మంద పవనంబులుగల నందనాది వనంబులను. సవధి కసౌరభ సంవాసిత మహానంద కందంబులైన మందాకినీతీరమణీయవేదికలు. ఇం దును, న్ద, స, శ్రుతిసామ్యము గమనీయము.

3. ఆది. 5 139. ఇట్లు సర్వభూత సమ్మోహనంబయిన వసంత సమయంబున పాండురాజు మదన సమ్మోహన మార్గణ విదళిత హృదయుండై మాద్రి జతు ప్రతిమయిన మనోహరాకృతియందు మనంబు నిలిపి యున్నంత కుంతి... మాద్రి దరికేగిన యుండేమదియున్న యవసరంబున.

కొన్ని రచనలలో శ్రుతిసామ్యము నందు, మరలమరల వచ్చు హల్లు లేకైక స్థానజనితములైన హల్లులును గనబడుచున్నవి

ఆది 6.98. అస్త్రను ప్రహరణ ప్రవీణతకు పరమ హర్షాలపరాఙ్ముఖోత్సాహిత ప రాక్రమంబునకు దనవల నిభక్తి స్నేహంబునకు మెచ్చి భీద్రోణుండు బ్రహ్మశిరంబను దివ్య బాణంబు సప్రయోగ నివర్తనంబుగా నిచ్చె.

ఇందు పవర్గమేదు సారులగు పడినది. అవెనుకనే సజాతీయములగు, భ, బ, వ, అను వర్ణములగు పడుచున్నవి.

అరణ్య. 1.38. దుర్యోధనాదుల దుస్సహతాపంబు బొందు దరసిద హృదయుం డైన ధృతరాష్ట్రుండు.

యమకము

సర్వవ్యంజనసము దాయపౌనరుక్త్యము యమకము. ఇందధమము మూ డక్షరములైన నుండవలెను. అచ్చులను హల్లులను కూడ నొకతూరివచ్చిన వేమరల మరల రావలయును. ఒకే పదము వచ్చిన యెడల భిన్నార్థములలో రావలయును. ఒక పదములోని భాగములై యర్థము లేని యక్షరములైనను యమక మగును

1. వికర్ణుండన్యాయ శ్రవణ వికర్ణుండయి (సభా. 2.25.

2. బదరీ వనంబున వసనంబు (అరణ్య 1.127.

3 ప్రజాత్మజు కారణంబయిన రణంబగు (సభా 1.192.

4. స్వర్గలోకంబు నిరయలోకంబు గావించి (ఆది 2.93.

5. హిడింబిని పవమాన సూనుండవమాన పూర్వకంబుగా (ఆ॥ 6.190.

## మరికొన్ని శబ్దవైచిత్ర్యములు

సజాతీయములు, సాభిప్రాయములు, సతిలలితములు నైన యను ప్రాసరచన యందు నన్నపార్యునికి ప్రీతి యత్యధికము.

## సజాతీయాను ప్రాసములు.

ఆది. 5.125. కర్ణుండంశుమంతు వంశంబున కానీనుండై పుట్టె.

ఆది. 6.215. చిత్రవధంజూచి చిత్రీయమాణ చిత్తులైరి.

ఆది. 8.17. ఇలికి యంతఃపురంబునకుంబోయి యంతఃసంతాపం బేర్పడ కుండ.

అరణ్య 1.17. ధార్తరాష్ట్రులరాష్ట్రము.

అరణ్య 1.127. నిఖిలలోక చైత్రుండవయి చైత్రరథంబున తపంబు సేసి.

ఆది. 4.238 అనిశ పయోధర పయోధారలు.

ఆది. 6.300. సురహస్తిహస్తాను కారంబులయిన సవ్యహస్తదక్షిణ కరంబులు

## సాభిప్రాయార్థములగు పదములయను ప్రాసములు.

1. నాకపతి యమ్మహీపతి యకాని యొరులజూడ లెల్లనని యప్పరమ సతివ్రత పర పురుష సందర్శనంబు పరిహరించి పతికను కూలంబుగా నేత్రపట్టంబు గట్టికొనె. (గాంధారి. ఆది. 5.12).

2. భీముండు వజ్రకాయుండు. వజ్రధరుండైన నోర్వ నోపు (6.337.

3. అఖిలలోక హితులరు గావున పాండవులు పురోహిత రహితులరై యుండ దగదు (7.78.

4. మానవ పతి మానహీనుండై మహీతలంబున బడి (7.78)

5. అధిక తపశ్శక్తి యుక్తు శక్తి మహామునింగని. (7.111)

6. (పూర్వ జన్మంబున ద్రౌపది) పతిం గోరి పశుపతి నుద్దేశించి యుగ్రతపంబు చేయుచున్న. (7-258

7. అమరపతి పురోగములైన యమరు లెల్లనమరాపగా సమీపమున. (7.269.
8. అమర కన్యలతి హర్షంబున నమరేంద్రనందను జీవించి చనిరి (8-163.
9. పౌరజను లెల్ల పౌరవకులనందను లైన పాండునందనుల (8-64.
10. బ్రహ్మణ్యుండై బ్రహోత్తరంబుగా బ్రజాపాలనంబు సేసి (అరణ్య 2.7.
11. లోక పాలురు భూలోకంబు నగల రాజలోకంబు నవలోకించుచు (2-54.
12. వృద్ధశ్రవుండు వృద్ధ విప్రరూపంబున (3-257.
13. అక్రమలంబు దెచ్చిన గాడ్పున కభిముండై గాడ్పు పట్టి (3-311- ఆది-
14. వాయు నందనుండు వాయువేగంబున నరిగి-(6-170-

## లలిత రచనముగల యనుప్రాసములు.

1. భీష్ముండు తనరథంబు నివర్తింపించి సంవర్త సమయ సమవర్తియుం బోలెన తీవ్రాకారుండై (ఆది-4-203

2. పాండవులకెల్ల నపాయంబు సేయ నుపాయంబు (ఆది 5-179.
3. నీయభి ప్రాయంబునకు నిరపాయంబైన యుపాయంబు (అరణ్య 2-57-
4. అవమాన జనిత కోపఘూర్ణమాన మానసుండు (5-205-
5. వతుశ్చాల విశాలంబుగా. (ఆది. 6-138-
6. సమీరణనుతుండు సమీపంబున (6-234-
7. అపకార వ్యతిక్రమంబున కుపక్రమించి (సభా 2 66-
8. విచిత్ర్యుండను వాడ చింత్య విక్రమంబున (అరణ్య 1-160-
9. వరుణ రూపంబున నొక్క తరుణితో జాదంబు (ఆది 7-270-
10. మాతకుల ప్రసూత. (3-41-

11. చక్రధరుండఖిల రాజచక్రంబు. (సభా 2-64.

12. అంతకు మందర భీమసేనుండంత కూడుంగుడిచి యవంత బలుండై యంత్యకాలాంత కుండు బోలెమల్లసఅచి (ఆది-292.

13. జగత్త్రయభుజ వీర్య సనాథులైన నాథులు గలిగియు ననాథయుంబోలె పాంచాలరాజ పుత్రి భయార్తయై యార్త జనశరణ్యు జగన్నాథు... (సభ 2-220.

## సంఖ్యాత్మకములు.

ఏదేని సంఖ్యా విశేషనామముల గూర్చి ప్రస్తావించినపుడు తత్సంఖ్యాత్మకము లేయగు మరి కొన్ని విశేష్యముల నెక్కుడంటి వర్ణించి రచించుట నన్నపార్యుని పద్ధతియైనట్లు గనబడుచున్నది. పాండురాజునకు ధర్మజభీమార్జునులను మువ్వురు కొడుకులు గలిగిరని వచించినపుడా పుత్రత్రయమును పురుషత్రయముతో బోల్చి, భువనత్రయ రాజ్యలక్ష్మి చేకూరినట్లాతడు సంతసించెనని వర్ణించిన విషయము వేరొకచో ప్రకటించితిమి ఆట్టివి మరిరెండిటను దాహరింతము.

కుంతి సూర్యునితో నిట్లనుచున్నది (ఆది-5-21:—

అజ్ఞానంబుననిన్ను త్రిలోకైక దీపకు, త్రిపురుషమూర్తి, త్రివేదమయు రావించిన యపరాధంబు సహింపుము..

మరియు నాది 1-30. రచన యందు చతుస్సంఖ్యాప్రాచుర్యము గమనింపుము. " కృష్ణద్వైపాయనుండను బ్రహ్మఋషి తొల్లివేదంబు లేకీభూతంబులై యేర్పడకున్న ఋగ్యజుస్సామాథర్వణంబులు గావిభాగించి తనశిష్యులైన పైలవైశంపాయన సుమంత జైమినులంబంచి క్రమంబున జతుర్వేద సూత్రంబులు జేయించి వేదవ్యాసుండై...జతుర్వేద వేదాంతాభిప్రాయంబులును, జతుర్వర్గ వర్గానుబంధబంధుర కథేతిహాసంబులును, జతుర్యుగ ప్రసిద్ధమహర్షిరాజర్షి వంశాను చరితంబులును చతుర్వర్ణాశ్రమధర్మక్రమంబులును, జతుర్ముఖప్రముఖాఖిలసురమునిపూజితుండైన శ్రీకృష్ణునిమాహాత్మ్యంబును,

రామాయణము సుందర కాండ యందు హనుమంతుడు సీతకు శ్రీరాముని వర్ణించి చెప్పుచో నిట్టి సంఖ్యాత్మకరచనలు విశేషముగా గలవు.

మరియు ఆది 2-43 గరుడుడు

ఒకనాడు సప్తమారుతజ వంబున సప్తాశ్వ మాండలంబు దాక సెగసి

## అర్థాలంకారములు

కవి యొక్క మేధా సంపత్తియు, కళా దక్షత్వమును, కవిత్వనైపుణి యు నర్థాలంకార రచనలలో విశేషముగ ప్రదర్శింప బడును. కావ్యమునకు శాశ్వత ప్రారభమును రసపుష్టియు ప్రసాదించుట కీయలంకారములు ముఖ్య సాధనములు చమత్కారములు మనోహరములు నైన యర్థాలంకాము లనేకములు నన్నయ రచనల లో విశేషముగా గలవు. అందుగొన్నింటివిసందర్భాను సారముగా నీవరకే పేర్కొని ప్రకటించి యుంటిమి మరి గొన్నింటినీదిగువ వివరించి వానిసొగసును చొక్కును ఱచిచూచి యుల్ల సిల్లుదము.

## ఉపమాలంకారము

ఉపమాలంకార మర్థాలంకారము లన్నిటిలో ప్రథమగణ్యము. ఈయలంకార లక్షణము పలువురు పలువిధముల చెప్పియున్నారు గానివానియన్నిటిలోమమ్మటుడు చెప్పిన 'సాధర్మ్యము పమాభేదే' అను చిన్నలక్షణమేమి గుల సొంపుగా నున్నది. భేదముగల వానికి సాధర్మ్యము చెప్పుటయే యుపమాలంకారము. దాని ప్రయోజనములు మూడు 1 స్తుతి. 2. నింద.3. తత్త్వబోధ.

నన్నయ యుపమానములు గొన్ని ప్రాచీన పౌరాణికగాథల నుండి గ్రహింప బడినవి. కొన్ని ప్రకృతి చర్యల నుండియు, కొన్ని జీవవ్యాపారముల నుండియు గైకొనబడినవి. ప్రాచీనగాథల యుపమానమును వాని పరిచయము లేని వారికి బోధ పడవు. అవియర్థవ్యక్తి గుణమునకు సాధారణముగా ప్రతి కూలములయి యుండును. అయినను ఉపమానార్థము నన్నయ ప్రయోగించెడు ప్రాచీనగాథలు సాధా

రణముగా తెలుఁగు వారి కందరకును తెలిసిన విషయములే యగును. ఇట్టివి రెండు మూడు రచనల బరిశీలింతము. (ఆది 5 74) ద్రోణగురు దక్షిణార్థము ద్రుపదుని బట్ట నరిగిన కురుకుమారులకును పాంచాలురకును జరిగిన యుద్ధమిట్లు వర్ణింప బడినది. “ఇట్లు పాంచాలు బాణవృష్టికి నిలువ నోపక, కురు కుమారులు కుమార శరనిహితను తారకుమారులుం బోలె వెఱచఱచి పరచిరి”– రుద్రపుత్రుడును, దేవసేనానియు నగు షడాననుని విజృంభణమున కోర్వక తారకాసుర సైన్యమునగల రాక్షస కుమారులు పరుగులెత్తి పోయినట్లు కౌరవులు ద్రుపదుని పరాక్రమమున కోర్వక పరుగెత్తిరి. సమస్త పురాణ ప్రసిద్ధమును సకలాంధ్ర జనవిదితమును నైన కుమారస్వామి చరిత్ర లెస్సగా నెరిగిన నన్నపార్యుడు కురుకుమార శబ్దాంతర్గతమగు కుమార శబ్ద సూచనచే మహాసేనుని పరాక్రమము స్ఫురణకు వచ్చుటం జేసి యీ యుపమాన మునిట గూర్చి నాడు.

ఇట్లే తనసోదరుల వివాహార్థము కాశిరాజ కుమార్తెలందే నరగిన భీష్మునకును, స్వయంవ రార్థమచటి కేగిన రాజులకును జరిగిన సమర వర్ణన సందర్భమున, (ఆది-4-200) నిట్లు వర్ణింపబడినది.

ఇట్లు నిఖిలక్షత్రియక్షయార్థంబలిగిన పరశురాముండునుం బోలె గడు నలిగి పరశురామ శిష్యుండా క్షత్రియ వర్గంబు నెల్ల దన శరధారా వర్షంబున ముంచి యొడిచె.

భీష్ముడు పరశురాముని శిష్యుడు. పరశురాముడు క్షత్రియుల నెల్లమారి మసగిన విషయము పురాణ ప్రసిద్ధము. తోడిక్షత్రియులతో బోరాడు భీష్ముడు తనగురువువలెనే క్షత్రియ సంహర్తా సకుడై యలిగెనని యుపమానము.

మరి యొక్కటి. లాక్షాగృహదహనానంతరమున వనవాస పరిశ్రాంతు లయిన కుంతికిని పాండవులకును వేదవ్యాసుండు ప్రత్యక్షమై యూరార్చుచు యుధిష్ఠిరుని సోదర చతుష్టయమును నారాయణుని చతుర్భుజములతో బోల్చిన వృత్తాంతము వేరొకచోట చర్చించితిమి.

ఈసందర్భమున నొక్క సంగతి మాత్రము చెప్పవలసి యున్నది. మిల్టను (Milton) మొదలగు నాంగ్లేయ మహాకవుల కృతులందు ప్రాయికముగా గాన్పించెడి

ప్రాచీన గాథల సంపర్కముగల యుపమానల కంటె నన్నపార్యుని యీయుపమానములు సందర్భ శుద్ధియందును, అర్థవ్యక్తియందును చాల మేలయిన వనియిచ్చట గ్రహింపవలయును.

ఇక ప్రకృత్యంశముల నుండియు మానవ జీవిత వ్యాపారముల నుండియు గైకొన బడిన యుపమానముల గూర్చి ప్రసంగింప వలయును

1. కుమారాస్త్రవిద్యా సందర్శనకథ (ఆది-6-8) ఇందు ద్రోణాశ్వత్థా మలిట్లు వర్ణింప బడిరి.—"అట్టి యవసరంబున నాచార్యుండు శుక్లాంబరాభరణ... శోభితుండు రంగమధ్యంబున నశ్వత్థామసహితుండై విముక్తజలధర వియన్మధ్యంబున నంగారక సహితుండైన యాదిత్యుండు నుంబోలెనున్న .

మేఘరహితమైన యాకాశమధ్యమున నంగారకగ్రహయుక్తుడైన సూర్యునట్లు అశ్వత్థామ సహితుడైన ద్రోణుడు రంగ స్థలమున వెలుగుచున్నాడు. ద్రోణుడు సూర్యునితోను, అశ్వత్థామ సూర్యకుటుంబమున పిన్న వాడును తేజోధికుడునగు నంగారకునితోను బోల్చబడిరి. శౌర్యఘనులయిన ద్రోణాశ్వత్థామలు తేజోధికులగు సూర్యాంగారక సదృశులనుటచే మనోహరమగు వాక్యార్థోపమ.

2. నలచరిత్ర. ఆది. 2-114-116. ఇట్లు దుఃఖించుచు దమయంతి... చేదిపురంబు సొచ్చి జన సంకులంబైన రాజమార్గంబు దరియ వచ్చుచున్నదాని, దినకర ప్రభాపటల ధూసరిత ప్రభాత చంద్రరేఖ యుంబోలె దీప్తివిహీనయయ్యును రమ్యాకృతియైనదాని ప్రాసాద తలగతయైన రాజ మాత దవ్వులంగని తన దాదికి చూపి అక్కోమలియందు నాకతి స్నేహంబ యునది దానిం దోడ్కొని రమ్మనెను.

ఇందు గమనింప వలసిన విశేషములు రెండు గలవు. కాలవైపరీత్యముచేత ప్రభదరిగి డస్సియు రమ్యాకృతి యైన దమయంతిని ప్రభాత సమయ చంద్రరేఖతో బోల్చుట యొకటి. ఇది బహు మనోజ్ఞమైన యుపమానము. రెండవది కన్నెరిగింప కున్నను కడు పెరిగించునను లోకోక్తి ప్రకారము ప్రాసాద తలగత యైన రాజమాత యామార్గమున బోవుచున్న వనిత తనయక్క కూతురగు దమయంతి యని

యెరుగకున్నను ఆమె యపార నిర్వ్యాజకరుణ వహించి తనయొద్దకు బిలిపించుకొనుట.

ఈరెండు పమానములలో మొదటి దానియందు సంస్కృతమూల మున ద్రోణుడు చంద్రునితోను, అశ్వత్థామ యంగారకునితోను బోల్పబడిరి. నన్నపార్యుడా యుపమానమును మార్చి ద్రోణుని సూర్యునితో బోల్చెను. ప్రతాపఘనుడగు నస్త్రగురుని శీతాంశుడగు చంద్రునితో బోల్చుట కంటె చండకరుడగు సూర్యునితో బోల్చుట మిగుల సమంజసము. మరియు రెండవ యుపమానము సంస్కృత మూలమున లేనేలేదు. మూలమునందున్న వానికి వన్నె దెచ్చి రమ్యతరముగా జేసియు, మూలమున లేని మనోజ్ఞ సాదృశ్యములను క్రొత్తగ జేర్చి కావ్యప్రాశస్త్యము మిగుల నతిశయింప జేసియు, నాంధ్ర మహాభారత గ్రంథ రత్నము రచించిన నన్నపార్యుడు కేవల భాషాంతరపరివర్తకుడు గాడనియు, సంస్కృత భారతంబను మేలిమి బంగరు గైకొని దాని నాంధ్ర భారతమను దివ్య స్వర్ణ కమలము రచించిన నపార కళాకుశలుడగు కవి సింహుడనియు నిరూపింపదగి యున్నది

3. " అంబుదాగమనము పేక్షించు చాతకము నట్లు మన మందరము గ్నా గమనంబు ప్రతీక్షించు చున్నాము. (అరణ్య 2-289) దివ్యాస్త్రలాభము కొఱకర్జునుండు దేవలోకమున కంగి చాలకాలము వఱకు రాకపోగా ధర్మరాజు చెప్పిన వచనము. వానకోయిలమే ఘోదయము నిమిత్త మాతురముతో నెదురుచూచు చుండుట సుప్రసిద్ధ విషయము. ప్రకృతిలో వస్తువుల యన్యోన్య సంబంధము సూచించు చున్నది.

4. నల దమయంతుల పునస్సమాగము. (అర. -2-220).

ఇట్లు సంగతులైన యయ్యిరువురకు విరహాపరితాపంబు తోడ శరీర మలినత్వంబు వాసె పరస్పరానురాగంబు తోడనవిభూషణశ్రీ విశేషంబులు విలసిల్లెనంత నంతయు వినిభీముండు జాతసస్యయైన వసుధతోయ సంప్రాప్తి నాప్యాయిత యైనట్ల జ్ఞాతచర్యుండైన బతింబడసి పరమ సంతుష్ట హృదయుండై చంద్రుతోగూడిన రోహిణియుంబోలె బతింగూడి యొప్పచున్న దమయంతింజూచి సంతసిల్లి తన పురంబు నందప్ప శోభనంబులు సేయించె......

5 కృష్ణ- (అరణ్య 1-78), మఱియు దృష్టాకురుంజర్ధిలో భయంబున గోట రక్షంబై న యనలంబునంజేసి దగ్ధంబగు వృక్షంబు నుంబోలె వినాశంబు నొందు నక్షాన క్షుంబై న వాడు శుభంబులు వడయ నోపండు మృత్యువు వలనం బ్రాణాలకు భయంబు గల యట్లర్థ వంతులకు రాజ చోర స్వజన జలాగ్నంబుల వలన భయంబు నిరంతరంబు.

6. అర్జునుడు కిరాత వేషధారి యగు నీశ్వరునితో ద్వంద్వ యుద్ధము చేయుచు (అరణ్య 1-313) . "నాయేసినయు పారదుర్వార నారాచంబుల విసికి యందు ప్రయుక్తంబులయిన సుభాషితంబులుంబోలె రిత్తయైన యవి" అనుకొనెను.

7. ధృతరాష్ట్రుని విడిచి పాండవుల యొద్ద కరిగిన విదురుడు చెప్పినది. అరణ్య 1 58-60.

వినుభయ పక్షంబుల వారికి లోకంబునకు లగ్గగు హితంబయిన తెరంగు చెప్పినవది సర్వజన రుచికరంబైన యాహారంబు రోగాతురున కరుచికరంబైనట్లు యతనికి యరుచికరంబయ్యె దానంజేసి ధృతరాష్ట్రుడు నన్నొల్లక యెగ్గులు పలికి బొమ్మనిన వచ్చితి. రూపలావణ్యవతియైన వృద్ధ శ్రోత్రియుని చేతంబరిణీతయైన తరుణి యుంబోలె రాజ్యలక్ష్మి యద్దురాత్ము నందు విరక్తి యకా నిప్రీతి బుట్టింపదు-

రోగాతురున కన్న మరుచి. అన్నద్వేషము కీడునూచించు. విదురుని ధర్మోపదేశము నచ్చుటకు ధృతరాష్ట్రుని కరుచి యయ్యెను. తదుపదేశ విద్వేషము కౌరవ వినాశ హేతువయ్యెను. మరియు వృద్ధుడును స్థిరబుద్ధి లేని మందమతియు నైన ధృతరాష్ట్రుని యందు రాజ్యలక్ష్మికి విరక్తి కలిగెను. ఎట్లనగ వృద్ధశ్రోత్రియునిచే పరిణీతయైన తరుణి విరక్తి యట్లే. వృద్ధ స్యతరుణీ విషమ్. అని చెప్పుదురు. అందులో వృద్ధుడైన శ్రోత్రియుడగుటచే మరియు విష మించినది. బుద్ధి మాంద్య జనితో న్మాదుల్ గద్యాశ్రోత్రియుల్ అల్లసాని పెద్ద నామాత్యుని వచనము.

ఇవ్విధమున సాంఘికాది జీవ విషయముల నుండి సముచితోపమానము లనేకములు సంగ్రహించి రాజలక్ష్మికి క్కారవల యందు గల శిరక్తి భావమును కవి చక్కగా విశదము చేసి యున్నాడు. రాజకార్య ధురంధరుడగు విదురుడీ యర్థము నారంభము నందే మరియొక విధమున సూచించెను.

8 సభ 2-·05- జూదంబున నెగ్గు పుట్టు దీనవర్త్యేదు ఫలంబు వేణుఫలంబు నుం బోలె సహామూల వినాశంబునకు నిమిత్తంబగు శ్లో॥ అలీవలీకర్కట వేణురంభా వినాశ కాలే ఫలము ద్భవంతి॥ అను న్యాయము దాహరింపబడినది

కొన్ని సందర్భముల యందొకదానికి యనేకములతో తృప్తిచెందక యుపమానశ్రేయమును గూర్చుట దమయంతి వర్ణన సందర్భమున చూచియున్నాము. ఇంకను గొన్నింటిని జూతము.

అగస్త్యచరిత్రము— (అరణ్య 2-326.

అయ్యగస్త్యుండు తనతపశ్శక్తిం జేసి పుత్రకాముండైన విదర్భరాజున కొక్క కూతుం బుట్టించిన నదిలో పాముద్రయను నామంబుతో 1. జలంబులందు నళిని యుంబోలె (2) వినీతునందు లక్ష్మియుంబోలె (3) నదృష్టునందు విద్యయుంబోలె పెరిగి యౌవనంబు దాల్చి రూపవతియై ,,

క్రమముగా వృద్ధి వికాసములు గాంచు విషయము బోధింప మూడు నుపమానముల పేర్కొని లోపాముద్ర కన్యాదినదిన ప్రవర్ధమానమగుటను వర్ణించి యున్నాడు ప్రతిపాదితాంశమునకు మూడుపమానముల పేర్కొనుటలో తిక్కన సోమయాజి నన్నపార్యుని విశేషముగా ననుకరించుచుండును.

మరియు వర్ణన సందర్భమున ప్రతిపాదిత విషయమునకు సంబంధించెడి వివిధాంశములను నిర్వచించుటకు వేర్వేరుపమానముల కూర్చుచు వర్ణన మంతయు నట్టి యుపమాన పరంపరచేతనే గావించి ముగించుట జరాసంధ సామర్థ్య వర్ణనా సందర్భమున చూచి యుంటిమి (సభా 1-157-

## రూపకాలంకారము.

ఉపమేయము నొకప్పి పుచ్చక దాని యందు నుపమానము నారోపించుట రూపకాలంకారము.

1. చంద్రుఁడుదయించి సాంద్ర చంద్రికావిలాసంబున దిగ్వనితల నలంకరించుచుండె— (అరణ్య 1-559) స్త్రీలతో పోల్ప దగిన దిక్కులను స్త్రీ లేయనుట శేత రూపకము.

2. నీయుపేక్షా నిర్ఘాతంబు కౌరవ పరిక్షయంబునకు గారణంబు. (అరణ్య 1-388). ఈరెండును నిరవయవ రూపకములు.

3. అంతనతిప్రౌఢి తుండైన యకర్ణంబాచి భ్రాతృ పద్మవన మధ్యంబున నుండి దుర్యోధన మదాంధ గంధ సింధురంబు వెలువడి వచ్చె— (ఆది. 6-56). ఇది సావయవ రూపకము పరస్పరాపేక్షము లయిన రూపకములు రెండిందు గలవు. దుర్యోధనుని భ్రాతృసమూహము పద్మ వనమని చెప్పిన దొకటి. ఆవన మధ్యము నుండి దుర్యోధనుడను మదాంధ గంధసింధురము వెలువడుట రెండవ రూపకము. ఈరూపకము మూలమున లేదు.

4. అమ్మహాత్ములు జననీ సహితము గలక్కయింట బ్రదికిరి. నీయుదాపు రోచన కృతంబయిన దుర్యశఃపంకంబు పాండవానుగ్రహజలంబులంజేసి కడిగికొనుము. (ఆది 8-49) విదురుడు ధృతరాష్ట్రునికి చేసిన హితోపదేశము. లాక్షాగృహదహన మహాపాప కృత్యమునకు ధృతరాష్ట్రుడు తోడ్పడి దుర్యశము పాలయ్యెను. ఆదుర్యశము పంకముగా నిరూపింప బడినది. పంక సంపర్కము జలముతోగాని బాసిపోదు. దుర్యశము పంకమనుటచే దానిని వదుల్చుకొనుటకు సాధన మైన పాండవానుగ్రహమును జలములన వలసి వచ్చినది. గనుక నిది పరంపరిత రూపకము.

5. నిజతపోదహన దగ్ధ సమస్తపాపేంధనుండగు కృష్ణద్వైపాయనుండు. ఆది 4-238.

ఉపమారూపకాలంకారముల చర్చముగింపక పూర్వము వీని సంబంధముగల మరియొక యలంకారమును గూర్చి యించుక ప్రస్తావింపవలసి యున్నది. ఉపమానముల యవయవములు విస్తరించుచు, సాధర్మ్యమును పోషించుచు, బుద్ధిశాలుర సూక్ష్మ దృష్టికి మాత్రము స్ఫురించు విశేషాంశములకు రూపవేషాదుల నొ

సంగి, స్థూలదృష్టికి గోచరించు నట్లుచేసి యాయంశము లెల్లర మనంబులను గాఢముగా నాటుకొను నట్లింపుగా రచింప వచ్చును. ఇట్టి వాని నిగ్గీషులో (Allegory) 1 అలిగరీలని యెందరు. వానింబోలిన వచన రచనల నన్నయవిరచితముల రెండు మూడుజూతము.

### 1. జరత్కారుని చరిత్రము. ఆది 2.137.

జరత్కారుండు (బ్రహ్మచర్య వరి పాలకుడై ఘోరవ్రతములు గలుగుచు దారపరిగ్రహంబుసేయ నొల్లక సంసారపు వర్భవ భీతిన పారవ్యా మోహపాశబంధచ్యుతుడై) తపస్స్వాధ్యాయ బ్రహ్మచర్యంబు లంజేసి ఋషులెయ్యుణంబుల నీగుచు బరిభ్రమించు వాడు వనంబులోన నొక్క పల్వలంబుగని యందు మూషకవిలూనంబయి యొక్క మూలంబ తక్కియున్న వీరణస్తంబంబు నవలంబించి తలక్రిందై యూది త్యకిరణంబు లాహారంబుగా వ్రేలుచున్న ఋషులంగొండరంజూచి డాయంబోయి (జరత్కారుండు, "మునులారా! ఇది యేమితపమని? యడుగ నామునులు

---

When a comparison is protracted and sustained through numerous details, it is named Allegory. The advantages of this form of communication are

(1). There is the indirectness of the communication. The instruction does not 'lie on the surface; the story works by way of suggestiveness.

(2). The concrete and objective turn of the narrative makes it much more impressive. Abstract doctrines are set forth under concrete forms that are easily grasped.

(3). By means of the protracted narrative, scope is afforded for an independent human interest.............Thus allegory is the extreme devolpment of the Similie in its contrast with the typical metaphor. (Bain's Rhetoric Pages 176 to 182.

,, అహహా! ఇది యేమితపము? మేమును పరమదుష్కృతులము. మాకాధారము లేదు. సంతానచ్ఛేదము చేత నధోలోకములకు బోవనిట్లు తక్రిందుగా (వ్రేలుచున్నాము) మరిదభాగ్యుల మయిన మావంశంబున జరత్కారుండను పాపకర్ముండు పుట్టి దారపరిగ్రహంబు సేయను సంతానంబు వడయను నొల్లకున్న వాడే మాతని పితృపితామహులము. మాపట్టినయవురు గంట వేళ్లెలుంగాలుండు మూషకవ్యాజంబున దరతరంబ కొరికిన నొక్క వేరతక్కి యున్నయది. యదియును జరత్కారుండనపత్యుండై నందెగు నేమధఃపతితులమగుదుము. అతండపత్యంబు వడసెనేని యూర్ధ్వగతుల మగుదుము.

గీ,, నీవు మాచుట్టమవపోవె నెమ్మితోడ
నవహితుండవై మాపలుకులాదరించి
తాజరత్కారుగని చెప్పవయ్యవాని
నెరుగుదేని మాపడియెడునీయవస్థ,,

వివాహ విధియు దారపరిగ్రహమును సంతాన ప్రాప్తియునునవి స్వకుటుంబ స్వసంఘముల కత్యవసరము. ప్రత్యక్ష గోచరమైన పితృపితామహుల దురవస్థకుఘోరవ్రతని యమశీలుడగు జరత్కార బ్రహ్మచారిసహితము అతికారుణ్య చిత్తుండై యపత్యార్థంబు వివాహంబు గావలయునని నిశ్చయించెను. జరత్కారుంబోలు కఠోర బ్రహ్మచారులకు గృహస్థాశ్రమస్వీకరణా వశ్యకత దృఢముగ బోధించి వివాహోన్ముఖులగా వించుటకీ మనోజ్ఞ రచన పరమ ప్రయోజనకారి.

## 2. యవక్రీతుడు. అరణ్య 3.253, 257, 259.

భరద్వాజసుతుండు యవక్రీతుండు చదువక యె తపోబలంబున నఖిల వేదశాస్త్రాగమంబులు వడయుదునని ... యుగ్రతపంబు సేయుచున్న దాని సహింప నోపక యింద్రుండు వానియొద్దకు వచ్చి వాని తలంపెరింగి గురుముఖమున బడయక దుష్కరతపమున బడయ నెంచట విద్యోపార్జనంబునకు పాయంబుగాద నివారించి వానవుండరిగిన నుడుగక యవక్రీతుండెప్పటి యట్లతపంబు జేయుచున్న తదీయతపస్తప్యమానుండై వృద్ధబ్రాహ్మణుండు వృద్ధవిప్రరూపంబు ధరియించి, యక్షుండై శోషించిన శరీరంబు తోడ సికతాముష్టి పరంపర నపారగంభీర గంగా

ప్రవాహంబునందు సేతు బంధంబు చేయుచున్న నవ్వి ప్రుం జూచి యవక్రీతుం డిట్లనియె.

క॥ శతవర్ష వృద్ధుడవు. నీవతి కృశుడ వశక్యమైన యర్థమానందా తతశక్తి జేసికడు దుర్మతివై తింకెన్నడిది సమాప్తింబొందుఁ. అనిన యింద్రుండు వానింజూచి యేను నీయట్ల యఘటమానంబైన యర్థంబునందు యత్నంబు జేసెదన ని నిజ రూపంబు జూపి యిట్లు నిరర్థక ప్రయాసంబేల చేసెదు డుగుమనె.

(3). ఉదంకుండు నాగలోకంబున కరిగి చూచినది (ఆది 1-108)

సితాసిత తంతు సతాన పటంబునను వయించుచున్న వారినిద్దఱ స్త్రీలను ద్వాదశార చక్రంబులంబరి పర్తింపించుచున్న వారి నార్వురగు మారులను మహాతేజస్వి నొక్క దివ్య పురుషు నింగని.........

ఇది కాలచక్రము, అగ్నియును (ఆది 1-118).

ఉత్ప్రేక్ష

స్వతస్సిద్ధమైయుండు గుణాదులకు హేత్వంతరముచే విశేషతాత్పర్య కల్పన చేయుట యుత్ప్రేక్ష.

1. శంతనుండొక్కనాడు మృగయావ్యాజంబున గంగ సమీపంబునంజను వాడు దన్నుంబాసి తనుత్వంబు దాల్చి నట్లు కడు నల్ప ప్రవాహయైన గంగం జూచి-ఆది 4-82.

గంగ శంతనుని భార్య అతనివలన నెనమండ్రుకుమారులంగని యేడ్వుర నీటబారవైచెను. ఎనిమిదవ వానిని గూడ బారవైచునేమోయని శంకించి శంతనుడువలదని వారింప గంగ శంతనుని విడిచి పోయెను. తరువాత బహుకాలమున కొకనాడు మృగయాసక్తుండై యతడు గంగం జేర బోవ, నానది యపుడు కడు నల్ప ప్రవాహయై పారుచుండెను. ఈయల్ప ప్రవాహమునకు కవి విశేష తాత్పర్యము గల్పించుచున్నాడు. భర్త పరోక్షమున తద్విరహముచే భార్య కృశీభూత యగుట న్సర్గికమే గదా శంతను పరోక్షమే గంగ తనుత్వంబు దాల్చుటకు అనగా సన్నగిలి యుండు

2. సత్వర సంతానలబ్ధికై కడుపు గ్రుద్దుకొనిన గాంధారికి గర్భపాతంబయిన పుడు వేదవ్యాసుండు గాంధారింబదరితొల్లి వేదంబుల విభాగించినమహానుభావుండవ్వ్యాసుండా పిండం బేకోత్తరశత ఖండంబులుగా విభాగించె. ఆది 5.101.

3. సౌగంధిక హరణార్థము రిగెడు భీముని గూర్చి (అరణ్య 2-311) అక్కమలంబు దెచ్చిన గాడ్పున కభిముఖుండై గాడ్పుపట్టె.

4. ఆసందర్భమునే యక్ష రాక్షసుల ననేకుల నుక్కడంచిన భీమునితో యక్షరాక్షసు లిట్లను చున్నారు. అయ్యా నీవు ధర్మజానుజుండవు గావున నీవుధర్మపథంబు దప్పంజనేదు. అరణ్య-3-313 మధుర్యగణ వివరణము నందు సాక్షిప్రాయాను ప్రాసముల నిపేర్కొనబడిన యుదాహరణములందీ యలంకార సూచనము గలదు.

## శృంఖలాలంకారములు.

పంక్తి రూపము చేత నిబద్ధములయిన యర్థములలో పూర్వపూర్వములకు నుత్తరోత్తరములతోను లేక నుత్తరోత్తరములకు పూర్వపూర్వములతో సంకెలవేసి చెప్పుట శృంఖలయగును.

1. అరణ్య 1-24. స్నేహంబున రాగంబును, రాగంబువలన కామంబును, కామంబువలన క్రోధంబును క్రోధంబున తృష్ణయు బరిల్లు.

2. అరణ్య 2-312. అధర్మవర్తుల యందు దర్పంబు బుట్టు దర్పంబు వలన మానంబు పుట్టు మానంబు వలన క్రోధంబు పుట్టు క్రోధంబు వలనంజేసి లజ్జయు వృత్తంబు నుండెడు. నష్టలజ్జావృత్తులయిన వారి నుపశమంబును లక్ష్మియు విడుచు.

3. అరణ్య.3-347. శుభాచారుండవు గావలయునాచారంబున ధర్మంబుపుట్టు ధర్మంబు వలన వేదప్రతిష్ఠయగు వేదంబులంజేసి యజ్ఞంబులు ప్రవర్తిల్లు వట్టి యజ్ఞంబుల వలన దేవతలు తృప్తులగుదురు.

## క్రమాలంకారము.

క్రమ సంఖ్యగల వానిని వరుసగా క్రమ సంఖ్యగలవానితో నన్వయించున ట్లు వర్ణించినచో యథాసంఖ్యములేక క్రమాలంకారము.

1. కీర్తియు నపకీర్తియు స్వర్గ నరక నిమిత్తంబులు. ఆది 8-33.

2. తపస్కరవధోపేక్షల వలన నశ్వమేధ భ్రూణహత్యల ఫలంబగు ఆది-8-122

## తుల్యయోగిత.

ప్రకృతములకు మాత్రముగాని, అప్రకృతములకు మాత్రముగాని గుణ క్రియాది రూపమైన ఏకధర్మాన్వయము తుల్యయోగిత. సంజయుండు ధృతరాష్ట్రుని తో నిట్లనుచున్నాడు. ఆరణ్య 1-388. అర్జును దివ్య శరసంఘాతంబును, భీమసేను గదాఘాతంబును, నీయుపేక్షానిర్ఘాతంబును గౌరవ పరిక్షయంబునకు గారణ భూతంబులు.

## విషమాలంకారము.

అననురూపమైన సంసర్గము విషమము.

1. సకల క్షమారక్షకుండైన పరీక్షితునకుం బరీక్షింపక శాపంబిచ్చి చెట్ట చేసితివి.

2. మేమేవురము భూలోకంబునకు వచ్చి యొక్క వనంబునందు తపంబు సేయుచున్న వాని నత్యంతశాంతు నేకాంత చారినగ్ని కల్పునొక బ్రాహ్మణుగని వాని తపంబునకు విఘ్నంబుసేయ సమకట్టియేము రాగ కారణంబులయిన వికారంబుగావించిన నవి తన కుంగోపకారణంబు లయిన నతికుపితుండై బ్రాహ్మణుండుమ మ్మేవురమహోగ్ర గ్రాహంబులు గాశపియించె.

(3) ఇట్లు ద్రుపదుండు ద్రోణుచేత విముక్తుండయ్యు గోపపాశబద్ధుండయి.
ద్రోణశిష్యుడగు నర్జునుచేత బంధితుడై ద్రోణవిముక్తుడయ్యు ద్రుపదుడు స్వీయ కోపపాశబద్ధుడగుటచే విషమము.

## శ్లేష.

ఒక్కమాటచేతనే కార్థంబులు ప్రతిపాదించుట శ్లేష. రమణీయగు శ్లేషాలంకార భూషితమైన యీ క్రింది సముద్ర వర్ణనమును జూడుము. (ఆది-2-27)- తుంగ తరంగా గ్రసముచ్చలజ్జకణా సాంచ్ఛటా చ్ఛాది తగగన తలంబైనదాని.

నుద్యానవనంబు నుంబోలె బహు విద్రుమలతా లంకృతంబైన దాని, నాటక ప్రయోగంబు నుంబోలె ఘనరస పాత్ర శోభితరంగరమ్యంబైన దాని, దివంబు నుంబోలె నహిమకర భరితంబైనదాని.

ఇట్టి రమ్యోపమానయుక్తములగు శ్లేషలు సుబంధు కవి బాణుడును సంస్కృతమున విశేషముగ రచించియున్నారు. వన్నరచు విరచితమైన యీ శ్లేషలంబోలు వానిని పెక్కింటిని తరువాత కవులు విశేషముగా రచించిరి. తిక్కన సోమయాజి విరాట పర్వమున కీచకుని మరణ రంగమైన నర్తనశాలను, బమ్మెర పోతరాజు భాగవతమున నైమిశారణ్యాసులను, రామరాజ భూషణుడు వసు చరిత్రయందు సరోవర వర్ణనాదులను ఇట్టి శ్లేషోపమలను రచించి వర్ణించిరి.

ఈ యలంకార భాగమునుండి విరమింపక పూర్వమే మనము మరికొన్ని చమత్కార రచనలను గూర్చియించుక ప్రస్తావించ వలసి యున్నది. కొన్నియుదాహరణము లిచ్చి వానిస్వభావమును గమనింతము.

1 అనిలాలోల కల్లోల మాలాస్ఫాలన. ఆది 4 141. ఇందు వాయువ్యాపారముచే గంగానది యందు బుట్టి చలించుచు పెరిగి విరిగి దూలు తరంగ జాలము వర్ణింపబడినది. నదీ సరళజలములు తరంగ రూపము దాల్చి కదలుచు పెరుగుచు ముందునకు బోవుచున్నట్లే కూర్పు నందును సరళ లకార వర్ణము దీర్ఘమగుచు హ్రస్వమగుచు నున్నతమగుచు పెక్కు విధముల చలించుచు బోవుచున్నది. తీరసమీపమున తరంగములు విరిగి కూలునట్లే రచనాంతమున స్ఫాలన నిష్ఠురాక్షరోచ్చారణావసరమున బంధమును విరుగుచున్నది. ఇందర్థానుగుణమైన శబ్ద సంఘటన గలదు. ఇంగ్లీషులో దీనిని Sound echoing sense అనగా శబ్దమర్థమును ప్రతిధ్వనిం

పఠేయుట యనెదరు. సంస్కృతాంధ్రములందు నిట్టి చమత్కారముగల కూర్పునకు ప్రత్యేకముగా పేరున్నట్లు తెలియరాకున్నది. దీనిని ప్రతిధ్వని శార్థ బంధమని గాని శబ్దార్థసామ్యమని గాని చెప్పుట యుక్తమని తోచెడిని. ఈక్రిందియుదాహరణములందు నీచమత్కారము దృశ్యము.

2. అంత సభాపాలుండు ప్రబల జలధరధ్వాన గంభీరభేరీధ్వనిచే నర్జును పరాక్రమంబెఱింగించె (ఆది.8-203)

3. ఇట్లు నిఖిల క్షత్రియత్రాస జనకంబుగా వలిగి దంత సందష్ట దారుణముఖుండయి శిశుపాల నిర్మూలనా భీల సంరంభంబున నున్న భీమసేను—(సభా 2-52)

4. జరాసంధుండు సటాసముత్పాటనకు పితకుంజరవైరియుంబోలె గనునలిగి పటుకుటిల భ్రుకటి ఘటితనిటలుండగుచు. (సభా).

5. నిలుకోడ వడసినక్రొమ్మెఱుంగు దీగయుంబోలె మణిమయమంజీరఝుళంఝుళని నాదంబును గంకణఝుంఝుంకారంబును గటకలాపకింకిణీ క్రేంకారంబులును మదనాజ్ఞా వాద్య ఘోషంబు నుంబోలె ప్రమోదమంద మందగమనంబున బురందరనందను మందిరంబున కరుగు దెంచిన నప్సరసస్త్రమ్ము భయభక్తి సంభ్రమంబులతో ప్రత్యుత్థానంబు ...చేసె... ఆరణ్య 1-359,



## రసములు

కవి సృష్టియందు ప్రతి గ్రంథార్థము రచనా విధానముచే మనోగోచరమగుచుండును. రచనా సామర్థ్యముచేత పాఠకుల మనోనేత్రముల యెదుట సందర్భోచితముగ సజీవములైన స్వరూపము లనేకములు ప్రత్యక్షమగుట హేతువుగా వానిందిలకించు పాఠకుల మనములత్యంత ప్రమోదము నొందుచుండును. ఇట్టి స్వరూపముల నేగాక వానింబరివేష్టించియున్నవి విషరంగములను ఆపరిసరమున గలనానావిధభౌతిక వస్తుచయమును గూడ వర్ణించుచు కవియా భౌతిక వస్తు ప్రాబల్యము చేతను పరిస్థితుల చేతను వివిధ పాత్రల యొక్క జ్ఞానేంద్రియములును, తద్వారా వారల మనస్సులును చలించుచు పొందెడి వివిధ వికారములను చక్కగ విదితము చేయుచుండును. పరిసరపరిస్థితుల చేత పలు విధముల స్పృశింపబడి పెక్కులగు ననుభవముల పాలయిన పాత్రల మనస్సులు యదార్థముగ స్వచ్ఛముగ సాగనుగ కవులచేచిత్రింపబడుచుండును. కవికూర్చెడు పదజాలముచే సూచితములగు భావానుభవాదిమనోవికారములను గూర్చియిపుడు మనము చర్చింపవలసి యున్నది.

ఈభావములు1 స్థాయిభావములు 2 విభావములు 3 అనుభావములు 4 సాత్త్వికభావములు 5 సంచారిభావములు అని అయిదు విధములు. విభావములు కారణములుగా ననుభావ రూపమున ప్రకాశితమైన స్థాయిభావముల వలన నవరసములు త్పత్తి యగుచుండును. పరుల సుఖదుఃఖములను విచారింపగా సత్త్వగుణముచేత గలిగెడు మనోభావములు సాత్త్వికభావములు. స్థాయిభావములకునలు ప్రక్కలనుసంచరించివానిని వృద్ధి పొందించుచు రసోత్పత్తికి సహాయకారులైనవి సంచారి భావములు వీనికి వ్యభిచార భావములని గూడ పేరు గలదు. (కావ్యా .చూ.1-47)

‘‘ స్థాయిభావంబులందు నిత్యత్వముడిగి వ్యభిచరించు నట్టివిగంగ నివి లె! నోలి బొడముచు నడగుచునుంట జేసి యొసగు సంచారి భావంబులు— మరియు ‘‘గరివ నదు లెన్నిగలసిన గప్పకొనుచు జలధిగను పట్టుకీతి సంచారిభావసంచయము లెన్నిగలిసిన మించనీక తానకను పట్టు స్థాయిభావంబుదలప,’’ (నరసభూపాలీయము 3-5). ఈభావముల వలన రసోత్పత్తియగు టెట్లనగా:-

గీ॥ స్థాయిభావంబులకు ననుసారులైన।
తద్విభావాదులను రసత్వంబు గలుగు।
పరగ వెన్నకు పాకసంప్రాప్తి చేసి।
తగు ఘృతత్వంబు గలుగు చందనము చెప్పుదు॥ (కా॥ మా., 2-5)

కం॥ పులకండంబులు గలిపిన నలువగు సలిలము రసాయనంబగు పగిదిన్।
లలిత విభావాదులచేనలఘుతర స్థాయిభావమమరున్ రసమై
(నరసభూపాలీయము- 3-5).

రసములు శృంగారము, అద్భుతము, శాంతము, హాస్యము, భయానకము, కరుణము, వీరము, బీభత్సము, రౌద్రము అనిలొమ్మిది ఇందుః శృంగారరసమును గూర్చి మాచ్చటింతము. మానవ సంఘజీవనమున ప్రేమ, అనురాగము, వాత్సల్యము, దయ, జాలి, సౌహార్ద్రము మొదలగు ననుబంధములు దుఃఖనివారణమునకు, సౌఖ్య ప్రదానమునకు ముఖ్యసాధనములు. బహుకారణముల చేత క్రూరమై, కష్టతరమై, భయావహమై తోచు జీవిత సమర రంగమునందు ప్రపంచము వాసయోగ్యముగను, జీవనము ధారణయోగ్యముగను తోచునట్లు చేసి ప్రాణులకు విరామ మొసంగి సౌఖ్యోల్లాసముల గల్పించుట కీయనుబంధములు ప్రబలసాధనములు.

స్త్రీపురుషులన్యోన్యానురక్తులయి వివాహబంధబంధితులగుట ప్రకృతి ధర్మము. సర్వసాధారణముగా నురూపమే స్త్రీపురుషులనాకర్షణపాత్రములగా వించును. అన్యోన్యమును రూపాకర్షణము చిత్తాకర్షణమునకు సాధన భూతము. ఉత్తమశీలము, మేధాసంపత్తి, బాహుబలము, అసాధారణ ప్రజ్ఞలోనగు వివిధ గుణ విశేషములు స్త్రీపురుషులపరస్పరానురక్తిని వృద్ధిచేసి యన్యోన్య ప్రేమను గాఢతరము గావించును. నిశ్చల ప్రేమ పాశబద్ధులయి నదంపతుల దాంపత్యము నకంటె పవిత్రమైనది వేరొకటి విశ్వమున లేదు. సమస్త సాంఘిక సౌఖ్య సంపదలకును మూలబీజమీ దాంపత్య గర్భితమైన ప్రేమ యేకదా? తలిదండ్రులకు తమ సంతానము నందు గలయనుబంధమును, పుత్రపుత్రికా సంతానమునకు జననీ జనుల యందుండెడునను బంధమును సోదర సోదరీ జనులయన్యోన్యాపేక్షలును దాంపత్యవృక్షఫలములు. వివిధకుటుంబముల సంతానములకు వారిలో వారికుండునను బంధము స్నేహము.

కుటుంబమునకు చేరకున్నను స్నేహితులును పరిచితులునుగాకున్ననువిపద్దశ యందుండు నెవ్వరి యందైనను దయించు నుత్తమాను బంధము కరుణ, దయ, జాలి, సౌహార్దము, సహానుభవము ననివలు తెరంగుల వ్యవహరింప బడు చున్నది. కుటుంబముల నేకములు చేరుట చేత సంఘము, జాతి, ఏక దేశీయత మొదలగునవి యేర్పడు చున్నవి. స్వసంఘము నందు, స్వజాతి యందు, స్వదేశము నందు గల యనుబంధము దేశాభి మానమగు చున్నది. ఇట్టి పవిత్రమైన సంఘ జీవనమున కంతకును మూలబీజమై యొప్పు దాంపత్యాను బంధమునకు హేతు భూతమైన ప్రేమ తత్త్వము మేధాభేద్యము. మహామహిమాన్వితమై జీవితౌన్నత్య హేతువై పవిత్రాతి పవిత్ర మైన ప్రేమ సమస్యను రమణీ యముగ చిత్రించి సాధించెడి కవికవి. అట్టి యుత్తమ సామర్థ్యముగలకవి చంద్రవిలోకమున నెందర వతరించి యుందురు,

యదార్థ ప్రేమము, సౌహార్ద్రము, విజ్ఞానము.క్షమ-లోనగు నుత్తమగు ణవిరాజితులైన పురుషావతంసులు జ్ఞాన హీనములైన చతుష్పాద జంతుకోటి కంటె పెక్కు వేల సోపానములు పైనుండి దైవ గుణసంపన్నులని కీర్తింపబడు చున్నారు. అట్టి వేవియు లేక క్రౌర్యా యత్త చిత్తులై హింసాపరాయణులై స్వార్థ పరులై జీవించు మనుష్య రూపధారులు మృగముల కంటె నసములుగా పరిగణింప బడు చున్నారు. కామాంధము లైన మిథునము లీజంతు వర్గ పతితములు. అట్టి ద్విపాద పశువులమై ధునకృత్యములజ్జతో విడిచి వర్ణింపబూను కవినామధారుగా జంతువుల కంటెను నధఃపతి తుడని నిస్సంశయముగా పరిగణింప దగి యున్నది. అట్టి సంపర్కమున కవినామధారులు కొందరే కాంతమున భిలషించు దంపతులపైన క్రమముగా కండొత్తి, వారికయున గృహముల ముట్టడించి లోపజొరబడి, రెప్ప వేయక రేయెల్లనాదంపతులతో గూడనుండి వారి దాంపత్య మర్మములను, వారిసంభోగక్రీడలను సాంగోపాంగముగ వర్ణించుట జూడ మిగులన సహ్యమగును. ఇట్టి దంపతుల విషయమున పాశ్చాత్య ప్రాచీన మధ్యకవులు కూడ కొందర పరాధములుగా వించిరి. మహాకవికాళి దాసుకూడ నీవిషయమున నింద్యుడై యగు చున్నాడు. కాని నన్నయభట్టారకుడు మాత్రము తన రచనలలో హేయమై గౌరవ హీనమైన తుచ్ఛ సంభోగవర్ణనలు చేయలేదని చెప్పుటకు మిగులసంతోష మగు చున్నది. ప్రాచీన గాథలననుస

రించి స్త్రీపురుష చిత్తములకుగల రాగోత్పత్తి గావించుటయే వ్యాపారముగాగల మన్మథుని, వానిచెఱకు వింటిని, కుసుమ బాణములను పేర్కొని వర్ణ్యములుసగౌరవమునం గు కూర్పులతో పరస్పరమోహమును సూచించి వివాహ పుత్రోదయాదుల ప్రశంసించు నేగాని దంపతుల శయన గృహముల ప్రవేశింపడు. ఏకాంతమున ఖేలసించు దంపతుల నల్లోకించి వారిల గావించి తప్పు గౌరవించుకొని మన కీవిషయమున కాళిదాసాది మహాకవుల కంటెను నన్నయ పూజ్యుడుగ చున్నాడు.

నన్న పార్యుడు రచించిన భారతము నందు పెక్కుమిథునములు బహు రమ్యముగ చిత్రింప బడినవి. ఆదంపతుల శృంగార భావముల సూచించు నవరసగాంభీ మిగుల సంగ్రహములు, మృదులములు, రమ్యములు. మరియు ప్రేమ భావము దాల్చి డి బహు విధాకారము లందు కడుమనోజ్ఞముగ వర్ణింప బడినవి. గ్రంథవిస్తరభీతిచే వానినిట ప్రత్యేకముగ వ్రాయజాలమికి చింతించెదము. వాని స్వభావ విశేషములను మాత్రము సంగ్రహముగ పేర్కొనెదము. ఇందలి యీ లేఖములను (references.) గైకొని యారచనలను భారతమున విపులముగ పఠింప చదువరుల ప్రార్థించెదము.

ప్రమద్వర. ఆది 1-145. సర్పదష్టయైన ప్రమద్వరకు, దేవదూతయుపదేశ ప్రకారము దాని భర్తయగు రురుడు తన యాయుష్యము నందర్ధంబామెకిచ్చి బ్రతికించు కొనిప్రేమ యొక్క యమూల్యతయు నగాధ శీలమును నిరూపించి యున్నాడు.

2. బహు సౌందర్య వతులగు యువతీ మణులందరు కించి పురుషులతోలు తవారలం ప్రేమించి తమ మోహాంకురము వారతరుణుల హృదయముల నాటి పెంపొందించి వారల చేతంగామితులై వివాహితులై సుఖింతురు. తపతిసంవరణోపాఖ్యానము, దుష్యంత చరిత్రయు పఠింపుడు.

3. పురుషునింజూచి వనిత తనంత తావలచి వచ్చిన విషయము హిడింబి భీమసేనుల వృత్తాంతము నందు వర్ణింపబడినది భ్రాతృనియోగముచే పాండవులంజంప వచ్చిన హిడింబి, భీముంగాంచి, తనసోదరుంజంపిన భీముసే వరించి పతిన్నెహ

మేకామినులకు బలవత్తరమనియు పై నెయ్యములు వేయిరెట్లు తత్స దృశ్యములుగా వని యు సంస్థాపించినది.

4. కొందరు సుందరు లొక పురుషుని వలచి తమభావముల నెరింగించినను ఆ పురుషుని చిత్తవృత్తి తమకు వ్యతిరేకమై మరల్పరాక యుండెనేని యా స్త్రీ ప్రేమ భావము బలవద్విరోధముగా బరిణమించి పురుషునకు బాధగావించు. ఊర్వశి శృంగార చేష్టలకు చలింపక నిర్వికార ధైర్యధుర్యుడైన యర్జునుడు షండత్వము బడసెను. దేవయానిచే గామితుడై నిరాకరించిన కచునికి మృత సంజీవని బనిచేయకుండ శాపము వచ్చెను.

5. స్త్రీపురుషుల కన్యోన్యానురాగము గల చోట వారి సమాగమునకు పూర్వ స్త్రీప్రస్తాపితములైన కొన్ని నియమముల ప్రకారము నడచుకొనుటకు పురుషుడంగీకరింప వలయును. గంగాశంతనుల సమాగమిట్టిది. ఇట్టి దాంపత్యములలో పురుషుని కధిక ప్రేమయు స్త్రీకల్ప ప్రేమయు నున్నట్లు గ్రహింప దగి యుండును.

స్త్రీపక్షమున నామెబంధువులను నియమ ప్రస్తావన చేయుటయు గలదు. సత్యవతీ శంతనుల వివాహ మిట్టిది.

6. స్త్రీపురుషుల కన్యోన్యానురాగము గల చోట నాదాంపత్య మా స్త్రీ స్వాతంత్ర్యమునకు ప్రతికూల మేమోయని యామె జననీ జనకులకు సందేహము గలిగిన పుడా సందేహము స్త్రీ యేతం ప్రసంగముల చేతనివృత్తిచేసి తన ప్రియునికే తన్నిచ్చునట్లు చేసికొనిన స్త్రీరత్నములుగలరు. లోపాముద్ర చరిత్రమిట్టిది కానియదియా సాధారణ చరిత్ర.

7. గృహస్థాశ్రమపరాఙ్ముఖులై వైవాహిక జీవనమునిన రోత పడెడు బ్రహ్మచారులు పితరులకు గతులు గల్పింప పుత్రార్థులై వివాహ మయ్యెదరు. జరత్కారుని యట్టి కఠోర బ్రహ్మచారులకు భార్యయనునది పుత్రోత్పత్తి కగత్యమైన స్త్రీ కూడ యంత్రసాధన మాత్రమే కాని వరికి భార్యయైహికాముష్మిక

సౌఖ్యోన్నతులకు ముఖ్యమైన యర్ధాంగ లక్ష్మియను సత్యము విదితముగా లేదు.

మరియు కొన్ని సందర్భములందు స్త్రీకి విలాసోత్సుకులై తనసాంగత్యము నభిలషించు పురుషుని యందు తనకు యదార్థమైన ప్రేమ లేకున్నను ఎదురాడిన నేమి యుపద్రవము సంభవించునో యను భీతిచే స్త్రీకాముని కంగీకరించుట యుగలదు. పరాశరులచే యోజన గంధి యైన మత్స్యగంధి యిట్టిదే.

ఈసమాగములు ప్రేమబోధితములా?

8. పురుషుని కన్ని యనుబంధముల కంటె సౌందర్యవతియైన స్త్రీయందుగల యను బంధము బలవత్తమము. అభేద్యమైన భ్రాతృస్నేహ పాశ బద్ధులయిన సుందోపసుందులు తిలోత్తమయను నొక స్త్రీ వినిహితకాములై యామె మాయలోబడి స్నేహము చెడి యన్యోన్యాభిఘాతుల నిరువురును మడిసిరి కామాంధత్వము మనుష్యుని చేత నేమిచేయింపదు?

9. రాగరసము దాల్చెడి యాకృతులలో గొన్ని వివరింప బడినవి. ఇక నుత్తమోత్తమ మైన యదార్థ ప్రేమను గూర్చి ప్రసంగింప వలసి యున్నది. (The course of true love did never run smooth) అని యాంగ్ల కవిసత్తము డొకడు చెప్పి యున్నాడు. అనగా యదార్థ ప్రేమవాహిని యెన్నడును సరళ గతింజన లేదని తాత్పర్యము. దానికన్నియు విఘ్నములే. విఘాతములే. అంతరాయములే. నలోపాఖ్యాన మీవిషయమును బాగుగ బోధించుచున్నది. పవిత్రతమైన దాంపత్య ప్రేమ స్వభావ నిరూపణమున కెందరో మహాకవులీ పుణ్య చరిత్రమును గూర్చి బహు కావ్యములను రచించి యున్నారు. నన్నపార్యుడీ ప్రేమాంశముల వర్ణించిన క్రమము గమనింప దగియున్నది. సతీమణియగు దమయంతి చరిత్రమత్యద్భుతము. ఆమెహృదయ మామెమనోహరుడగు నలునియందు ప్రేమరసముతో నిండినయపార పారావారము. అతని సేవించుభాగ్యము నెదుట నామెకు త్రిలోకాధిపత్యము తృణతుల్యము. అతని వియోగమామెకు రౌరవాది నరకముల కంటెను కష్టతరము. సురూపసుశీల సుకృత సౌభాగ్య సంపత్స

మృద్ధియందు సురకాంతలు నామెకు సాటిరారు. పవిత్రమైన దాంపత్యజీవన మా మెపుణ్య చరిత్ర వలన పవిత్రతరము గావింపబడినది. ఆమె తనపూత చరిత్రచే సంస్థాపించిన మహత్సత్యమే యామె పురుషకోటి కొసంగిన దివ్య సందేశము.

గీ॥ అఖిల దుఃఖరోగార్తున కౌషధంబు।
సురుచిరంబుగ భార్యయెచూవేయెందు।
నొకరిభార్యాసమేతుడైయున్నవాని।
కింతలాపదలయ్యును నెరుకపడవు॥

యదార్థ ప్రేమ యొక్క నిత్య విజయ శీలిత్వమును సంస్థాపించుట కామెవ లు పాట్లు పడవలసి వచ్చెను. గానియగ్నితప్తమైన హేమము వన్నెకెక్కినట్లు, శిలామథనంబున శ్రీచందన సౌరభము మరియు పరికాశిత మగునట్లు మీటిన కొలది వీణియ మధుర తరవిస్వనముల నొసంగునట్లు దనుభవింతపడిన విపత్పరంపర వలన యదార్థ ప్రేమయొక్క మహామహిమము నిరూపితమై గార్హస్థ్యజీవనమునందలి గౌరవము పెంపు గాంచినది.

మరియు తన సహజ పరిశీలనా బుద్ధికి శిక్షగా వృద్ధచ్యవను నిభర్తగా బడసియు సంతసించి తనపాతివ్రత్యమహిమచే నాతనినవయౌవనవంతునిగా జేసికొనగల్గినసుకన్య యొక్క పూజ్య చరిత్రము నిట్టిదే.

అనుకూల దాంపత్యమునకు పుత్ర పుత్రికా సంతాన లాభము దివ్యఫలము. ఈగర్భ వాసప్రపంచ యందు దలిదండ్రులకు గలయనుబంధము వాత్సల్యము. బిడ్డల కొకప్పుడు చిటుకుక్కన చీమకుట్టినను తలిదండ్రులు వాత్సల్యాధిక్యముచే సహింపక వేదనంబొందయుదురు. సోమకుడను రాజాన కేకపుత్రుడగు బాలకు కురుపు చీమకుట్టిన నంతఃపురస్త్రీలెల్ల యేడ్చిరట!

(అరణ్య 3-208) తలిదండ్రులే గాక తదితరులును అసహాయులైన కసి కందుల నిట్టివాత్సల్యముతో పోషించి పెంచుకొనుట శకుంతల చరిత్రయందు చూచి యున్నాము. కణ్వమహా ఋషి (ఆది-4-46, 48) యిట్లను చున్నాడు.. ప్రేమ

కవికి భమ్మ త్రాతలమగుటం జేసి గురుతము మాపేత యుభివర్ధిత యగుటం జేసి మా
కు నిది హృద్య యానందిని యైనకూతుక."

కరుణారసము.

క॥ శోకము విభావములు బహు వాకలనము సేయ నిష్టనాశము రసమయ్యెన్
శ్రీకూరిన యనుభవ విపదాకలితాలంబభావ మనగా బరగున్

తే॥ అనిశకృత శోకపర్యటనాదికములు నాగనష్టిజన విభావపరికరములు
యోషపరచేఁన శ్వాస రోదనములు మనగ ననుభావములుగాగ గరుణ యనదు-

గీ॥ స్తంభవైస్వర్యభాష్పములాత్వికములు।
మోహసంభ్రమ సితతో వ్యాదములును।
జాడ్య చింతాగ్లానులు నవ వ్యాధి గతియు
బటువిషాదంబుసంచారిభావదశలు.

(కావ్యాలంకార చూడామణి-2-96, 98, 99)

అసహాయ శిశువిషయమేగాక, జాలి గొలిపియు, దుఃఖము కలిగించియు చదువరులకు కరుణ గల్గించెడిరంగములనేకములు భారతమున గలవు. లాక్షాగృహదహనానంతరమున పథపరిశ్రాంతులై యరణ్యమున నిద్రించు పాండవుల దుస్థితి చూడుము. ఆది 6-176-178

1 భీమసేనుండును దద్వటవృక్షంబు క్రిందనధిక పథిశ్రాంతులయి వయిపుట్టంబులు పఱచుకొని తమబాహుదండంబులు దలగడలుగానిద్రితులయియున్న సహోదరులందఱిని జూచి పరమ దుఃఖితుండైన

2 మరియొక్కటి చూతము- ఏకచక్రపురంబున కుంతియు పాండవులునన్యు లెఱుంగ కుండ నుండుచో నొక్కనాడు బకాసురునికి బలిగొనిపోవనింటి వరుసవచ్చిన బ్రాహ్మణుని దురవస్థమిగులజాలిగొలుపు చుండును. అందునుఅవివాహితయైనయాతని కూతురు పచించిన అలాపలుకులు మరియు జాలి గొల్పుచున్నవి. ఆది-6-256-258.
" ఒలసి యెంతకాలముండిన నేను మీ దానగాను యొరుల దానననొ్న నెన్నడైన

వారలకిచ్చెదో ననుగను భోజనముగనిచ్చి పుచ్చెదిపుడ,, యీకుమారుఁడనాయుఁ దద్యోడుఁ దౌ హిత్రలాభంబున కంటె మీరిద్దరు జీవించిన ననేక పుత్రపౌత్రలాభంబగు దానం జేసికు లంబునిలుచుం గావున నన్ను పుండనీక నకూర్తుంగౌగలించుకొని యిద్దరు నేడ్చుచున్న వారింజూచి కన్నీళ్లు దుడుచుచు ... ఇట్లు కుంతియు పాండవులు విడిసిన విప్రునింట నొక్క పెట్ట యార్తధ్వనివిని....

ఏకచక్రపురవాసుల గ్రామాధిపతి నెంత గాఢమైనది? గ్రామస్థునొకని నిలువరుసను బకాసురన కిచ్చుకొని యైన యా గ్రామము నందే గాపురముండ నిశ్చయించుకొనిరి. కొడుకు కూతురు, తల్లిదండ్రియు నలుగురు మాత్రము గలకుటుంబము నాంకిలువరుస వచ్చినప్పుడీగోల జనించి యున్నది. ఈయార్తధ్వనివిన కుంతిదేవి హృదయంతము సంతాపించి తనకృతజ్ఞతాసూక్ష్మబుద్ధియు దేటపడనిట్లనియె పరమోపకారి యైన యీ బ్రాహ్మణునకు నేమి ప్రియము నిసుపముకూర్తునో యని చింతించుచుండుదు నిట్టిదోనిప్పుడెద్దియే నొక్కడు స్థిరంబైన దుఃఖంబీ గృహస్థున కయ్యెంగావలయు. నామానంబు మల మల మరగెడు- గావున దీనిందలంగించి వీరికి మనఃప్రియంబు సేయ వలయు ”

ఇట్టిసద్గుణ శీలములు గలవారు కేవలదైవాంశ సంభూతులని చెప్పవలసి యుండును. ఈసుశీలాదుల ప్రాకట్యమునకు దెబ్బటకు మను జులకు కష్టము లత్యవసరములు. కావున పరమేశ్వరుడు పరులహింసించుచు తాము సుఖపడ జూచు స్వభావము గల వారి నెక్కువగ సృజించుచుండును పరశ్రేయస్సాహనము లేక పరులకు బదలమ్మువారిలో దుర్యోధను డగ్రగణ్యుడు- భారతమంతయును వాని దుర్గుణములతోనిండి యున్నది. నన్నయ విరచిత భారతమునందు వానిదుష్టతను వర్ణించు నొక్క భాగము మాత్రమిక్రింద వ్రాసెదను:- సభా 2-88- 2 146, “ధర్మరాజరాజసూయంబు తనకనూయాజనకంబగుటను, సకల జననయనోత్సవంబయిన తత్సభాలక్ష్మి తన మనోనయనంబులకగ్నిజ్వాలయయి మహాదాహంబు సేయుటయు నంత ప్రత్యాదయుండై నిదాఘదాహంబున నింకితమగు నల్పజలాశయంబు నుంబోలె దందహ్యమానమానసుండయి తద్దయుం గడసి......ఎవ్విధంబున నయిన పాండవలక్ష్మి నుపహరింప వలయు నట్లుగాని నాడు నాహృదయ రోగంబునకు పశమనంబు లేదని,,...

అనూయాపరులగు నిట్టి దుర్మార్గుల స్వార్థపరత కారణముగా వారలచే పెక్కిడుమలంగుడుచు చుండియును కుపితులుగాక పరమక్షమాలంకృత హృదయులగా తరప, మెంతయు వర్ణనీయము గదా?

కం॥ శాంతము సర్వోత్తరరుచి మంతంబట్లగుట వైర మైత్రులులే వీ
చింతన మెఱుగనికవి కవగంతవ్యంబగునె రసవికాస ప్రతిభల్,,

(కావ్యాలంకారచూడామణి. 2-138.)

మరియు, ఆరణ్య 1-224:-

క్షమగల వానికి బృథ్వీసమునకు నిత్యంబు విజయ సంసిద్ధియగున్. "శౌచంబును సత్యంబును విద్యయు ధర్మువు సచరాచరంబైన జగంబంతయు క్షమయందనిలిచివవి... ఎల్లరు వాయువశ మనంబకీర్తింతురు. ఉపశమహీనుండైన దుర్యోధను కారణంబునధార్తరాష్ట్రులకెల్లంబ్రళయంబగు. విధాతృనియోగంబునంజేసి బుణ్యాపాపఫలంబు సంప్రాప్తంబగు'' ననిపదాతలంచుచు, యుధిష్ఠిరుండు తాను ప్రమాదవశమునవైన కోపించిచూచినచో నెవ్వరికేమి కీడు మూడునోయని ముఖమున వస్త్రము కప్పుకొని యవ్వరిఁజూపకయే, దర్యాతావంతర మరణ్యమార్గమును బట్టి యరిగెను, ఇంత శాంతాత్ముడు గావుననే యుధిష్ఠిరుండ జాతశత్రుండయ్యె.

శాంతాద్భుతరసములును, హాస్యము బెడిసి కొట్టిన వత్తాంతము నీక్రింది రచనము వలన తేటపడు చున్నవి:- ఆది 1-150-156 "రురుండను ప్రమద్వర వివాహంబయి యిష్టోపభోగంబులననుభవించుచుండి, (తన సతి కపకారముగా విండిన సర్పజాతిపై కోపించి వెదకి వెదకి పాముల చంపువాడొక నాడుడుండుభంబను నురగంబుఁజూచి) యలిగి కృతాంత కరదండంబునుంబోని తనదండంబు నెత్తి కొనుడుద్దత నంబడుండుభంబు మునియై యెదుర నిలిచినంజూచి రురుండిట్లనియె" ఉరగ మవయియుండిన నీవిట్లు ద్యుతిముగ మునీశ్వర వేషము దాల్పుటాశ్చర్యమిది యెట్లయ్యెనని యుడుగ మునివరుండిట్లనియె ,, ఏను సహస్రపాదుండను మునిముఖ్యుండ నాసఖోఖ్యాయుండు ఖగము ఖుండను మునిముఖ్యుండగ్ని హోత్రగృహంబున నున్న నేన పహాసా

ర్ధంబు తృణమయ సర్పంబు నమ్మని పైవైచిన నతండు లికపడి నాకలిగి, నీవు నిర్వీర్యంబ యిన యురగంబవగుమని శాపంబిచ్చిన నేనును వేలంబు సేసిన యిది యింత యలుగ నేల క్షమియింపుమనిన ప్రసన్నుండై ఖగముఖుండు నావచనంబు మోఘంబు గావున కొ న్నాళ్ళ కాలంబునందు ధంబవై యుండి భార్గవకుల వర్థనుండైన రురుం గనిన యప్పుడు శాపవిముక్తుండ వగుదు వనెనని చెప్పి మరియు నిట్లనియె "ఆర్యా నీవు బ్రాహ్మణుం డవు. భృగువంశ సముత్పన్నుండవు. సంపన్నుండవు నిదియేమి దొడంగితి దారుణ క్రియారంభంబు క్షత్రియులకుంగాక బ్రాహ్మణులకుంజనునె బ్రాహ్మణుల హింసాపరు లు. ఉత్తమజ్ఞానమును, సర్వభూత సంహిత బుద్ధియు చిత్తశాంతియు, మానవుద ప్రమాణమును, సమత్వ సత్యవాక్యకరణా పరత్వంబులును, బ్రాహ్మణునితో బుట్టును. వారలోరులు సేయు హింసలు వారించు పరమ కారుణ్య పుణ్యమూర్తులు,, అని చెప్పి సహస్రపాదుండు రురునకు సర్ప ఘాతంబు నందు పరిమ బుద్ధి బుట్టించె."

రౌద్రము.

"క్రోధము రౌద్రరసంబగు (కా,,చూ-2 100).

నన్నపార్యుడు భారతము నందు భీముని రౌద్రత నాశ్చర్య మేదయిన జరుగు సందర్భము నందీరసము విశేషముగ వర్ణించి యున్నాడు. చూడుము సభా 2-50 52, రాజసూయ యాగమగు చున్నప్పుడు, శ్రీకృష్ణుని కర్ఘ్యమిచ్చుటను గూర్చి రూక్షాక్షర వచసంబుల నాక్షేపించుచున్న శిశుపాలుంజూచి సహింపనోపక భీమసేనుం డతి రౌద్రాకారంబున నలిగిన.

చ॥ ప్రకటిత కోపవేగమున బద్మదళాయత నేత్ర
మూల్ భయానక తరలీల నాల్పైనరుణద్యుతి... ప్రభంజ
నప్రియుత నూజున కంతక మూర్తి కన్పటన్-

ఇట్లు నిఖిల క్షత్రియ సంత్రాసజనకంబుగా నలిగి దంత సందష్ట దారుణముఖుండై శిశుపాల నిర్మూలనాభీల సంరంభంబున నున్న భీమసేను వారించి-.........

2. మరియు దుశ్శాసనుండు ద్రౌపది కట్టిన పుట్టంబొలుచు సందర్భమున (సభా 2-232...) "అట్టి యవసరంబున భీమసేనుండు ద్రుపద రాజనందనకు దుశ్శాసనుండు సేసిన యవమానంబు సూచి కోపాక్రాంతచిత్తుండగుచు నంతకాకారంబున దంత సందష్ట దారుణ ముఖుండయి యెల్ల వారును విన నిట్లనియె:-

"కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవులనేకుల్ సూచుచుండన్ మదోద్ధరుడై ద్రౌపదినిట్లు చేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీకరలీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైలరక్తౌఘనిర్ఝరము ర్వీపతిసూచుచుండనని నాస్వాదింతు నుగ్రాకృతిన్ ఇట్లు సేయనైతినేని పితృపితామహుల గతికిందప్పిన వాడనగుదు ననిన నతని యతి మానుషంబయిన మహావ్యవసాయంబున కద్భుతంబందిరి. ఇందు వీరరసమును గలదు.

## వీరరసము

కం॥ విహితవిభావాదులచే ప్రహితోత్సాహంబు వీరరసము

కాచూ- 2-107-

సభా 1-125, 129, 131, 1-131

గీ॥ అనఘుయేము మువ్వురము మూడగ్నులట్లు, నీమహాయజ్ఞ కార్యంబు నిర్వహింతు। మాజరాసంధ పశువును నఖిల క్షాత్ర వాహుతుల జేసి తృప్తులమగుచు బలిమి.

వ॥ మరియు రాజసూయార్థంబు పరాక్రమంబున జరాసంధు వధియించి నిఖిల క్షత్రియ మోక్షణంబు సేయుటంత కంటె మిక్కిలి యశోధర్మంబులోండెయ్యవి? కావున మేము మువ్వురము క్రమంబునం బరాక్రమించి యాజరాసంధు డాసినదీప్రవాహంబులు వృక్షోన్మూలనంబు సేయునట్లు వాని నిర్మూలంబు సేసెదము.

## బీభత్సము.

కం॥ పలలాస్థి శోణితాదుల బలుమారును జూడనరుచి భావములో నందకు
కొత్తుని బర్హణ మది తల పోయు జుగుప్స. బీభత్సము.

నరసభూపాలీయము. 3-19.

1. తొల్లి నాలాయని యైన యింద్రసేనే యనం బరగిన పరమ ప్రతివ్రత మౌద్గల్యుండను మునికి భార్యయై యున్న కర్మవశంబున నమ్ముని కుష్ఠవ్యాధిబాధితుండై గళితశరీరుండు వయోవృద్ధుడు వలీపలిత తతను దుర్గంధ వదను నతి దుఃఖ జీవనతి కోపను విశీర్య మాంసనఖత్వచుం బరమ భక్తి నారాధించి యతడు ఛ్ఛిష్టంబ కుడుచుచున్న నొక్కనాడు కుడుచునెడ వాని పెను వ్రేలు కూటిలోన దునిసి పడనట్టి వ్రేలు పుచ్చియేవగింపక యుచ్ఛిష్ట మిష్టలీలదగిలి కుడుచుచున్న ).ఆది-7-256-257.

2. భీమసేనుండు....బకాసురుండున్న చోటికిం జని, యార్ద్ర శుష్క కళేబరమాంస దుర్గంధ నిందితంబైన బక స్థానంబు.

(ఆది-6-288)

భయానకము.

ఉక్త విభావాదులచే వ్యక్తంబగు భయమయగు భయానకము.

కా॥ చూ॥ 2-117.

1. కిమ్మీరుం జూచిన ద్రౌపది- ఆరణ్య 1-107.

2. ఇట్లు వృద్ధింబొంది దశసహస్రయోజనాయామంబులైన బాహుదండంబులును శతయోజనాయామంబులైన చరణంబులును దశయోజనాయామంబులైన దశనంబులును శశిరవిమండల సదృశంబులైన నయనంబులును దిగ్వ్యాప్త భోగ భాగ సంపూర్ణంబైన శరీరంబు నుంగలిగి భూమి యందొక్క హనువును దివంబున నొక్క హనువుగా వదనగహ్వరంబు దెఱచి జగజ్జన సంత్రాసన వ్యగ్రసంచలనంబైన దీర్ఘ జిహ్వాన ఘోష్ఠపుటంబునాకుచు నత్యుగ్రనాదంబున దిక్కులు వ్రయ్యనార్చుచు వచ్చు మహోత్కసుం జూచి సురేంద్రుండు వెఱచి-ఆరణ్య 3-195.

హాస్యరసము.

దృష్ట విభావాదులచే బుష్టంబగు హాసమందముగ హాస్యమగు.

చేకొని యతి వికృతములగు నాకారాలాప చేష్టితాదులు } కా॥మా. 269.
మాడన్ గైకొను మనో వికారస్వీకారము హాస్యము }

వరర భూపాలీ యము.3-11.

సభా 2-86. అట దుర్యోధనుండు దత్సభావిభవంబు సూచువేడ్క నయ్యయి ప్రదేశంబు లంగ్రుమ్మరు వాడు వివృతంబయిన ద్వార ప్రదేశంబు సంవృత ద్వారంబుగావగచి చొర నొల్లక, సంవృత ద్వారంబు వివృతంబని చొరంబోయిన తక్కవాటస్ఫటిక శిలాఘటిత లలాటుండయి సమ ప్రదేశంబున్న తంబుగా నగచి యొక్కసమకట్టి నీలా శ్మస్థగితంబైన విమల మణిస్థలంబు జలాశయంబుగావగచి ప రిధానంబెగ ద్రోచి కొని, స్ఫటిక దీప్తి జాలపరివృతంబయిన జలాశయంబు స్థలంబు గావగచి కట్టిన పుట్టంబు దడియంజొచ్చి క్రమ్మఱిన వానింజూచి పాంచాలియుం భీమ పాండవేయులును గింకరులును నగిరంత.

హాస్యర సోత్పత్తికి దంభపరుల గర్వ భంగమొక హేతువు.

1. ఆది.2-105. గరుడుని పైనాసవుండు వజ్రమెత్తి వైచిన నదియును నం బరంబున నగ్ని కణంబులు చెదరంబర తెంచి పక్షిరాజు పక్షంబులు దాక వచ్చినం జూచి గరుడుండునగి నీచేయు వేద నస్మ్యందాకనోపదు. నీవు మహాముని సంభవంబవ గుటను దేవేంద్రుని నాయుధంబ వగుటను నిన్నవమానింప రాదు. గావున మదీ యొకపర్ణశకల చ్ఛేదంబు సేయుము. నాయందు నీశక్తి యింతియ యనిన.

2. భీమ గర్వ భంగము ఆరణ్య-(3-3151-330)

## వృత్తులు.

1. కైశికి. 2 ఆరభటి 3 .భారతి 4 సాత్వతి. అని వృత్తులునాలుగు. స కల సుకుమార మధురార్థ సరళ రచిత కైశికీ వృత్తి. శృంగార కరుణ రసములు సు కుమారములు గావున వానినీ వృత్తిచే రచింతురు. ఆరూఢార్థ్యర్థ శాగ్ధ మారభ టి. రౌద్రబీభత్సము లిందు రచింతురు. భారతీవృత్తికైన కల్పనము నందు నర్థమిం చుక సుకుమారము. అల్ప మృదువులు హాస్యశాంతాద్భుతములు భారతీ వృత్తిచే నె

ప్పబడును. ఈమత్ప్రగల్భ సార్థరూపిణి సాత్త్వతి గావున వీరభయానకము లిందు రచింతురు. పూర్వోదాహృతము లైన రసవిషయక రచనలచే నీవృత్తులు నిరూపితములు. (కా॥చూ॥)

## మరికొన్ని రచనావిశేషములు

1. సజాతీయపద రచన. ఏకశబ్ద జనితములు, సజాతీయములు నైన పదములతోనే వాక్యములు కూర్చుట యందున్న పాఠ్యునికి ప్రీతి యధికము.

ఆది. 4. 22. కణ్వాశ్రమమున, యజ్ఞ ప్రయోగవిధి పుణులైన యాయాజ్ఞికులు విహితానుష్ఠానాసక్తులయిన యనుష్ఠాతలు, అధికతపోనిరతులయిన మహాతపోధనులు, నివసింతురు. ఆది 1-8. రాజరాజు సభలో శబ్దశాస్త్రపారగులైన వైయాకరణులు, భారతరామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులు, ... వివిధ తర్క విగాహిత ... తార్కికులు నాదిగాగలుగు విద్వజ్జనంబులు గలరు.

సభా 1-253. శాస్త్రవిహిత దండంబు దండింపంబోయిన .

ఆది 2-108. వజ్రజంబు పక్షిరాజు పక్షంబులందాక వచ్చె.

ఆరణ్య 2-534. పోష్యజనపోషణంబున కగువ్యయంబు.

ఆరణ 3-311. కరతల ప్రహారంబుల ప్రహరించుచు.

శబ్దాలంకారాదుల వివరించుచో నిట్టివి మరికొన్ని యుదాహరణము లియ్యబడినవి. ఇట్టి రచనలు నన్నెచోడుని కుమారసంభవమున విశేషముగా గలవు.

## 2. సంస్కృతాంధ్ర వాక్య సమ్మేళనము.

సందర్భమును, ఔచిత్యమును గమనించి, వేదాది సంస్కృత వాఙ్మయముల ప్రసిద్ధములయిన సంస్కృత వచనములను, తనకూర్పులందు నన్నయ నేర్పుగా పొందుపఱచుచుండును. స్వర్ణభూషణముల కూర్చిన జాతిరత్నములవలె మిగుల ప్రకాశించు నిట్టి సంస్కృత రచనల గొన్నింటిమాత్రము.

1. శ్యేనాః కపోతాన్ ఖాదయంతి. (ఆది3 231. కపోతార్థియైన శ్యేనము తన వాదము సమర్థించుకొనుటకు శిబిచక్రవర్తితో నన్నది).

2. అఙ్గాదఙ్గాత్సంభవసి: పున్నామోనరకాత్రాయతఇతిపుత్ర. (ఆది4-84,87. శకుంతలదుష్యంతునితో వచించినవి.

3. అపుత్రస్య గతిర్నాస్తి. ( పాండు రాజు సంతాపము. ఆది5-70.)

## సంస్కృతాంధ్రపదసమ్మేళనము.

దీనింగూర్చి శ్రీమాన్ తింజన గరము శేషప్పెరుమాళ్లయ్యగారు ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారి మధుర సభలో నిట్లు ప్రసంగించిరి. "నన్నయకవిత్వమున మాడిట నొకపాలు తెలుగు పదములుండును గదా? అతనిపదగుంభనమునందు మిక్కిలి ముఖ్యమై మనస్సునకమృతరసాయనము వలెనుండు వస్తువత్యంత మృదుత్వము. అమృదుత్వమును చప్పిడిగాక యుప్పుడు చిలికి యెత్తిన నవనీతము వలె హృద్యమై మిక్కిలి యాస్వాద్యమై ముద్దులొలుకు చుండును. అతడు సంస్కృత పదపటలముతో రెండొక యచ్చతెలుగు లేనియు ముచ్చటగా గ్రుచ్చగా నవి యాతత్సమములజిగిబిగియు, బటిమయు బిటారమును గలిగియె యుపమిటాశించుచుండును ... కేవల వీరభయానక రసములందును పటుపదార్భటితో దీర్ఘమా సఘాటి సాగించినను ఆధాటి యందును మెత్తదనంపు నీటుదీటు కొని యుండును. పదముల మార్దవంపు పెంపు సొంపున నర్థ సంపత్తి వీడుటలేదు గాని యొకానొకచో మృదుత్వమందలి పక్షపాతమున నో మృదుగుంభనముచే పైపయి విజృంభించురసము వలనపారవశ్యమున నో యనవసరమైన యొకానొక పదమును కూర్చుకొని యైనను, అతి దీర్ఘమగు సమాసమున కోర్చి యైనను గూర్పను నతిమృదువుగాను నిద్దముగాను దీర్పుట యందేకవికిమిక్కిలి యొంగన్న.... నన్నయమృదువులగు వానినేయేరి కడుముద్దుగానే కూర్చి బదలాలిత్యపోషణమును నర్థపుష్టితో దులదూగు నట్లుచేయును ... నన్నయరస సహకారమగు శబ్దలాలిత్యముచే చమత్కారుడన్నంజాలును....ఆయావాక్యముల నిలుపులను గొలతి పెట్టి సంతన కట్టియొక టొకటిపొంకముగా జతకూర్చి తీర్చినట్లుగాన వచ్చుచున్నది. అందు

మృదుత్వముతో గూడ నర్థమహిమయు మాధుర్య సంపదయు గూడికొని యుండును. పద్యావయవముల సంతనయు నత్యంత మగు బిగియు గంభీర మగు నడయు నీటుగుల్కుచున్నవి.

ఈరచనావిశేషములన్నియు నించుమించుగా నీతనివచనరచనలయందును గాన నగుచున్నవి. ఉదాహరణార్థము అరణ్య 3 311 పరిశీలింతము. ఇందచ్చ తెనుగుపదము లం బ్రత్యయములు వలయుముల పొధ్యమాపబడినవి.

(ఆ) సౌగంధికకమలం(బు జూచి దాని) యపూర్వరమణీయత్వం(బునకు) నశ్వరుసుమసాధారణం(బయిన) సౌరభ్యం(బునకు)(నోటువడి) ద్రుపదరాజ పుత్రిముదిత చిత్త(యై యుక్క-టా యిది యొక్క-పుష్పమయ్యె)నపూర్వం(బై)మనోనయనానంద కరం(బైనదియిట్టి) కుసుమం(బులు కడుం బెక్కు-లు గావలదె యటపీ తురగటంగల కని తె చ్చివాడు) వ నక్షెపియుంబు(కేయము మని యప్పుడ యప్పూర్వ) ధర్మరాజు (కడకుంగొని పోయెనిట) భీము(ండు దాని) యభిమతం(బు కేయుంగడంగి) రుక్మపృష్ఠం(బైన) ధను ర్శ్రేష్ఠ(ంబును)నాశీవిషోపమానమ్ము (లైన) బాణం(బులు) ధరి(యించియు) కట్ట-మల(ంబు దెచ్చిన గాడ్పున) కభిముఖుం(డై గాడ్పుపట్టి) గంధమాదన వివిధ రత్నబంధుర కందరద ర్శన (ంబులను) నళికుల కోకిలాలాపశ్రవణ(ంబులను) సర్వర్తుకుసుమ రుచిరగంధాఘ్రాణం బులను) నతిమధురఫలాస్వాదన(ంబులను) బద్ధప్రమోదహృదయు(ండగుచుదనకెదిరివచ్చు) మృగ(ంబులం దాకి) గజ(ంబు నెత్తి) గజ(ంబు పైవైచుచు) సింహ(ంబు నెత్తి సింహ(ంబు పైవైచుచు) నల్పమృగ(ంబుల) గరతలప్రహార(ంబుల ప్రహరించుచు... నరుగువాడు) నిజ సింహనాద శ్రవణ పరిత్రస్తం(బులై యెగసి పఱచు) పక్షు(ల) యార్ద్రపక్ష(ంబుల జూ చియుండట) నాసన్న(ంబువంగొలను కలదని) నిశ్చ(యించి) యతిత్వరిత గతి(నరిగి) ప వనవేగ సంచలిత తట మహావనత మాల తాల హింతాల నికాలక దళీదళవీజ్యమాన శీతలజల పరిపూర్ణ(ంబయిన యొక్క-) సరోవర(ంబుగని యందు) కృతావగాహ(ండై) నవన లినదళమృణాళవలయాలంకృతు(ండగుచు దాని వెలువడి) యనేక యోజన విస్తారా యామరమణీయం(బైన) కదళీ షండం(బు జొచ్చియందు) శంఖ ధ్మాన (ంబు జేసిన)

## Direct and Indirect Speech.

### 4. ప్రత్యక్షభాషణము. పరోక్షభాషణము.

సంభాషణ రంగములు రచించు నవసరమున నన్నయ యేపాత్ర యేమేమి వచించుననియు నుత్తమ పురుషలో కూర్చును గావున నాయంశముల గూర్చి వచన నాటకములు వ్రాయగడగు వారలు నన్నయ విరచిత పాత్రభాషణములను మార్పుచేయక యేయెత్తి వ్రాయ వచ్చును. ఇట్టి రచన కించుమించుగా ప్రతిపుట యందును నన్నయరచిత భారతమున గలవు. ఇది ప్రత్యక్షభాషణా విధానము రచించు పద్ధతి (Direct Speech) సంభాషణాంశముల సారము ప్రథమ పురుషలో రచించుట పరోక్షభాషణ రచన (Indirect Speech) ఇట్టి రచనలు నన్నయ బహుస్వల్పముగ జేసెను. ఈరెండు విధానములు నీక్రింది వచనమున జూడనగును.

అరణ్య 2-234.

అగస్త్యుడు స్వభార్యతో నిట్లనుచున్నాడు.

"నాకుల తపోధనంబు కాని యొండు ధనంబు లేదు నీకోరిన విధంబెట్లు నేయనేర్తు దపంబున చేసి సర్వంబునుం బడయనగు నంచేని నెల్లతపో వ్యయంబు సేయుదునని యగస్త్యుండు దాను భిక్షార్థి యై శ్రుతర్వుండను రాజుపాలికింబోయి యే మధనార్థులమై వచ్చితి నీపోష్యజన పోషణంబునకు విఘాతంబుగాకుండ మిగిలిన ధనంబు గలదేని నాకిమ్మని యడిగిన." ఇంత వరకు ప్రత్యక్షభాషణములు.

"అతండా యవ్యయంబులు సమంబులగటంజేసి మిక్కిలి లేమి దొరింగించిన వాడును దానును బ్రధ్నశ్వుండను రాజుపాలికిం బోయిన నతండును నయ్యారు పురందరవిభక్తిం బూజించి తదాగమన ప్రయోజనంబడిగిన దమవచ్చిన కార్యంబెఱింగించి యందుల నాయవ్యయంబులు సమంబులగుట యెఱిగి." ఇది పరోక్షభాషణము. ఇందు తదాగమన ప్రయోజనంబడిగి యనుదానికి బదులుగా "మీరేల వచ్చితిరి" అనియు తమ వచ్చిన కార్యంబెఱింగించి అను దానికి బదులుగా మేము ధనార్థులమై వచ్చితి మనియు రచించిన పక్షమున ప్రత్యక్ష భాషణమై యుండును. ఈసంభాషణ సారము ప్రథమపురుషలో రచించుట వలననిది పరోక్ష భాషణమైనది.

## సంకీర్ణ విషయములు.

ఇట్లు మృదుతరమై పదమైత్రి గలిగి నొడువుపలుకులతో పొదలు రమణీయార్థ మొదలించి లయించు కూర్పులతో నన్నయ భారతము రచించెను. ఆతడు వాక్యములో ముఖ్యాంశము వాక్యాంతము వరకు గుప్తముగా నుంచి ముందేమి వచ్చునో యను నాతురభావము పాఠకుల మనములనుత్పత్తి చేయుచున్నెంపడు. సంభాషణ రచనలలో గాక శేషించిన యాతని రచనలన్నియు దీర్ఘ వాక్యములలో కూర్పబడిన వేయయినను, ఆవాక్యము లేమి, అందలి యంతర్భాగము లేమి యన్వయ కాఠిన్యము లేక క్లిష్టములుగాక సులభ గ్రాహ్యములై యుండును. రచింప వలసిన విషయములవగా చదువరుల కెరిగింప వలసినయంశము లేమి యోయుండాతడు తెప్పగ గ్రహించి, తన మనస్సున ముందనుభవించి చూపల పాఠకులకు సుబోధకములగు నట్లును, వారల్ల మనస్సుల బట్టి మఱుపునకు రాకుండు నట్లును తేనె లొలుకు పలుకులతో రచించుట యాతని పద్ధతి. కనుక వాక్యములు దీర్ఘములైనను స్వకీయభావనలను తేటగాఁగనుగ నుపన్యసించుటయందతడు కడుకుశలుడు. వాక్యమునకును వాక్యమునకును, పద్యమునకును వచనమునకును సంబంధమెడ తెగక యుండునట్లుసముచ్చయ వ్యాపారమునతడు కడు నెఱపుగ నిర్వహించును. మరియు ముఖ్యకథతో సంబంధ మంతగా లేనియితి హాసముల నేకములు సందర్భశుద్ధి చెడకుండ నడుమ నడుమ చేర్పుతో నిముడ్చుట యందాతడు కడుచతురుడు. ప్రకృత్యాది సౌందర్య గ్రహణ వివరణములందాతనికి ప్రీతి యత్యంతము. నన్నయ యలంకార ప్రియుడేగాని యాతని యలంకారములర్థ వైశద్యాదులయిన యుక్తప్రయోజనముల నిమిత్తము సందర్భశుద్ధితో పొందు పరుపబడిన జాతి రత్నములుగాని, యౌచిత్యము వీడి శుద్ధ వాగాడంబరము కొఱకు తెచ్చిపెట్టుకొనెడి మెరుగు రాళ్లుగావు. ఉపమానోత్ప్రేక్షాది యుక్తమార్థలంకారములు మూలమున లేనివనేకము లాంధ్ర భారతమున గలవు. ఆయ్యావినన్నపార్యుని యుక్తిస్పష్టకవిత్వ మహిమను, మనోజ్ఞ కల్పనాచాతురిని పవిధముల ప్రదర్శించునట్టివై యుండును. వర్ణనల యందు గొన్నిచోట్లతప్ప మొత్తము మీద నీతని శైలి సర్వత్ర మిగుల సులభమును మాధుర్య పూరితమునై యున్నది. ఇట్లు బహిరంతస్స్ఫురితార్థోపహిత రసప్రసరమగుచు, సుఖసంగ్రాహపదలయముక్తస, మధురార్థ శ్రీకమునైయెసగు, ద్రాక్షాపాకమున

తాంధ్రభారతమును నన్నయ రచించెను. తరిచి చూచిన కొలది రసోత్కర్షమువేను భురతరమై యొప్పునాదివ్య కావ్యము ద్రాక్షాపాకమున బడిన దనుటకంటె యిక్షుపాకమున బడిన దనుట సమంజసము. శ్రవణానందకరమైన మధురగీతమును మరలమరల విననపేక్షించినట్లు స్వాద్యమై హృద్యమైన భారతమును వైరస్యమెరుగక మరల మరల చదువుచుగోరు చున్నాము. పదిశతాబ్దముల నుండి యాంధ్ర మహాజనులు దీని రసమును జాప్ప జూరగ గ్రోలుచున్నను దీనిరస మతిశయించు చునే యున్నది.

నన్నయ విరచితాంధ్రభారతము సంస్కృత భారతమునకు బానిస భాషాంతరీకరణముగాదు. పురాణ కథల యందలి సూచనల నాధారముగాజేసి కానిరాజారవివర్మ ప్రముఖ కళావిదులు నేత్రపర్వముగ చిత్రపటముల రచించి స్వకీయ మగు దివ్యప్రతిభ లోకమునకు బ్రదర్శించి యెల్లరవిస్మయానంద మగ్నులంజేయ గల్గినట్లుసంస్కృత భారతము నందలి కథానూచనలను గైకొని, ఔచిత్యమును, కళాసందర్భములను బట్టి స్వకల్పనలను విశేషముగాజేర్చి, వినువుబుట్టింపెడి యనవసరకథాజాలమున్విడిచి,మూలము కంటె నన్ని విధముల చేతను మధుర తరముగను మనోహర తరముగనుం డునట్లు నన్నయ యాంధ్ర భారతమును రచించి స్వకీయ ప్రతిభను ప్రదర్శించి మనకు పూజ్యుడగుచున్నాడు.

## ఉపసంహారము

ఆంధ్రభాషాపోషక శ్లాసన కల్పుండగు నన్నపార్యమహామహుడు రమణీయార్థ ప్రతిపాదకము లైగంభీర మృదుమధుర విమల ఘనశైలీ విరాజ మానములై పెంపు సొంపారు మనోజ్ఞ వచన రచనల బెక్కింటి జేసి యున్నాడు. అందలిగుణ విశేషముల నామతి కిందగిలిన వానింగ్రహించి నాచేర్చుకొలది యూచిన్న విమర్శనము న గ్రంథస్థము గావించి నాడను. నన్న పార్యునికి సమకాలికులై గొందరును, అతనికి పూర్వము గొందరును మృదు మధురరస భావ భాసురనవార్థ వచన రచనా విశారదుల యిన యాంధ్ర మహాకవులుండి యుందురు. వారిని గూర్చిగాని వారి వచన రచనల గూర్చిగాని మన కింత వరకేమియు తెలియరాలేదు. అట్టి మృదు మధుర రసభావ భాసుర నవార్థ వచన రచనా విశారదులయిన యాంధ్ర మహాకవులలో నన్నపార్యుడే మనకు తెలిసి నంత వరకు ప్రథము డు నగ్రగణ్యుడుగా గాన్పించు చున్నా,

డు. మరియు సగభాగము వచనముగా గల చంపూకావ్యముగా భారతము రచించి యుద్ధాకవితకు పద్య గద్యరచనా భేదము పాటింప నవసరముండదనియాకవి సిద్ధాంతము సుస్థాపించియున్నాడు. మరియునితీవల నాంగ్లప్రముఖ పాశ్చాత్య వాఙ్మయములలో గద్యరచన లెన్ని విధముల నెంపొందెనో, ఇంచు మించుగ నన్ని విధములను నన్నపార్యుని కవనమున నాంధ్ర వచన రచన పొడమూపెనని నిస్సందేహముగా చెప్పగలము. నన్నయ కృతమైన భారతము వైవస్వతుని నాక చందముచ భావి కావ్యసృష్టికి కర్త్యమైన సమస్త బీజవస్తుపరిపూరితము. నన్నయకు బిదపనాయావత్కవులెదేని యొకానొక విషయమున నతని కంటె నింత యుంత యతిశయించిన వారుగావచ్చును గాని యంత మాత్రమున నతని వన్నెకు గొంతకల్లదు ఏలయన బిమ్మట వారందరును నాతనిచేత తెస్సగా త్రొక్కిననగు మార్గమున సుఖముగ నడచి యాతడు సంతరించిన విజ్ఞానములను సులభముగా జేకొని మరి మరి వన్నె గూర్ప గలిగి యతనికన్న నొక్కొక్కటమిన్న లైరే గాని మరేమి కాదు. అతడాంధ్ర భాషను మిరింత యనుశాసించి మృదు మధుర కవితా భూషితంగా వించి తక్కిన మహాకవుల కెల్ల గూటస్థుండై యాంధ్రలోకంబున కేగాక యఖిల భాషా మనీషిస మూహములకు నలంకార భూతుడయ్యెంగావున మన యందరి నిరంతర స్తోత్రమునకు నత్యంత పాత్రుడని చెప్పదగి యున్నాడు. కావున

శ్లో॥ వాచామగ్రమ ఆంధ్రాణాం
ప్రవక్తా ప్రథమో భవత్.
ఆచార్యం తంకవీంద్రాణాం
వందే వాగను శాసనమ్

అని పండిత వర్యులచే నాతనింగూర్చి చేయబడిన స్తోత్ర శ్లోకముతో నాతని కావ్య విమర్శనము నుండి విరమించితిము.

సంపూర్ణము.

శ్రీ పార్వతీశ్వర ముద్రాక్షరశాల, యలమంచిలి.

## అనుబంధము 1.

### ఏకువాడల పాలెపు శాసనము. మూలము

౧ సస్తిస (కా) లబుధ (జ) నసంస్తూయమానసూర్య్యాన్వంశోద్భా
౨ (వ) రామభట్టారకావరప్రసాదలబ్ధరాజా (భీషే) కాసంపతి (శా) జధ్వ
౩ జపీతాంబర పతిగరు (డ) దప్యనధ్వజమా (దు) పురవరమేశ్వ
౪ (రపే) ంగీపుర బ్రహ్మ (ఘో) షణాశ్రయా శ్రీమాత్మాశాయాధిపతి
౫ యాయ్నవలూ(కా)మారాజు శ్రీమ్మతెలుమారాజు శ్రీమ
౬ న్ యిన్మడి బెడంగ్గరాజు శ్రీమ్మాత్ (శో) డపరాజు శ్రీ
౭ మాత్ కాలియంగ కణ్నరా(జా) శ్రీమత్ మావ్వాలగారుడ
౮ ణ్డాస్వస్తిసకాబ్దంబుల్డోంభనూటాన ల్వాదియగుశోణ్రి (కే) వమా

### రెండవరేకు మొదటి ప్రక్క.

౯ సమ్మంవ కృష్ణవక్షంనవమీ ఆదిత్యవారంస్వస్తి శ్రీమ
౧౦ తుమశాయాధిపతియుయ్నచో డయరాజులు పడవాలు
౧౧ నడపనేయకు (నకు) అగ్రహారంబుల(తో)డిపాడి యిచ్చి
౧౨ అగ్రహా (రం) బకానుగకి చెఱువులు దయచేసియి
౧౩ చ్చినసాస (స) నముపూర్వ్వతఃపోంగాట్టావిసీమ
౧౪ మసీమంనైరత్యతఃక (వు) లూతిసీమమసీమం
౧౫ దక్షిణతఃగత్రివిడి సీమమసీమంఅ (జ) యుతః
౧౬ రేంగుల చెఱువు సీమమసీమంపశ్చిమతః పోతిపూణ్ణి

### రెండవరేకు రెండుప్రక్క

౧౭ సీమమసీమంయిూసాన్యతఃవోంకాలపూణ్డిసీమమ సీమం
౧౮ పూర్వతఃసిస్తైల మొదత్సనీ (మ) మసీమందక్షిణతఃపా
౧౯ డవసీమమసీమందీని నెడపక నడపిరేని ఆలూదివే
౨౦ ళ్లణ్డస్వర్గమ్మున నుణ్డంగాన్తురు దీనికె అపిరేనివేయి
౨౧ సెఱువులు వేయిగా (వి) లలవేయిగుళ్లనుయూ

౨౨ త్రిరయావస (క్రస్తి) వతీసినవారు అఱువదివేలేండ్లు

౨౩ న:క యోనినుణ్ణుదురు దీనిగా పెదవారు (తా)ంమ్మి

౨౪ ర ణ్ణవరు.

మూడవరేకు మొదటిప్రక్క.

౨౫ దణ్ణె (ణ) కేతన పోతన కన్నమయిన్నల్వురుగవ.

౨౬ చెలువులకు అధిపతులు

## రెండవ అనుబంధము.

క్రీ॥శ॥ ఎనిమిదవశతాబ్దపు వాడగు సత్యాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహారాజను మ చాళుక్యరాజు వ్రాయించినశాసన మొకటి అనంతపురంజిల్లా. కొండు పల్లి గ్రామములోనొక పొలములో దొరకినది. అందులోని తెలుగువచన భాగమునీక్రింద వ్రాయుచున్నాను.

"స్వస్తి శ్రీ విజయాదిత్య సత్యాశ్రయ శ్రీ పృథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర భటారకిను విజయ రాజ్యసంవత్సరంబు లిరువది మూడు ప్రవర్తిల్ల బలికులక నరసింహ బాణాధిరాజు ప్రియతనూజ విక్రమాదిత్య బలిశాద్రబాణరాజులన్ తురవిషయంబు యేలేవారి ..............................."

అనంతపురము జిల్లా మమ్మిగుడి గ్రామము నకీశాన్యమున నున్న పొలములో దొరికిన మరియొక శిలాశాసనము నందలి వచన భాగముల నీక్రింద వ్రాయుచున్నాను. ఇదియు నీపృథ్వీవల్లభుని శాసనమే.

"స్వస్తి శ్రీ విక్రమాదిత్య సత్యాశ్రయ పృథ్వీవల్లభ మహారాజధిరాజపరమేశ్వర భటారకు విజయరాజ్యసంవత్సరంబుల్ ఇరువది ఎణ్డగు నేటి...ఇచ్చిరి దీని ఉచ్చువాడు పాతకు.

1985

